

" రేపిస్టుల కాళ్ళు
పట్టుకోవాల్సింది "

" అత్యాచారాలు
పట్టణాల్లోనే"

" పాశ్చాత్య జీవనశైలి
వల్లే మహిళలపై
అఘాయిత్యాలు"

" గీత దాటితే
దెబ్బతింటారు "

" అది చిన్న
సంఘటనే"

" అర్ధరాత్రి స్వాతంత్ర్యం
వచ్చిందని
అర్ధరాత్రివేళ తిరుగుతామా" !

**పురుషాధిక్య సంస్కృతికి అద్దం పడుతున్న పెద్దల వ్యాఖ్యలు**

# "వెలగని బల్బులు- మండుతున్న బిల్లులు"

చైతన్య మానవి

సంపాదకీయం...

ఎన్నికల ముందు విద్యుత్ చార్జీలు పెంచబోమని వాగ్దానం చేసిన కాంగ్రెసు పార్టీ అధికారంలోకి వచ్చిన తర్వాత భారీగా విద్యుత్ చార్జీలుపెంచి ప్రజలపై పెనుభారాన్ని మోపింది. పరిశ్రమలు, చేతి వృత్తులు, చేనేత వ్యవసాయరంగం, వినియోగదారుల వరకూ అన్ని తరగతులకూ విద్యుత్ షాక్ ఇచ్చింది. ఇప్పటికే పలు భారాలతో సతమతమవుతున్న సామాన్య ప్రజలు, ముఖ్యంగా మహిళలకు కరెంట్ చార్జీలు మరింత భారం కానున్నాయి. కరెంట్ కోత, విద్యుత్ చార్జీల మోత కారణంగా మహిళలు ఉపాధి కోల్పోతున్నారు.

గత మూడేళ్ళలో 7వేల కోట్లకు పైగా చార్జీలను ప్రభుత్వం పెంచింది. ఇది కాకుండా ఎస్ఎఫ్ఎ పేరుతో 9,942 కోట్లు భారాలను విధించింది. ప్రస్తుతం మరో రూ. 2166కోట్ల ఎస్ఎఫ్ఎ విధింపుకు రంగం సిద్ధం చేస్తోంది. 2013-14 ఏప్రిల్‌లో మరో రూ. 12,723 కోట్ల చార్జీలు పెంచేందుకు సిద్ధపడుతున్నది. విద్యుత్తు చార్జీలకు తోడు ఇంధన సర్దుబాటు చార్జీల పేరుతో గత నాలుగు సంవత్సరాలో రు. 9242 కోట్ల భారాలను మోపింది. విద్యుత్ చార్జీలు, మినిమమ్ చార్జీలు పేరుతో అధిక మొత్తాలలో కనపడని రీతిలో గుంజుతున్నది.

ఇంత భారీ మొత్తాలను వినియోగదార్లు చెల్లిస్తున్నప్పటికీ నాణ్యమైన విద్యుత్ నిరంతరాయంగా లభించటంలేదు. విపరీతమైన విద్యుత్ కోతలతో నేడు రాష్ట్రమంతా అంధకారంలో చిక్కుకుంది. పరిశ్రమలు వారంలో సగం రోజులు కూడా పనిచేయడం లేదు. వ్యవసాయానికి ఏడు గంటలు ఉచిత విద్యుత్ యిస్తామని చేతులెత్తేశారు. కరెంట్ ఎప్పుడు వస్తుందో తెలియక రైతన్నలు దిక్కుతోచని స్థితిలో వున్నారు. వృత్తిదారుల బతుకులు అస్తవ్యస్తమయ్యాయి. గృహాలకు గ్రామాలలో 12 గంటలు, నగరాలు, పట్టణాలు 3 నుండి 6 గంటలు విద్యుత్ కోత పడుతున్నది.

ఎడతెగని విద్యుత్ కోతల వలన ధాన్యం మిల్లులు, పిండి మిల్లులు, మరమగ్గాలు, పౌల్ట్రీలు చిన్న వ్యాపారులు తీవ్ర నష్టాలపాలై ఉపాధి కోల్పోతున్నారు. సరళీకరళ విధానాల అమలు తర్వాత ఇంటాబయటా మహిళల శ్రమ పెరిగింది. పని సౌలభ్యం కోసం ఎలక్ట్రికల్ కుక్కర్, వాషింగ్‌మిషన్, మిక్సీలు, గ్రైండర్లు, ఫ్రిజ్‌లు మధ్యతగతి నుండి పైతరగతి వరకూ వాడకం పెరిగింది. పెరిగిన కరెంట్ బిల్లుల మోతతో వస్తువులు వాడాలంటే గుండె గుభేల్‌మంటోంది.

రాష్ట్రంలో సహజ వనరులు బొగ్గు, గ్యాస్, నీళ్ళు సమృద్ధిగా ఉన్నా ప్రభుత్వం తప్పుడు కారణాలు చెప్పి తన చేతకానితనాన్ని కప్పి పెట్టుకుంటుంది. విద్యుత్ రంగ నిపుణులు, మేధావులు, రాజకీయ పార్టీలు చెప్పినట్లు పాలకులకు ముందుచూపు లేదు., ప్రభుత్వం కార్పొరేట్ సంస్థలకు బొగ్గు, గ్యాస్, నీళ్ళు యిచ్చి దాసోహం అంటోంది. పెద్ద మొత్తాలు చెల్లించి బయటిరాష్ట్రాల నుండి విద్యుత్‌ను కొనుగోలు చేస్తుంటే మన రాష్ట్రంలోని ప్రైవేటు విద్యుత్ సంస్థలు విద్యుత్‌ను బయట వారికి అమ్ముకుంటున్నాయి. ప్రభుత్వం అనుసరిస్తున్న లోపభూయిష్ట విధానాల ఫలితంగా విద్యుత్ భారాలు పెరుగుతున్నాయి. జెన్‌కో లాంటి ప్రభుత్వ రంగ సంస్థలపై కేంద్రీకరిస్తే ఈ నష్టాలు వుండవు.

విద్యుత్ చార్జీల పెంపుకి వ్యతిరేకంగా పోరాడుదాం. బిజిలీబంద్, బిల్లులు నిరాకరణ వంటి ఉద్యమాలలో భుజం భుజం కలుపుదాం!



## సూక్తి

మానవుడు సృష్టించిన అద్భుతాల్లో పుస్తకాలు మహత్తరమైనవి.

- గోర్కీ




### అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం రాష్ట్ర కమిటీ

చిరునామా:
బ్లాక్ నెం. 24, హెచ్ఐజి ఫేజ్: 2,1-8-1,
బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ - 500 044.
ఫోన్ : 27605845.

e-mail chaitanyamanavi@gmail.com

సంపాదకులు

**టి. జ్యోతి**

సంపాదక వర్గం

**మల్లు స్వరాజ్యం**

**అల్లూరి మన్మోహిని**

**ఎస్. పుణ్యవతి**

**కె. స్వరూపరాణి**

మేనేజర్

**ఎం. సుధ**

**విరాళం రూ : 10/-**

ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, అజమాబాద్, హైదరాబాద్ - 500 044.




## ఈ సంచికలో...

# మార్పుకు నాంది 'నిర్భయ' ఘటన

- కె.స్వరూపరాణి




ఢిల్లీ పారా మెడికల్ విద్యార్థినిపై జరిగిన అమానుష ఘటన మానవత్వం ఉన్న ప్రతి ఒక్కరిని కదిలించింది. దేశంలో మహిళలపై అకృత్యాలు జరగని రోజులేదు. అధికారిక లెక్కల ప్రకారం ప్రతి 22 నిమిషాలకు ఒక మహిళపై అత్యాచారం, 76 నిమిషాలకు ఒక బాలికపై రేప్, ప్రతి గంటకు 18మంది మహిళలు హింసాత్మక వేధింపులకు గురవుతున్నారు. సరళీకరణ విధానాలు అమలు జరుగుతున్న గత మూడు దశాబ్దాలలో 825 శాతం మహిళలపై నేరాలు పెరిగాయి. (నేషనల్ క్రైం రిపోర్టు) మహిళలు, బాలికలపై హింస మన సమాజంలో అంటు వ్యాధిలా మారి వ్యవస్థాగతమైంది. 14 సంవత్సరాల లోపు బాలికలపై లైంగిక నేరాలు పెరుగుతున్నాయి. అమ్మాయిలు ఒక గంట ఇంటికి రావటం ఆలస్యమైతే తల్లిదండ్రుల ఆందోళన అంతా ఇంతా కాదు. ఈ నేరాల పెరుగుదలకు కారణాలను సమగ్రంగా సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ కోణాల నుండి విశ్లేషించాలి.

ఢిల్లీ ఘటన మహిళల భద్రత అంశం రాజకీయ ఎజండాలోకి తెచ్చింది. అమానవీయ దాడికి బలై మృత్యువుతో పోరాడింది నిర్భయ. ఆమె మరణం యువత అంతరంగాన్ని తట్టి లేపింది. రాజ్యాధికార కేంద్రంగానే కాకుండా సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక జీవనానికి మార్గదర్శకంగా నిలవాల్సిన దేశ రాజధాని హింసకు, అరాచకాలకు, అవినీతికి, అసాంఘిక శక్తులకు అడ్డాగా, అత్యాచారాలకు రాజధానిగా ప్రసిద్ధికెక్కింది. ఢిల్లీ విఐపిలకు అంతులేని భద్రతా ఏర్పాట్లు చేస్తూ సామాన్యులకు మాత్రం భద్రత ఊసే ఉండదు. మహిళలకు రక్షణ కరువైన దేశంగా భారత్ అంతర్జాతీయంగా అపఖ్యాతి మూటకట్టుకుంది.

ఢిల్లీ దురాగతం తర్వాత కూడా దేశ రాజధానితో సహా అనేక రాష్ట్రాలలో మహిళలపై అత్యాచార పరంపర ప్రతినిత్యం కొనసాగుతూనే ఉంది. జనారణ్యంలో పైశాచిక ప్రవృత్తి నిండిన మానవ మృగాలు అమాయక బాలికలను, మహిళలను వేటాడుతూనే వున్నారు. వారి ఆక్రందనలు గాలిలో కలిసిపోతున్నాయి. ఢిల్లీ అత్యాచారం, హత్య కేసులలో ముద్దాయిలకు ఉరిశిక్ష వేయాలని, రసాయనాల ద్వారా నపుంసకులుగా మార్చాలని, యావజ్జీవ శిక్ష వేయాలని రకరకాల వాదనలు వచ్చాయి. కలకత్తాలో 13 సంవత్సరాల పాపను అతి ఘోరంగా రేప్ చేసి చంపిన కేసులో ధనుంజయ్‌కి ఉరిశిక్ష పడింది. అలాగే యాసిడ్ దాడికి బలైన స్వప్నిక కేసులో ముగ్గుర్ని ఎన్‌కౌంటర్ చేశారు. అయినా ఈ దాడులు ఆగాయా? అందువలనే మనం మూలాల్లోకి వెళ్ళాలి. మార్కెటీకరణ పెరిగే కొలదీ మహిళలపై హింస పెరుగుతోంది. సరళీకరణ విధానాలు కొత్త సంస్కృతికి పునాది వేశాయి. ఆడపిల్లలను అంగడి సరుకుగా చూసే ధోరణి విశ్వవ్యాప్తమైంది.

అందాలపోటీలు, బ్యూటీపార్లర్స్, సినిమాలు, టివిలు ఒకటేమిటి ప్రతిదీ అమ్మాయిల చుట్టూనే తిరుగుతున్నాయి. ఆడపిల్లల్ని కించపరిచేపదజాలం వెర్రితలలు వేస్తుంది. భాష, భావం మహిళలను అవమానపరిచేవే. నయా వుదారవాద విధానాలు మహిళలను మధ్యయుగాల నాటి సంస్కృతి వైపుకి నెట్టే పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

హింసకు వ్యతిరేకంగా పోరాడేటపుడు దాన్ని కేవలం స్త్రీ, పురుషుల అంశంగా మాత్రమే చూడకూడదు. మహిళలపైన హింస పెరిగేందుకు కారణమవుతున్న రాజకీయ విధానాల్ని విశ్లేషించాలి. పితృస్వామ్య భావజాలంతో కూడిన పురుషాధిపత్య విలువలు, సంస్కృతుల్ని అవి పెంచిపోషిస్తున్నాయి. ఈ విధానాల్ని వ్యతిరేకించాలి.

ప్రపంచీకరణ విధానాలు ప్రజల మనస్సులు, ఆలోచనలు, ప్రవర్తనను సైతం లొంగ దీసుకునేందుకు పూనుకుంటున్నాయి. దీనికి ప్రతిగా మితవాద శక్తులు సంప్రదాయం పేరిట చూపించే ప్రత్యామ్నాయం కూడా స్త్రీలను పరాధీనత వైపుకు నెట్టేదిగా వుంటున్నది. పురుషుల రక్షణలో ఆడది అణిగి మణిగి వుంటే సమస్యలేమీ రావని వీరు ప్రవచిస్తున్నారు. మనుస్మృతి

సూత్రాలను వల్లించే బిజెపి, ఆర్ఎస్ఎస్, ఆధ్యాత్మిక గురువులు ఢిల్లీ గ్యాంగ్ రేప్ ఘటన తర్వాత బాధితులనే టార్గెట్ చేస్తూ అవాకులూ, చవాకులూ పేలారు. ఇటువంటి తిరోగామి శక్తుల భావాల్ని మనం పూర్తిగా వ్యతిరేకించాలి. స్త్రీలు ఏవిధమైన దుస్తులు ధరించాలి. ఎలా ప్రవర్తించాలి అంటూ నియమాలను విధించటం మొదలుపెడితే అది చివరికి వారిని పరాధీనతకి గురి చేస్తుంది. రెచ్చగొట్టే దుస్తులు వేసుకున్నందువల్లనే యువకులు నీ వెంట పడ్డున్నారంటూ బాధితురాలినే తప్పు పట్టే సామాజిక ధోరణి పురుషాధిక్య దృక్పథం వల్లనే వస్తుంది.

సరళీకరణ విధానాలు అమలు తర్వాత ఫ్యూడల్ విలువలు, వ్యాపారీకరణ జరిగింది. పూర్వం మగవాడికి సేవ చేయటమే పాతివ్రత్య ధర్మం. నేడు ఫలానా బ్రాండ్ వాషింగ్ మిషన్ లేదా కుక్కర్ సహాయంతో ఆమె పాతివ్రత్య ధర్మాన్ని సమర్ధవంతంగా నిర్వహించగలదు. ప్రపంచీకరణ యుగాన సబ్బుల నుండి ట్రాక్టర్ల వరకూ ప్రతి వస్తువు అమ్మకానికి మహిళల శరీరాన్ని ప్రకటన కొరకు వినియోగిస్తున్నారు. ఈ విధంగా స్త్రీలను కేవలం లైంగిక సరుకుగా ప్రదర్శించటం వలన మహిళలపై లైంగిక హింస అధికమవుతున్నది. మీడియాలో కనిపించే వ్యాపార ప్రకటనలలో పదింటిలో ఏడు ఇదే విధంగా వుంటున్నాయి. దీనివలన మానవ సంబంధాలు అర్థమే మారిపోతున్నది. లైంగిక సుఖమే పరమావధి అన్నచందంగా మారాయి. స్త్రీ పురుషుల మధ్య అసమానతలు నెలకొని ఉన్న సమాజంలో మహిళలపై అన్ని విధాల దోపిడీ తీవ్రమవుతున్నది.

గతంలో నేరస్థుడ్ని సమాజం ఛీ కొట్టేది. నేడు ఉదాసీన వైఖరినవలంబిస్తోంది. మహిళలపై వేధింపుల పట్ల సాధారణ ప్రజానీకం స్పందన తగ్గిపోతున్నది. అస్సాం రాజధాని గౌహతిలో యువతిని వివస్త్రను చేస్తుంటే సినిమాల్లో చూసినట్లు వందలాది మంది ప్రేక్షకపాత్ర వహించారు. ఢిల్లీ నిర్భయ కేసులో కూడా అదే విధంగా జరిగిందని, "చోద్యం చూశారు తప్ప వివస్త్రగా ఉన్న ఆమెకు బట్ట కప్పండని ప్రాధేయపడినా ఎవరూ ముందుకి రాలేదని" నిర్భయ స్నేహితుడు చెప్పాడు. నేరమయ రాజకీయాలు పెరిగిపోయిన ఈ కాలంలో స్త్రీలను లైంగికంగా హింసించే ప్రబుద్ధులకు సైతం రాజకీయ, పోలీసు, న్యాయ వ్యవస్థల నుండి అండదండలుంటున్నాయి. ఢిల్లీలో 2011లో 685 అత్యాచార ఘటనల్లో ఒక్క కేసులో మాత్రమే శిక్ష పడటమే దీనికి తార్కాణం. బాధ్యతాయుత స్థానాల్లో వున్న వారు,అందరికీ ఆదర్శంగా వుండవల్సిన ప్రజాప్రతినిధులే క్రిమినల్స్‌గా లైంగిక హింసకు పాల్పడుతున్నారు.దేశవ్యాప్తంగా చట్టసభలలోవున్న 4778లో 1785మంది లైంగిక హింసకు పాల్పడి నేర విచారణ ఎదుర్కొంటున్నట్లు లెక్కలు తెలుపుతున్నాయి. రాజ్యసభ డిప్యూటీ

**హింసకు వ్యతిరేకంగా పోరాడేటపుడు దాన్ని కేవలం స్త్రీ, పురుషుల అంశంగా మాత్రమే చూడకూడదు. మహిళలపైన హింస పెరిగేందుకు కారణమవుతున్న రాజకీయ విధానాల్ని విశ్లేషించాలి. పితృస్వామ్య భావజాలంతో కూడిన పురుషాధిపత్య విలువలు, సంస్కృతుల్ని అవి పెంచిపోషిస్తున్నాయి. ఈ విధానాల్ని వ్యతిరేకించాలి.**

చైర్మన్ జోసఫ్‌కురియన్,తివారీలాంటి వారు నేరారోపణలు ఎదుర్కొన్నవారే.ఇలాంటి వ్యక్తులకు ప్రజాప్రతినిధులుగా నిలబడే అర్హతను నిలువరించాలి.నేరస్థులు ఎంతటి వారైనా శిక్షింపబడాలి.

మహిళల భద్రత అంశాన్ని ఏదో ఒక ఘటనకు పరిమితం చేయటం సరికాదు. అధికార స్థాయిలో నిరంతర పర్యవేక్షణ, అప్రమత్తత ఉండాలి. ఇలాంటి ఘటనలు పునరావృతం కాకుండా వుండటానికి రక్షణ వ్యవస్థ పనితీరులో సమూల మార్పులు అవసరం. మన చట్టాలను అమలు చేసే, న్యాయాన్ని అందించే వ్యవస్థలు పనితీరు మెరుగుపడాలి. కేసులను శీఘ్రంగా విచారించేందుకు తగినన్ని ఫాస్ట్ ట్రాక్ కోర్టులు, న్యాయవాదులను నియమించాలి. ఈ అసమాన వ్యవస్థలో మార్పు రావాలంటే సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక, రాజకీయ అంశాల్లో మార్పులు అనివార్యం. ఇందుకోసం చట్టాల్లో, నేర శిక్షాస్మృతిలో, పాలనా, న్యాయ వ్యవస్థలో మహిళా పక్షపాత నిబంధనలు అమలు జరపటంతోపాటు సమాజంలో స్త్రీలను అంగడి సరుకుగా చిత్రీకరిస్తున్న ధోరణులు రూపుమాపాలి. స్వేచ్ఛా, సమానత్వం, సౌభ్రాతృత్వం పై ఆధారపడిన ఆధునిక ప్రజాస్వామ్య పునాదులను మన రాజ్యాంగం బీటలు వేసింది. అది కులం, మతం, లింగ భేదంతో నిమిత్తం లేకుండా సమానత్వానికి గ్యారంటీ యిచ్చింది. ఫ్యూడల్ వ్యవస్థలో వేళ్ళూనుకున్న కులం, మతం ద్వారా మహిళల అణచివేతతో పాటు పెట్టుబడిదారీ సంస్కృతిలో స్త్రీని మార్కెటు సరుకుగా చూసే ధోరణులను నిరోధించాలి.నిర్భయ ఘటన తర్వాత నియమించబడిన జస్టిస్ వర్మ కమిటీకి దేశ నలుమూలలనుండి మహిళాసంఘాలు, సామాజిక కార్యకర్తలు, మేధావుల నుండి హింసా నివారణకై తీసుకోవల్సిన చర్యలపై 80వేల ప్రతిపాదనలు పంపారు. వాటిని క్షుణ్ణంగా పరిశీలించి 29 రోజులలో 657పేజీల నివేదికను ప్రభుత్వానికి పంపారు.మహిళలపై నేరాలు పెరగటానికి ప్రభుత్వ, పోలీసు వైఫల్యంతోపాటు భారతదేశంలో కొనసాగుతున్న లింగ వివక్ష కూడా కారణం అని ప్రత్యేకంగా పేర్కొంది. వర్మకమిటీ చేసిన సిఫారసుల నేపథ్యంలో మన రాష్ట్రంలో కూడా మహిళలపై హింస నివారణకు తీసుకోవల్సిన చర్యలపై ప్రభుత్వం వెంటనే స్పందించాలి.



# నిర్భయ(జ్యోతి)పై అత్యాచారానంతరం

- వేములపల్లి సత్యవతి

**16**-12-2012న నిర్భయ(జ్యోతిసింగ్ పాండే)పై జరిగిన ఘోరకలి ఇంతవరకు నేర చరిత్రలో లిఖితమవలేదని ఫోరెన్సిక్ నిపుణులు వెల్లడించారు. ఇంతకు ముందు కూడా మహిళలు, యువతులపై సామూహిక అత్యాచారాలకు గురయ్యారు, నేడు గురవుతూనే ఉన్నారు. అత్యాచారాలతోపాటు యాసిడ్ దాడులు, హత్యలు, లైంగిక వేధింపులు, వరకట్న చావులు, గృహ హింసలు, ఈవ్ టీజింగ్‌లు మన సమాజంలో నిత్యకృత్యాలయ్యాయి. నిర్భయ కంటే ముందు బస్‌స్టాప్‌లో నిలబడి ఉన్న యువతి రాజధాని ఢిల్లీలో సామూహిక అత్యాచారానికి గురయింది. కారులోవచ్చిన నల్గురు కీచక యువకులు ఆమెను కారులోనికి లాక్కుని ఢిల్లీ రోడ్లపై కారు నడుపుతూ ఒకరి తర్వాత ఒకరు యువతిపై అఘాయిత్యం చేశారు. ఒక్క మన దేశంలోనే కాదు. అనేక దేశాలలో మహిళలు అనేక రకాలుగా బాధితురాళ్ళు అవుతున్నారు. హైతీ దేశంలో నీటి కొరకు కొన్ని ఫర్లాంగుల దూరం వెళ్ళ వలసివస్తుంది. దారిలో లైంగిక వేధింపులకు గురయ్యే అవకాశముంది. యువతులు నీటికి వెళ్ళేటపుడు అందంగా కనిపించకుండా ఉండటానికి ప్రయత్నిస్తారు. జీనుపై జీను ధరించి లావుగా, వికృతంగా కనిపించేలాగ వస్త్రధారణ చేసుకుంటారు. ఆ దేశంలోని ఒక తెగలో ఘోరమైన సాంఘిక దురాచారమున్నది. యుక్తవయసు వచ్చిన బాలికలలో లైంగికేచ్ఛ కలగకుండా మర్మాంగంలోని కొద్ది భాగాన్ని కత్తిరించివేస్తారు. ఈ పని శాస్త్రీయ పద్ధతిలో కాకుండా నాటు పద్ధతిలో చేస్తారు. ఒక బాలిక మర్మాంగాన్ని కత్తిరించే సమయంలో మూత్రాశయానికి సంబంధించిన భాగం కూడా కత్తిరించబడింది.

నిర్భయకు, ఆమె మిత్రునికి సకాలంలో వైద్యం జరగలేదు. నగ్నంగా రోడ్డు ప్రక్కన పొట్టపై పేగులు బయటకు వచ్చిన నిర్భాగ్యురాలు నిర్భయ. ఆమె, ఆమె మిత్రుడు 45 నిమిషాల వరకు నెత్తురోడుతూ రోడ్డు ప్రక్కనే పడివున్నారు. ఆమె మిత్రుడు కారుల్లో వెళ్ళే వారినాపి సహాయం కొరకు అర్థిస్తూ, అరుస్తూ ఉన్నప్పటికీ ఎవరూ స్పందించి ఆసుపత్రిలో చేర్చలేదు. గుమిగూడిన జనం కూడా ప్రేక్షకపాత్ర పోషించారు. నగ్నంగా వున్న వారి వంటి మీద ఒక్క గుడ్డముక్క కూడా కప్పలేదు. మిత్రుడు వేడిన మీదట ఎవరో ఒక దుప్పటి విసిరేస్తే నిర్భయ వంటిపై ఆ యువకుడు కప్పాడు. సకాలంలో వైద్యం అందితే నిర్భయ పరిస్థితి వేరుగా ఉండేదని, విధి నిర్వహణలో ఉన్న కానిస్టేబుల్ ఆలోచించి వర్తమానం అందించిన తర్వాత పోలీసులు వాహనంతో వచ్చారని నిర్భయ మిత్రుడు తెలిపాడు. వచ్చిన తర్వాత ఈ దుర్ఘటన జరిగిన చోటు ఏ పోలీసు స్టేషన్ పరిధిలోనికి వస్తుందని తర్జన భర్జనలతో కాలయాపన చేశారని, ఎవరూ సహకరించలేదని, తానే అతి కష్టం మీద నిర్భయను తన చేతులతో పోలీస్ వాహనంలోకి చేర్చానని తెలిపాడు. నిర్భయ తండ్రి కూడ ఆ యువకుని ధైర్య సాహసాలను, సంస్కారాన్ని ఎంతగానో ప్రశంసించాడు. తర్వాత ఆ యువకుడు ప్రేక్షకుల సెల్ ఫోన్ ద్వారా తన బంధువులకు యాక్సిడెంట్ జరిగిందని తెలిపితే వారు వచ్చి తనను ఆసుపత్రికి తీసుకెళ్ళారని, అక్కడ కూడా సత్వరచికిత్సకు తాత్సారమే జరిగిందని అన్నాడు. ఫాస్ట్ ట్రాక్ కోర్టులో న్యాయాధీశుని ఎదుట సాక్ష్యం చెప్పటానికి వీల్‌చైర్‌లో వచ్చాడు. సఫ్దర్‌జంగ్ ఆసుపత్రిలో నిర్భయకు చికిత్స జరుగుతున్న సమయంలో తోటి విద్యార్థుల యాసిడ్ దాడికి గురయి కునారిల్లుతూ ఉంది 17 ఏండ్ల పేద విద్యార్థిని. ఆమెను పట్టించుకున్న నాథుడు లేదు. ప్రభుత్వం కూడ ఆదుకోలేదు. గత సంవత్సరం (2012)లో గౌహతిలో 15-16 సంవత్సరాల మైనర్ బాలికను 20మంది ముష్కరులు చుట్టుముట్టి రోడ్డుపై ఎత్తి పడేసి చిత్రహింసలకు గురిచేస్తూ ఉంటే పోగయిన ప్రజలు గారడీ ఆటను చూస్తూ ఉన్నట్లుగా చూస్తూ ఊరుకున్నారు. తమ తోబుట్టువులయిన అక్క చెల్లెండ్రుగాని, లేక తమ కూతుళ్ళుగాని ముందుముందు ఇలాంటి దురాగతాలకు గురవుతారేమోనన్న తలంపు పోగయిన పురుషులలో ఒక్కరికి కూడా కలుగలేదు. ఇందుకు ముఖ్యమైన కారణాలు రెండు కావచ్చునేమో. పురుషాధిక్య భావజాలంలో మార్పు రాకపోవటం, మహిళా సాధికారత అంటే పురుషులకు వ్యతిరేకమన్న భావం కావచ్చు. మహిళా సాధికారత అన్న పదానికి అర్థం హక్కుకు ప్రతీక. ఇక రెండవ కారణం మన భక్షక భటుల(పోలీసుల) తీరు. వర్తమానం అందించిన

అన్నిటికన్నా జుగుప్సాకరమైన ఘటన గత సంవత్సరం నవంబర్ 22న జరిగింది. 18 నెలల పసికూనపై 21 ఏండ్ల జితేంద్రనాథ్ అఘాయిత్యానికి పాల్పడ్డాడు. ఆ కేసుకు సంబంధించిన అభియోగపత్రాన్ని పోలీసులు 18 జనవరి 2013న దాఖలు చేశారు. ఆ రోజు నుంచి జిల్లా సెషన్స్ కోర్టు న్యాయాధీశుడు జగదీష్ బహెతి శరవేగంగా విచారణ జరిపి పదంటేపది రోజు తీర్పుచెప్పాడు. ఆ మృగానికి 14 ఏండ్ల కఠిన కారాగార శిక్షతోపాటు అయిదువేల రూపాయ జరిమానా విధిస్తూ కోర్టు తీర్పు చెప్పారు. ఆ మృగం జీవించి వున్నంత వరకు జైలు శిక్ష విధిస్తే ఇంకా బాగుండేదేమోననిపిస్తుంది. తమిళనాడులో ఫిబ్రవరి నెలలో ఇలాంటి ఘటనే 18 మాసాల పసికూనపై జరిగింది. అఘాయిత్యానికి పాల్పడిన వాడి తల్లి అవమానభారంతో ఆత్మహత్య చేసుకుంది. 39 సంవత్సరాల క్రితం ముంబయిలోని ఆసుపత్రి నర్సుపై వార్డు బాయ్ అతి ఘోరంగా అఘాయిత్యం చేశాడు. ఆమె కోమాలోనికి వెళ్ళిపోయి కెవిఎమ్ ఆసుపత్రిలో జీవచ్ఛంలా నేటికీ మంచాన పడి ఉంది. ఆ ఆసుపత్రి నర్సులే సపర్యలు చేస్తున్నారు.

వారిని సాక్ష్యం కొరకు పోలీసు స్టేషన్ల చుట్టూ, కోర్టుల చుట్టూ తిప్పితిప్పి తిప్పలు పెడతారు. కొన్ని కొన్ని సందర్భాలలో తమకు అనుకూలంగా సాక్ష్యం చెప్పమని వేధింపులకు, బెదిరింపులకు గురిచేస్తారు. పుణ్యానికి పోతే పాపమెదురయినట్లు బాధితులకు సాయపడటానికి పోయి పోలీసులతో చిక్కులు కొని తెచ్చుకోవటమెందుకన్న భావన కావచ్చు. నిర్భయపై అఘాయిత్యం జరిగిన మరునటి రోజు(17-12-12)న మూడేండ్ల ముక్కువచ్చులారని చిన్నారిపై చిన్నారి చదువుకునే పాఠశాల నిర్వాహకురాలి భర్త అత్యాచారం చేశాడు. అదేరోజు మధ్యాహ్నం రెండు గంటల వేళలో యిరువురు దుర్మార్గులు ఒక యింటిలోనికి ప్రవేశించి 45 ఏండ్ల మహిళను ఆగం చేశారు. ఈ రెండూ రాజధాని ఢిల్లీలోనే జరిగాయి. ఢిల్లీ ముఖ్యమంత్రి షీలా దీక్షిత్ ఢిల్లీలో మహిళలకు భద్రత కరువయిందని వాపోయారు.

ఢిల్లీ లాంటి సంఘటనే జనవరి 2013లో పశ్చిమ బెంగాల్ ఉత్తర దానాజ్‌పూర్‌లో జరిగింది. దుండగులు కొందరు బస్సులో 18ఏండ్ల యువతిని సామూహికంగా అత్యాచారం చేసి బస్సులో నుండి కిందకు తోసేశారు. తీవ్ర గాయాలయినందున ఆ యువతి అపస్మారక స్థితికి చేరుకుంది. దారినపోయే పుణ్యాత్ములెవరో చూచి ఆసుపత్రిలో చేర్పించారు. అన్నిటికన్నా జుగుప్సాకరమైన ఘటన గత సంవత్సరం నవంబర్ 22న జరిగింది. 18 నెలల పసికూనపై 21 ఏండ్ల జితేంద్రనాథ్ అఘాయిత్యానికి పాల్పడ్డాడు. ఆ కేసుకు సంబంధించిన అభియోగపత్రాన్ని పోలీసులు 18 జనవరి 2013న దాఖలు చేశారు. ఆ రోజు నుంచి జిల్లా సెషన్స్ కోర్టు న్యాయాధీశుడు జగదీష్ బహెతి శరవేగంగా విచారణ జరిపి పదంటేపది రోజుల్లో తీర్పుచెప్పాడు. ఆ మృగానికి 14 ఏండ్ల కఠిన కారాగార శిక్షతోపాటు అయిదువేల రూపాయల జరిమానా విధిస్తూ కోర్టు తీర్పు చెప్పారు.

పురుషాధిక్య భావజాలంలో మార్పు రాకపోవటం, మహిళా సాధికారత అంటే పురుషులకు వ్యతిరేకమన్న భావం కావచ్చు. మహిళా సాధికారత అన్న పదానికి అర్థం హక్కుకు ప్రతీక. ఇక రెండవ కారణం మన భక్షక భటుల(పోలీసుల) తీరు. వర్తమానం అందించిన వారిని సాక్ష్యం కొరకు పోలీసు స్టేషన్ల చుట్టూ, కోర్టుల చుట్టూ తిప్పితిప్పి తిప్పలు పెడతారు. కొన్ని కొన్ని సందర్భాలలో తమకు అనుకూలంగా సాక్ష్యం చెప్పమని వేధింపులకు, బెదిరింపులకు గురిచేస్తారు. పుణ్యానికి పోతే పాపమెదురయినట్లు బాధితులకు సాయపడటానికి పోయి పోలీసులతో చిక్కులు కొని తెచ్చుకోవటమెందుకన్న భావన కావచ్చు.

ఆ మృగం జీవించి వున్నంత వరకు జైలు శిక్ష విధిస్తే ఇంకా బాగుండేదేమోననిపిస్తుంది. తమిళనాడులో ఫిబ్రవరి నెలలో ఇలాంటి ఘటనే 18 మాసాల పసికూనపై జరిగింది. అఘాయిత్యానికి పాల్పడిన వాడి తల్లి అవమానభారంతో ఆత్మహత్య చేసుకుంది. 39 సంవత్సరాల క్రితం ముంబయిలోని ఆసుపత్రి నర్సుపై వార్డు బాయ్ అతి ఘోరంగా అఘాయిత్యం చేశాడు. ఆమె కోమాలోనికి వెళ్ళిపోయి కెవిఎమ్ ఆసుపత్రిలో జీవచ్ఛవంలా నేటికీ మంచాన పడి ఉంది. ఆ ఆసుపత్రి నర్సులే సపర్యలు చేస్తున్నారు.

నిర్భయ(జ్యోతి సింగ్)పై జరిగిన ఘోరకలి దేశంలోని యువతను ఏకత్రాటిపైకి తెచ్చింది. యువత నిరసన జ్వాలలు, ఆగ్రహావేశాలు ఆకాశాన్నంటినాయి. ఢిల్లీ అధికార పీఠం కదిలింది. అత్యవసర సమావేశం జరిగింది. కేంద్ర ప్రభుత్వం మహిళలపై జరిగే అన్ని రకాల నేరాలను అధ్యయనం చేయటానికి సర్వోన్నత న్యాయస్థాన మాజీ ప్రధాన న్యాయమూర్తి జె.ఎస్. వర్మ ఆధ్వర్యంలో త్రిసభ్య కమిటిని నియమించింది. వర్మ కమిటి క్షుణ్ణంగా, విస్తృతంగా అధ్యయనం జరిపి గడువులోపే కేంద్రానికి నివేదిక సమర్పించింది. వర్మ కమిటీకి మహిళా సంఘాలు, స్వచ్ఛంద సంస్థలు, సామాజిక కార్యకర్తలు, రాజకీయ పార్టీలు సకాలంలో తమతమ అభిప్రాయాలను లిఖితపూర్వకంగా తెలిపాయి. కాని వర్మ కమిటీని నియమించిన ప్రభుత్వ అధికార పార్టీ మాత్రం రెండవ రోజు వర్మ కమిటీ నివేదిక ఇస్తుందనగా ఆ అర్థరాత్రి సీల్డు కవరును కొంతమంది వ్యక్తులతో జె.ఎస్. వర్మ గారికి యింటికి పంపింది. కేంద్ర హోమ్ మంత్రి ఒక్కసారి కూడా తనను కలవలేదని, కనీసం మాట్లాడటం కూడా జరగలేదని వర్మగారు తెలియజేశారు. సోనియా గాంధీగారు మాత్రం వ్యక్తిగతంగా క్షమాపణ తెలియజేశారు. వర్మ కమిటీ తన నివేదికలో అత్యంత అరుదైన సామూహిక అత్యాచారం, హత్య కేసుల్లో నిందితులకు మరణశిక్ష, అంగచ్ఛేదన, రసాయనిక పద్ధతులలో నపుంసకులను చేయటం అంగీకరించలేదు. సామాన్య అత్యాచార కీచకులకు 20 ఏండ్ల జైలుశిక్ష, అత్యాచారంతోపాటు హత్యకు పాల్పడినవారికి బతికినంతకాలం జైలుశిక్ష విధించాలని సూచించింది. ఇప్పుడున్న అత్యాచార వ్యతిరేక చట్టాలను చిత్తశుద్ధితో

మహిళలపై జరుగుతున్న కొత్త తరహా నేరాలకు తగినట్లుగా శిక్షల తీవ్రతను కూడా పెంచవలసిన అవసరమున్నదని వర్మ కమిటీ అభిప్రాయపడింది. అత్యాచారానికి పాల్పడిన లేక పాల్పడటానికి పూనుకోబోయే వ్యక్తిని బాధితురాలు "హతమార్చటాన్ని" ఆత్మరక్షణ హక్కుగా గుర్తిస్తూ ఐపిసి సెక్షన్ 100ను సవరించాలని తేల్చింది. మహిళల ఇష్టానికి వ్యతిరేకంగా ముట్టకోవటాన్ని, అసభ్యకరమైన మాటలను, సైగలు చేయటాన్ని లైంగిక దాడికి ప్రేరణల నేరాలుగా గుర్తించి జైలుశిక్ష, జరిమానా లేక రెండూ విధించాలని, దానికి అనుగుణంగా అత్యాచార చట్టం సెక్షన్ 375ను సవరించాలని వర్మకమిటి ప్రతిపాదించింది. నేరాలను, వాటికి తావిచ్చే రాజకీయ, సామాజిక వాతావరణాన్ని, వాటిని అరికట్టడంలోని లొసుగులను వర్మ కమిటి విశేషంగా విశ్లేషించింది.

అమలు పరిస్తే పరిస్థితులు చక్కబడతాయని అభిప్రాయపడింది. ఇలాంటి ఘోరాలు జరిగినపుడు ప్రజలు కోపోద్రిక్తులవటం, ఉద్వేగం చెందటం నిందితులను కంటికి కన్ను, పంటికి పన్ను తీరులో శిక్షించాలని డిమాండ్ చేయటం సర్వసాధారణమని తెల్పింది. కాని శిక్షాస్మృతులు, ఉద్వేగాలు, భావావేశాల ఆధారణంగా రూపొందించబడవని తెల్పింది. సహజ న్యాయ సూత్రాల ఆధారంగా నేరానికి తగిన నిష్పత్తిలో శిక్షలు, చట్టాలు రూపొందించబడతాయని తెలియజేసింది.

మహిళలపై నేరాలు పెరగటానికి ప్రభుత్వ పాలనా వైఫల్యం, పోలీసుల స్పందనారాహిత్యం లింగ వివక్ష కారణాలని వర్మ కమిటీ అభిప్రాయపడింది. బాల నేరస్తుల వయోపరిమితిని తగ్గించటాన్ని వర్మ కమిటీ అభ్యంతరం వ్యక్తం చేసింది. సాయుధ బలగాలు, సరిహద్దు ప్రాంతాలలో మహిళలపై అకృత్యాలు సాగిస్తున్నందువలన సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టంను కొనసాగించే విషయాన్ని వీలయినంత త్వరగా సమీక్షించాలని కోరింది. (షర్మిల అనే మహిళ ఈశాన్య రాష్ట్రాలలో ప్రత్యేక అధికారాల అసరాతో సాయుధబలగాలు మహిళలపై అత్యాచారాలకు, హత్యలకు తెగబడుతున్నాయని, దానిని రద్దు చేయాలని ఏళ్లతరబడి నిరాహార దీక్ష చేస్తోంది. అన్నా హజారేను కూడా తమకు మద్దతునివ్వమని కోరింది.) కాని కేంద్రం ఈ సూచనను తిరస్కరించింది. ఖాప్ పంచాయితీలను కట్టడి చేయాలని, ప్రజా ప్రాతినిధ్య చట్టంలో మార్పు వచ్చేలాగ సవరణలు చేయాలని కోరింది. వర్మ కమిటి యాసిడ్ బాధితులకు కేంద్ర ప్రభుత్వమే వైద్యఖర్చులను భరించాలని సూచించింది. కాని కేంద్రం అంగీకరించలేదు. మహిళలపై జరుగుతున్న కొత్త తరహా నేరాలకు తగినట్లుగా శిక్షల తీవ్రతను కూడా పెంచవలసిన అవసరమున్నదని వర్మ కమిటీ అభిప్రాయపడింది. అత్యాచారానికి పాల్పడిన లేక పాల్పడటానికి పూనుకోబోయే వ్యక్తిని బాధితురాలు "హతమార్చటాన్ని" ఆత్మరక్షణ హక్కుగా గుర్తిస్తూ ఐపిసి సెక్షన్ 100ను సవరించాలని తేల్చింది. మహిళల ఇష్టానికి వ్యతిరేకంగా ముట్టకోవటాన్ని, అసభ్యకరమైన మాటలను, సైగలు చేయటాన్ని లైంగిక దాడికి ప్రేరణల నేరాలుగా గుర్తించి జైలుశిక్ష, జరిమానా లేక రెండూ విధించాలని, దానికి అనుగుణంగా అత్యాచార చట్టం సెక్షన్ 375ను సవరించాలని వర్మకమిటి ప్రతిపాదించింది. నేరాలను, వాటికి తావిచ్చే రాజకీయ, సామాజిక వాతావరణాన్ని, వాటిని అరికట్టడంలోని లొసుగులను వర్మ కమిటి విశేషంగా విశ్లేషించింది. చట్టాలలో సవరణలు సూచించినా పాలనా వ్యవస్థలో నేడు వున్న ధోరణిలో మార్పు రావాలని, అత్యాచార బాధిత మహిళల విషయంలో పోలీసుల ఉదాసీన వైఖరిలోను, రాజకీయ నాయకుల, మతతత్వవాదుల బాధ్యతారాహిత్య వ్యాఖ్యానాలు, సమాజంలోని అన్ని రంగాలలోను, పౌర సమాజ వ్యవస్థలలోనూ కింది నుండి పైదాకా పురుషాధిక్యత వ్యవస్థీకృతమై ఉన్నదని, ఆ భావజాలంలో మార్పు రానంతవరకు హక్కులు, చట్టాలు బాధితులకు పూర్తిగా ఉపయోగపడవని పేర్కొంది. చట్టాలను సక్రమంగా అమలు చేసే సంకల్పం ప్రభుత్వాలకు అవసరమని, ప్రభుత్వాలు చిత్తశుద్ధితో చట్టాలను అమలు చేయటానికి తిరిగి ప్రజా ఉద్యమాలే పరమావధి అని తేటతెల్లంగా తేల్చిచెప్పింది.

త్రిసభ్యకమిటి నివేదిక సమర్పించిన తర్వాత కేంద్రం ఆఘమేఘాల మీద ఆర్డినెన్స్‌ను రాష్ట్రపతి ఆమోదముద్రకు పంపింది. ఫిబ్రవరి 21,22 తేదీలలో పార్లమెంట్ బడ్జెట్ సమావేశాలు వున్నవి. వర్మ కమిటీని పార్లమెంట్‌లో ప్రవేశపెట్టి చర్చించిన తర్వాత చట్టం చేయవలసిఉంది. ఇది ప్రజాస్వామిక పద్ధతి. అయితే అధికారపార్టీ ఏకపక్ష నిర్ణయంగా ఆర్డినెన్స్ చేయటం చర్చనీయాంశమయింది. నేరచట్టం (సవరణ) ఆర్డినెన్స్-2013 ఆర్డినెన్స్‌లో చేర్చిన అంశాలపై మహిళా సంఘాలు తీవ్ర అసంతృప్తిని, ఆగ్రహాన్ని వ్యక్తం చేశాయి. విశాల ప్రాతిపదికన మహిళల భద్రతకు దోహదం చేసే వర్మకమిటి సిఫారసులను ఆర్డినెన్స్‌లో పొందుపరచలేదని విమర్శించాయి. కేంద్ర ప్రభుత్వ ఆర్డినెన్స్‌ను ఆమోదించవద్దంటూ మహిళా సంఘాలు, ఇతర సంఘాలు రాష్ట్రపతిని కలిసి విజ్ఞప్తి చేశాయి. ఫలితం దక్కలేదు. రాష్ట్రపతి ఆమోదముద్ర పడింది. అత్యవసరంగా ఆర్డినెన్స్ తెచ్చే క్రమంలో కేంద్రం పారదర్శకతను పూర్తిగా విస్మరించిందని, దళిత, ఆదివాసీ, మైనారిటీ మహిళలకు ఉపయోగపడేదిగాలేదని, జ్యోతిసింగ్ గ్యాంగ్ రేప్ కేసు ఈ చట్టం పరిధిలోనికి రాలేదని, కరి మింగిన వెలగపండులాగ వుందని మహిళా సంఘాలు ఘాటైన విమర్శలు గుప్పించాయి. ఢిల్లీకి చెందిన మానవహక్కుల న్యాయవాది బృందా గోవర్ ఈ హడావుడి ఆర్డినెన్స్ రూపకల్పన వల్ల యిబ్బందులు వుండవచ్చని అన్నారు. వర్మ కమిటి సిఫార్సులను సమగ్రంగా అమలు చేయాలని సర్కారుకు మరోసారి విన్నవిస్తున్నామని బృందా గోవర్ తెలిపారు.

జ్యోతి సింగ్(నిర్భయ)పై జరిగిన అమానుష అత్యాచారంపై హైందవ మతాధిపతులు, రాజకీయ నేతలు చేసిన వ్యాఖ్యలు మధ్య యుగంవైపు మహిళల తిరోగమనానికి నాందీ వాచకాలు. ఒక స్వాములవారు అత్యాచార దుండగులను 'అన్నా' అని ప్రార్థించి,

అర్థించి కాళ్ళా వేళ్లాపడి బ్రతిమాలుకుంటే వాళ్ళలోమార్పు వచ్చేదని సలహానిచ్చారు. వారి మాట ప్రకారం 18 మాసాల పసికూనలు, ముక్కు పచ్చలారని మూడేళ్ళ చిన్నారులు 'అన్నా'అని పిలవగలరా? మరో ఆధ్యాత్మిక గురువు ఒక్క చేయి ఎంత వూపినా చప్పుడు రాదని రెండవ చేయి కలిపితేనే చప్పట్లు వినిపిస్తాయన్న దానిని అత్యాచారానికి ముడి వేశారు. అవతల వ్యక్తి అనగా మహిళ అంగీకారం లేకుండా అత్యాచారం జరిగే అవకాశం లేదని సెలవిచ్చారు. అవతల వ్యక్తి అంగీకారంతో (రెండవ చేయి కలిపితే చప్పట్లు వచ్చినట్లుగానే) జరిగితే దానిని అత్యాచారమనరన్న లోక జ్ఞానం, ఇంగిత జ్ఞానంలేని ఆయన అంతర్గత జ్ఞానానికి సంబంధించిన ఆధ్యాత్మికతకు గురువు ఎలా అయ్యారు? ఆశ్చర్యమేస్తుంది. మరో మత ఛాందసుడు భార్యపని భర్తను సుఖ పెట్టడమేనని, అందులోనే ఆమె జన్మ సార్థకమవుతుందని గడపదాటవలసిన అవసరం లేకుండా భర్తే ఆమెకు సర్వ సుఖాలు సమకూరుస్తాడని తెలిపారు. ఇక రాజకీయ నేతలు "స్వాతంత్ర్యం వచ్చింది అర్థరాత్రి మహిళలు ఒంటరిగా తిరగటానికా?" అని ప్రశ్నించారు. కొత్తగా పార్లమెంట్‌కు ఎన్నికైన యువ ఎంపిగారు " సీతాకోక చిలుకల్లాగ అందంగా కనిపించాలని యువతులు అలంకరించుకుని మీడియాలో కనిపించాలన్న ఉబలాటంతో ఆందోళనల్లో పాల్గొంటున్నారు"అని కొత్త రకం వ్యాఖ్యానం చేశారు. మహిళల తిరస్కారాల, నిరసనల తదనంతరం క్షమాపణలుచెప్పి తప్పుకున్నారు. భారత రాజకీయ ప్రతినిధుల గాలి బ్రిటన్ ఎంపి గారికి కూడా సోకినట్లుంది. "స్కర్టులు, హైహీల్స్ ధరించి పీకలదాకా తాగి తూగుతూ తిరుగుతుంటే దుండగులనుంచి మీరు ఎలా తప్పించుకోగలరని" అక్కడి యువతులపై కన్సర్వేటివ్ పార్టీ ఎంపి రిచర్డ్ గ్రాహం తన పత్రిక 'సిటిజన్'లో రాశారు. ఇంకేముంది! మహిళల నిరసనల ప్రవాహంలో కొట్టుకుపోవలసివస్తుందని తాను చేసిన ఈ వ్యాఖ్యలు కామాంధులను సమర్థించటం కొరకు కాదని, బ్లాగ్‌లో వివరణ యిచ్చుకున్నారు.

నిర్భయ బ్రతకాలన్న కాంక్షతో 13 రోజులు అసమాన ధైర్య సాహసాలతో మృత్యువుతో హోరాహోరీగా పోరాడింది. అలసిపోయి అసువులు బాసింది. "అమ్మా! నాకు బ్రతకాలని ఉంది" అన్న జ్యోతి సింగ్ అన్న ఆ ఒక్క మాట దేశవాసులందరిని కంటతడి పెట్టించింది. నిర్భయ మనోనిబ్బరం, ధైర్యం, మానసిక స్థిత స్థైర్యం వైద్యులను కూడ అబ్బుర పరిచింది. నిర్భయ నిష్క్రమణ యువతులలోని, మహిళలలోని భయాన్ని పారదోలింది. నిర్భయత్వాన్ని నింపింది. నిర్భయంగా కదం త్రొక్కించింది. అర్థరాత్రి మార్చ్ చేయించింది. దేశంలోని మారు మూలలా మానవహారాలు చేయించింది. జ్యోతిసింగ్ మహిళల మనసులలో జ్యోతిని వెలిగించింది. భరత పుత్రికకు దేశ విదేశాలలో అశ్రునయనాలతో నివాళులర్పించారు.

## బాల్యాన్ని హరించొద్దు

ఇంట్లో అల్లరి చేస్తున్నారని-ఒంట్లో ఓపిక లేదంటూ
వంటింట్లో గిన్నెలనన్నీ-నట్టింట్లో విసిరారంటూ
వయసెదగని బాలలను-జైలు పాలుచేయొద్దు!
వ్యామోహపు చదువుపేర-బడికి బందీ చేయొద్దు!

ఆడుతు పాడుతు గంతులు వేసే
పాల బుగ్గలను బడికి పంపే
క్రూరమైన ఆలోచనలెందుకు?
బాల్యాన్ని తుంచటమెందుకు?

ఎంత విసిగిస్తే మాత్రం
అంత కోపమెందుకు?
బరువును వదిలించగ
చదువు శిక్షలెందుకు?

తాతగారి బామ్మగారి
ముద్దుల మురిపాలకు
దూరంగా తోలటం
ఘోరమైన తప్పిదమే!

తోటివారి చెలిమిలోని
తీపిదనం అందకుండ
చిన్నాచితక తప్పటడుగుల
అనుభవాలు పొందకుండ!

ముద్దులతో ముద్దలతో
అమ్మే మొదటి గురువను
నానుడిని నిర్దయగా
వమ్ము చేయచూడొద్దు!

ఆయాల పాలుచేసి
అమ్మదనపు పాలతీపి
అందకుండ చేయడం
ప్రకృతికే విరుద్ధం!

చిన్నతనపు చిత్రాలను పదిలపరచకుండానే
బాల్యాన్ని చిదిమేయుట -తగదు తగదు తగదు

-కపిల రాంకుమార్.

మారు(కూలు)తున్న విలువలతో

# మన పయనం ఎటువైపు?

డా॥ బి. విజయభారతి

ఈ విషాదాలకు బాధ్యులుగా ముందు నటీనటులనూ, నిర్మాతలనూ నిలదీయాలి. సాంకేతిక విప్లవాన్ని వెర్రితలలు వేయిస్తున్న సాంకేతిక నిపుణులను నిలదీయాలి. ఇక రచయితలు? వాళ్ళ వంతు వాళ్ళూ చేశారు. సమాజాన్ని కుళ్ళ బెట్టడానికి ఈ పాటలూ, అశ్లీలతను ధ్వనించే సంభాషణలూ, ప్రేక్షకులకు విశృంఖలత్వాన్ని దాచుకున్న, దాచుకోవలసిన మనో వికారాలను బయటపెట్టుకునేందుకు అవకాశాన్నీ ఇచ్చాయి. దానిని కూడా వారు సొమ్ము చేసుకున్నారు. ప్రేమ కాదు హింసాత్మకమైన సెక్స్ వాళ్ళ పాటల వెనుక మాటల వెనుక ఉండి యువతను నడిపిస్తుంది. ఈ మారణ హోమానికి వాళ్ళు కారకులు కారా? సినిమా కథ, సంభాషణ, వేషధారణ దృశ్యాల చిత్రీకరణ, సాంకేతిక విజ్ఞానం ఇవన్నీ ఏ ప్రయోజనాన్ని ఆశిస్తున్నాయి?

ఏ రోజు వార్తపత్రిక చూసినా /చదివినా ఏమున్నది ఆనందించడానికి? రెండు హత్యలూ, మూడు మానభంగాలూ, నాలుగు రోడ్డు ప్రమాదాలు, అయిదు భూ ఆక్రమణలు, ఆరు ఆత్మహత్యలు? ఇవి దినదిన ప్రవర్థమానమవుతున్న సమాజంలో బతుకుతున్నాం మనం. వీటి వెనుక ఉన్న ఆ సమాజం ఎలాంటిది? ఈ కార్యకలాపాలలో పాలుపంచుకుంటున్న వీరెవరికీ సామాజిక నైతిక విలువలు లేవా? ఇతరుల విలువలను వారు గుర్తించరా? అంటే అవుననే సమాధానం చెప్పుకోవాలి. మానవుల శాస్త్ర సాంకేతిక అభివృద్ధి మానవీయ విలువలను నాశనం చేసిందా అంటే అవుననే అనాలి. మానవతా విలువలను పాత వస్తువులలాగా, పాత పరికరాలలాగా మానవుల మెదడు వదిలేస్తున్నది.

ఆడపిల్లలపై అత్యాచారాలను ఎలా దిగమింగాలి? సౌకుమార్యమూ, లలిత శృంగారమూ ఏ గంగలో కలిసిపోయాయి? భావకవులు ఆలపించిన అమలిన శృంగార భావనలు-పవిత్ర ప్రేమలూ ఈ తరానికి అందక పోవటానికి కారకులు ఎవరు? ఇప్పటి సాహిత్యమా? సినిమాలా? సినీ సంభాషణలా? మాటలూ పాటలూనా?

స్నిగ్ధ సౌకుమార్యాన్ని నలిపి కాలరాచే మనస్తత్వం ఏ జీన్స్ నుండి వచ్చింది? పరిసరాల ప్రభావం చిన్నారి మనసులపై ఎలా పడుతున్నది? చేయి పట్టి నడక నేర్పి లాలించి నడిపించిన అమ్మలు, అక్కలు, వదినెలు ఈ యువకుల దుర్మార్గపు ఆలోచనలను ఎలా సరిదిద్దాలి? పూల సౌందర్యం ఆరాధించటానికనీ, చూసి ఆనందించటానికనీ, నలిపి పారేయటానికి కాదనీ ఏ సినీ రచయిత రాయాలి? ఏ గాయకుడు ఆలపించాలి? వారెవరైనా మనతో ఉన్నారా?

ప్రతి తరమూ పాత తరాన్నుంచి పాఠాలు నేర్చుకున్నదే. పరిసరాల ప్రభావమూ వారిపై ఉంటుంది. 19వ దశాబ్దపు జంఘాల శాస్త్రి గారి (పానుగంటి లక్ష్మీ నరసింహరావుగారి 'సాక్షి' వ్యాసాలు) బోధనలు ఈ తరానికి వినిపించాలి. సమాజానికి ఆదర్శంగా ఉండవలసిన వారు కుదురుగా ఉంటే వారిని అనుసరించే వారూ మంచి అలవాట్లు చేసుకుంటారంటాడు ఆయన.

ఈ రోజుల్లో సమాజాన్ని నడిపిస్తున్న సినిమాలు, మీడియా ఇందుకు బాధ్యత వహించాల్సిందే. ఇవేమి సినిమాలు? వంశ పారంపర్యంగా తమ సుపుత్రుల మొహాలకి రంగులద్ది ప్రలోభాలతో ఆడపిల్లలను పట్టుకొచ్చి వాళ్ళకి చాలీ చాలని గుడ్డలు కట్టి గంతులు వేయించి డబ్బు చేసుకుని వ్యాపారాన్ని కళగా చప్పట్లు కొట్టించుకుంటున్న నటులు ఇందుకు బాధ్యత వహించాల్సిందే. 'లేచి పోదామా' వంటి డైలాగులు రాసి పలికించిన రచయితలూ, పలికిన నటీనటులూ, నట విట గాయక విదూషక జనమంతా ఏకమై నిర్మాతలై భ్రష్టు పట్టించిన సమాజాన్ని ఎవరు ఎప్పటికి బాగు చేస్తారు?



ఆర్థిక బాధలతో సతమతమవుతూ కాస్తంత వినోదం కోసం వెళ్ళే అమాయకుల మనస్సులపై ఆ గంతులు, డైలాగులు ఎలాంటి ప్రభావం చూపుతాయో వారికి తెలీదా? వారికి ఆ అవసరం లేదా? ఈ విషాదాలకు బాధ్యులుగా ముందు నటీనటులనూ, నిర్మాతలనూ నిలదీయాలి. సాంకేతిక విప్లవాన్ని వెర్రితలలు వేయిస్తున్న సాంకేతిక నిపుణులను నిలదీయాలి. ఇక రచయితలు? వాళ్ళ వంతు వాళ్ళూ చేశారు. సమాజాన్ని కుళ్ళ బెట్టడానికి ఈ పాటలూ, అశ్లీలతను ధ్వనించే సంభాషణలూ, ప్రేక్షకులకు విశృంఖలత్వాన్ని దాచుకున్న , దాచుకోవలసిన మనో వికారాలను బయటపెట్టుకునేందుకు అవకాశాన్నీ ఇచ్చాయి. దానిని కూడా వారు సొమ్ము చేసుకున్నారు. ప్రేమ కాదు హింసాత్మకమైన సెక్స్ వాళ్ళ పాటల వెనుక మాటల వెనుక ఉండి యువతను నడిపిస్తుంది. ఈ మారణ హోమానికి వాళ్ళు కారకులు కారా? సినిమా కథ, సంభాషణ, వేషధారణ దృశ్యాల చిత్రీకరణ, సాంకేతిక విజ్ఞానం ఇవన్నీ ఏ ప్రయోజనాన్ని ఆశిస్తున్నాయి?

సామాజిక ఆర్థిక మూలాలు మాత్రమే కాదు రాజకీయ మూలాలూ మారాలి. సమాజంలో చైతన్యం రావటానికి ఇంకా ఎంతమంది ఆహుతికావాలి? ఈ సమాజం బాలికల బలి కోరుతోందా? బలులు ఇస్తేనేకాని చట్టాలు రావా?

11సంవత్సరాల ఫూల్‌మణి భర్త వల్లనే అత్యాచారానికి బలి అయినపుడు ప్రభుత్వం శారదా చట్టం (1929) తెచ్చింది. ఇప్పటి లాంటి జాతీయ ప్రభుత్వాలు అయితే ఆ చట్టం వచ్చేదా అని అనుమానం. ఎందుకంటే మన జాతీయ నాయకులు చాలామందికి స్త్రీల వివాహ వయస్సు గురించి, బాలికల మనో భావాల గురించీ ఆలోచనలు లేవు. ఆడపిల్లను అమ్ముకుని డబ్బు చేసుకోవటమే చాలా కుటుంబాల సంప్రదాయం. పదహారేళ్ళ బాలికను పడుచులుగా వ్యవహరించే సమాజం నుండి వచ్చిన వారే వీళ్ళంతా!

కొన్నేళ్ళు ఆ ఇండస్ట్రీ మూసేస్తే గోల తగ్గుతుందా? దాని మీద ఆధారపడిన శ్రమ జీవుల సంగతి ఏమిటి అనేదానికి మరో ప్రత్యామ్నాయం వెదుకుదాం. చేసిన తప్పులు దిద్దుకునే కార్యక్రమాలు వాళ్ళ చేతనే చేయిద్దాం.

"గతమెంతో ఘన కీర్త ఉన్న" వారమే మనం. అవన్నీ ఇప్పుడు పనికి రావడంలేదు. వెర్రితలలు, పురోగతి అమ్మాయిలను చంపుకుతింటోంది. వారి రక్షణకు ఏం చేయాలి మనం?

మనం ఉయ్యాలలో పెట్టి ఊపిన శ్రీరంగ విభులూ పాల నురుగుతోడి సెలవి(పెదవి) తుడుస్తూ ప్రేమగా పెంచిన బాలకృష్ణులూ, "మా మంచి పాపాయి"అంటూ ముద్దు చేసిన పాపాయిలూ వీళ్ళేనా? ఈ పాపాలు చేస్తున్నది? ఆడపిల్లల్ని అల్లరి చేస్తున్నది? వీళ్ళని ఇంత ఆర్తిగా పెంచి పెద్దచేస్తే వీళ్ళకు ఈ విపరీతపు బుద్ధులు ఎలా వచ్చాయి?

"నిదురపోరా తమ్ముడా"అంటూ ఒడిలో పడుకోబెట్టుకుని జోలలు పాడిన అక్కలూ, అన్నలకు అన్నం ముద్దలు తినిపించిన చెల్లెళ్ళూ మగవాళ్ళంటే జడుసుకోవటానికి కారణం ఏమిటి? ఈ రేపిస్టులను ఏం చేయాలి? మగపిల్లలను ఎలా మార్చుకోవాలి? ఆడపిల్లలను ఎలా కాపాడుకోవాలి? మన సంస్కృతి పురాతన కాలంనుంచీ ఇదే అని ఇప్పటి తల్లులు ఊరుకోగలరా? పూర్వం ద్రౌపదిని నిండు సభలో కొందరు అల్లరి పెడుతుంటే సభ అంతా చూస్తూ ఊరుకుంది. చాతకానిదయింది. ఆ క్షణానికి ఆవిడను అన్నగారు ఆదుకున్నాడు. ఎక్కడో ఉన్న అన్నగారూ! ద్రౌపది ప్రతిజ్ఞ చేసి మరీ ప్రతీకారం తీర్చుకుంది.

సీతను రావణాసురుడు ఎత్తుకు పోయాడు. రామునికి(భర్త) ఎవరి సాయమూ అందలేదు. సాటిరాజులెవరూ ఆదుకోలేదు. ఒక పక్షి అడ్డువడింది కానీ ఆపలేకపోయింది. వనచరుడైన హనుమంతుడు ఆమెను చెరవిడిపిస్తానన్నాడు గాని ఆవిడ ఒప్పుకోలేదు. భర్త గౌరవం నిలపాలి కాబట్టి ఆయనే వచ్చి రక్షించాలన్నది. ఎలాగో కథ సుఖాంతం అయింది. ఆడవారిని కష్టాలలో ఆదుకోని సమాజం అగ్ని పరీక్షలయితే పెడుతుంది.

పై రెండు సంఘటనలలోనూ అత్యాచారమూ, హత్యా జరగలేదు. అలాగని ఆ కథలు చెబుతున్నాయి.(?) సీత అందంగా ఉండటంవల్ల అపహరణకు గురి అయిందనీ, ఏదైనా అతిపనికి రాదనీ సమాజం అంటోంది. అదో తమాషా! అపహరణ నేరం కాదు. అందంగా ఉండటంనేరం.

"అతి రూపాతే హృతాసీతా

అతి గర్వాత్.....రావణ:

అతి సర్వత్ర వర్జయేత్"అనేది నీతి (లోకోక్తి).

బాధ్యత తప్పించుకుని తిరిగే సమాజం ఈనాడూ అలాగే ఉంది. అతి సుందర రూపం వల్ల సీత అపహరించబడింది. అతి గర్వంవల్ల రావణుడు నశించాడు అంటున్నారు గాని సామాజిక నైతికత గురించి మన పెద్దలు మాట్లాడలేదు. "నిర్భయ" కేసులోనూ ఇలాగే - ఆమె బస్సు ఎందుకు ఎక్కాలి? ఆ సమయంలో ఎందుకు బయటతిరగాలి? అంటూ వ్యాఖ్యలు. ఆడపిల్లలు అలంకరణ తీరు గురించి దుమారాలు? ఆడపిల్లలకు త్వరగా పెళ్ళి చేసి పంపేయాలనే తీర్పులు- ఇవే మేధావులు, స్వామీజీలూ సెలవిస్తున్నారు. ఇదేమి పరిష్కారం?

రేపిస్టులకు శిక్షలు కఠినంగానైనా నిర్ధారించలేకపోతున్నారు. వారి తరపున వాదించటానికే లాయర్లు సిద్ధపడుతున్నారు.

ఈ రేపిస్టులకు ఎలాంటి శిక్షలు వేద్దాం?

రేపిస్టులలో కొందరిని అమ్మాయిలుగా మార్చేసి వాళ్ళ వెంట భస్మాసురుల్ని వదులుదామా? మగ వాళ్ళకి ఆడ వేషాలు వేసి అర్థరాత్రి రోడ్ల మీద వదులుదామా?

పూర్వపు శిక్షలలో లాగా ఏ అవయవంతో నేరం చేశారో ఆ అవయవం ఖండించటం. అదీ బహిరంగంగా అమలుపరుద్దామా?

ఏం చేస్తే ఇవతలివాళ్ళకు బుద్ధి వస్తుంది?

కొన్నాళ్ళపాటు మగ పిల్లలను ఈ భూమి మీదికి రాకుండా చేద్దామా. పూర్వపు స్త్రీ రాజ్యాలు ఇలాంటి ఏవగింపుతో ఏర్పడినవే కావచ్చు.

కొన్నాళ్ళు మగపిల్లల్లో సగం మందికి పరికిణీలు తొడిగించి వాళ్ళలో వాళ్ళనే యావ తీర్చుకోమందామా? రోడ్ల మీద సెక్స్ టాయ్స్ పెట్టి మగపిల్లలను పెంచుదామా? ఏం చేస్తే బాగుంటుంది.?

ఏం చేయటానికైనా అధికారం మనకెక్కడుంది? అందుకే రాజ్యాధికారం కావాలి.

సామాజిక ఆర్థిక మూలాలు మాత్రమే కాదు రాజకీయ మూలాలూ మారాలి. సమాజంలో చైతన్యం రావటానికి ఇంకా ఎంతమంది ఆహుతికావాలి? ఈ సమాజం బాలికల బలి కోరుతోందా? బలులు ఇస్తేనే కాని చట్టాలు రావా?

11సంవత్సరాల పూల్‌మణి భర్త వల్లనే అత్యాచారానికి బలి అయినపుడు ప్రభుత్వం శారదా చట్టం (1929) తెచ్చింది. ఇప్పటి లాంటి జాతీయ ప్రభుత్వాలు అయితే ఆ చట్టం వచ్చేదా అని అనుమానం. ఎందుకంటే మన జాతీయ నాయకులు చాలామందికి స్త్రీల వివాహ వయస్సు గురించి, బాలికల మనో భావాల గురించీ ఆలోచనలు లేవు. ఆడపిల్లను అమ్ముకుని డబ్బు చేసుకోవటమే చాలా కుటుంబాల సంప్రదాయం. పధహారేళ్ళ బాలికను పడుచులుగా వ్యవహరించే సమాజం నుండి వచ్చిన వారే వీళ్ళంతా!

సామాజిక విలువలు గురించి ప్రతి ఒక్కరూ పట్టించుకోవటం ఎప్పటికైనా జరగవలసిందే. కుటుంబ సంబంధాలు, అన్నా చెల్లెళ్ళ అనురాగాలు, కొడుకుల/కూతుళ్ళ కర్తవ్యాలు బోధించే దిశగా ఉండిన వినోద/విజ్ఞాన కార్యక్రమాలు ఇప్పుడు పెడదారి పట్టడం అందరకూ తెలుస్తున్నదే! 'నా చెల్లెలు' 'రక్తసంబంధం'వంటి సినిమాల నుంచి 'ఏం మాయ చేశావే' వంటి సినిమాలకు దిగజారటంలో ఎవరి బాధ్యత ఎంత ఉందో ఎవరికి వాళ్ళు ఆత్మ విమర్శ చేసుకోవాలి. వాళ్ళు చేసుకోనప్పుడు మనమైనా విమర్శించాలి. అలాంటి చెడు సంస్కృతి బలపడకుండా విస్తరించకుండా అరికట్టాలి. చట్ట సభలలోనూ మన గొంతు మనం వినిపించినప్పుడే ఇది సాధ్యం.

## రాలిన మొగ్గలు

చీకటి సంద్రం నుండి
వెలుతురు వాకిట
వాలిపోవాలని ఉంది.

విశ్వవికాశ పూదండలో
నేనూ పూవుగా
వికశించాలని ఉంది

అమ్మ చేతి గోరు ముద్దలు తిని
నాన్న ఒడిలో సేదతీరి
అన్న చేతిలో ఆడుకోవాలని ఉంది

రంగుల ప్రపంచంలో
ఇంద్ర ధనుస్సులా
మెరవాలని....
వినీలాకాశంలో
చంద్రబింబంలా
వెలిగిపోవాలని ఉంది.

చదువుల బడిలో
బాల్యాన్ని త్యజించి
చిన్నారి స్నేహితులతో
చిందులేయాలని ఉంది.

నా యవ్వన సౌందర్యాన్ని
విశ్వ సౌభాగ్యానికి
అర్పించాలని ఉంది.
కష్టాల కడలిని దాటి
హిమగిరి శిఖరాలంత
ఎత్తుకి ఎదగాలని ఉంది

శీతాకోక చిలుకలా ఎగరాలని
రంగుల హరివిల్లులా విహరించాలని
స్వేచ్ఛగా తూనీగలా తిరగాలని ఉంది

విశ్వ మానవుని స్వేదంతో
తడిసి పునీతమైన నేలపై
నా రుధిరధారలర్పించి
పూయిస్తున్న సంపద పూతోటని
అనుభవించాలని ఉంది
సకల సరుకుల సంతలో
వరకట్నం వాకిట
అంగడి బొమ్మని చేసినప్పుడు
తిరుగుబాటు కెంటంలా
ఎగిసిపడాలని ఉంది

అందాల బొమ్మలా
నన్ను అద్దాల కోటలో
బంధించినప్పుడు
ఉగ్రకాళిలా
ఉప్పొంగే తరంగమై
ఉద్యమించాలని ఉంది
మార్కెట్ శక్తుల మాయాజాలంతో
నగిషీ చెక్కి నడిబజారులో పెట్టినప్పుడు
నిశీధిని చీల్చుకువచ్చే
ప్రచండ భానుడిలా
జ్వాలై మండాలని ఉంది
చుక్కల చీరలా ఆకాశం
ముత్తైదువు నుదిట
కుంకుమ బిళ్ళలా చందమామను
చూసి మురిసిపోవాలని ఉంది

బావతో సరసాలు
బామ్మతో ఇగటాలాడుతూ
స్వచ్ఛమైన పచ్చని
పల్లెటూరి పిల్లలా....
శబ్దహోంకా జ్వాలతో
ఘోషపెడుతున్న
కాలుష్యపు పట్టణంలో
బిజీబిజీగా
జీవితం గడపాలని ఉంది

ముత్యంలా మెరిసే
సొట్టబుగ్గల చిన్నారికి
జన్మనివ్వాలని ఆశగా ఉంది

ఊహల పల్లకిలో
విహరిస్తున్న
నా ఆశల సౌధాన్ని
స్కానింగ్ యంత్రం ఢీకొని
స్వప్నం దరిచేరకుండానే
ఆయుషును అంతం చేసింది..

-నిశ

# నిర్భయ చట్టం

- డా॥ డి. ఎల్. విద్య

ఢిల్లీ 'నిర్భయ'పై అత్యాచారం చేసి చిత్ర హింసలతో హత్యాయత్నం చేసి చివరికి ఆమె మరణానికి కారకులైన వారిని 'మృగాళ్ళు', 'కీచకులు', 'రాక్షసులు' అని అనడానికి కూడా వీల్లేదు. వాళ్ళెవరూ ఇలాంటి పని చెయ్యలేదు. 'మృగాళ్ళు' అంటే మృగాలకి అర్థమైతే అవి కూడా సిగ్గుపడతాయి, అవమానపడతాయి. ఈ మానవులు మమ్మల్నింత మాట అన్నారే అని. నిర్భయ వాళ్ళని 'సజీవదహనం' చెయ్యాలంది. న్యాయమైన స్పందన ఉన్న ఆడ, మగ అందరూ ఎంతటి హింసాత్మకమైన శిక్షయినా వాళ్ళకి తక్కువే అనుకుంటున్నారు. ఆ భావోద్రేకం అసహజం కాదు, అన్యాయం కాదు, అహేతుకం కాదు. శిక్షలతో నేరాలు తగ్గాపోతాయని కాదు. చిన్న చిన్న నేరాలు చేసిన వాళ్ళకి కూడా శిక్షలు వేసేస్తున్నారే!




శిక్షలతో నేరాలు తగ్గవని, వాటి విషయంలో ఉపేక్షించడం లేదే! ఢిల్లీలో ఈ విషయమై న్యాయం కోసం ఆందోళన చేశారు. అది నేరమే కాదు. ఆందోళన జరిపిన వాళ్ళమీద లాఠీచార్జీ, టియర్‌గ్యాస్ ప్రయోగం చేసి అక్కడికక్కడే శిక్ష విధించేశారే! చిన్న నేరాలకి చిన్న శిక్ష అయితే మానమో, ప్రాణమో, రెండూనో తియ్యడం ఘోర నేరం కాబట్టి దానికి 'మరణశిక్ష' వెయ్యడం ఎందుకు చెయ్యకూడదు? 'మరణశిక్ష' అయితే కొద్ది నిమిషాల్లో ప్రాణం పోతుంది, బాధేం తెలుస్తుంది. పూర్ణాయుష్షుతో ఉండి, ప్రతిక్షణం బాధతో, పశ్చాత్తాపం చెందిపోతూ అఖరికి పరివర్తన చెందగల 'యావజ్జీవ కారాగార శిక్ష' వెయ్యాలని కొందరన్నారు. వాళ్ళు పశ్చాత్తాపాలూ, పరివర్తనలూ చెందే రకాలు కాదు, కారాగారం నుంచి తప్పించుకు పారిపోయే రకాలు. అత్యాచారాలు, స్త్రీలపై వేధింపులు, నేరాలు తగ్గుతాయని కాదు మరణ శిక్ష వెయ్యాలనడం, మరణశిక్ష అమలు జరిగి పోతే తప్పించుకునే ప్రసక్తే ఉండదు కాబట్టి అంతటి ఘోర నేరానికి ఆ శిక్ష ఉండాలి కాబట్టి, మరణిస్తే మళ్ళీ వాళ్ళు తప్పు చెయ్యలేరు. కాబట్టి, నేరగాళ్ళలో వాళ్ళు లేకుండా పోతారనీ కానీ, ఆ శిక్ష మిగిలిన నేరప్రవృత్తి ఉన్న వాళ్ళకి జడుపు తెప్పించి నేరాలని తగ్గిస్తుందని కాదు. నేరాలు జరగకుండా ఉండాలంటే నేరాలని పునరుత్పత్తి చేసే పరిస్థితులు ఉండకూడదు. ఆ పరిస్థితుల్లో మార్పులు తేగలిగే ఉద్యమాలు ఏవీ శక్తివంతంగా జరగకపోతే, పరిస్థితుల్లో మార్పు ఏమీ రాకపోతే పట్టుబడకుండా నేరం చేసే ట్రిక్కులూ, పట్టుబడ్డా మళ్ళీ తప్పించుకునే చమక్కులూ, నిరపరాధుల్ని నిందితులుగా ఇరికించే

ఎన్నో వృక్షజాతులు, పక్షిజాతులు, జంతు జాతులు అంతరించిపోయి జీవ వైవిధ్యం నశించిపోతూ ఉంటే ప్రకృతిలో సమతుల్యత చెడి దాని ప్రభావం కాలగమనంలో మానవజాతిపైనా ఉంటుందంటున్నారు పర్యావరణ శాస్త్రవేత్తలు. దేశంలో ఎన్నో రాష్ట్రాల్లో పరిస్థితి స్త్రీ పురుష నిష్పత్తి 1:1గా లేకపోవడం. 1:1గా ఉండడం ప్రకృతి సహజ లక్షణం. ఆడపిండాల్ని పెరగనీకుండా, పుట్టనీకుండా చెయ్యడం కారణం కాదా దీనికి? వృక్షజాతులు, జంతు జాతులు, పక్షిజాతులు అంతరించిపోతూ మానవజాతి మనుగడకే ముప్పు తేడానికి చాలా ముందే మానవ స్త్రీ జాతి అంతరించిపోయేలా ఉంది. స్త్రీ జాతి అంతరించిపోతే పురుషుల్ని కనేదెవరు? మొత్తం మానవ జాతే అంతరించిపోదా?

నేర్పులూ అలవరుచుకుంటారు. నేరగాళ్ళు నేరాలు మానరు, వాళ్ళు మారరు.

'నిర్భయ' కేసు సంచలనం సృష్టించింది. కొందరు దీన్ని వాల్‌స్ట్రీట్ ఉద్యమం అంత సంచలనాత్మకం అంటున్నారు. కానీ ఈ కేసే ఆరంభమూ కాదు, అంతమూ కాదు. ప్రతి రోజూ ఈ కేసుకి ముందూ, తర్వాత కూడా వార్తల్లో ఇలాంటివి వింటూనే ఉన్నాం, బాధపడుతూనే ఉన్నాం. ఈ రకం నేరాలపై మరణశిక్ష కోసం పట్టుబట్టాల్సిందే. కానీ ఒకటి కూడా ఆలోచించాలి. నేరస్తులు తప్పించుకుని నిరపరాధుల్ని ఇరికిస్తారేమో.

ఎంతటి కఠిన శిక్షలు ఉన్నా నేరాలు ఆగవని నివేదికలు స్పష్టం చేస్తున్నాయంటున్నారు. కాబట్టి మరణ శిక్ష గురించి ఎంత పట్టుదలగా ప్రయత్నించాలో అంతకు ఎన్నో రెట్లు పట్టుదలతో నేరాలను ప్రేరేపించే మూలకారణాల అంతం కోసం ఉద్యమించాలి. ఈ సంచలనాత్మక ఉద్యమం ఎన్నో ఉద్యమాలకి ఊపిరిలూది సంచలనాత్మకం చెయ్యాలి. మూల కారణాలపై ఉద్యమించడం వెంటనే ఫలితాల్ని చూపించేది కాదు. ఆ మాటకొస్తే మరణ శిక్షలు మాత్రం వెంటనే పడిపోతాయా? పడిపోతే మాత్రం అమలు జరుగుతాయా? అమలు జరిగేలోగా క్షమాభిక్షలు లభించకుండా ఉంటాయా? ఘోర నేరాలు చేసిన యావజ్జీవ ఖైదీలు ఏ స్వాతంత్ర్య దినోత్సవం నాడో నేరాలు చేసే స్వాతంత్ర్యాన్ని తిరిగి పొందకుండా ఉంటారా?

ఎన్నో వృక్షజాతులు, పక్షిజాతులు, జంతు జాతులు అంతరించిపోయి జీవ వైవిధ్యం నశించిపోతూ ఉంటే ప్రకృతిలో సమతుల్యత చెడి దాని ప్రభావం కాలగమనంలో మానవజాతిపైనా ఉంటుందంటున్నారు పర్యావరణ శాస్త్రవేత్తలు. దేశంలో ఎన్నో రాష్ట్రాల్లో పరిస్థితి స్త్రీ పురుష నిష్పత్తి 1:1గా లేకపోవడం. 1:1గా ఉండడం ప్రకృతి సహజ లక్షణం. ఆడపిండాల్ని పెరగనీకుండా, పుట్టనీకుండా చెయ్యడం కారణం కాదా దీనికి? వృక్షజాతులు, జంతు జాతులు, పక్షిజాతులు అంతరించిపోతూ మానవజాతి మనుగడకే ముప్పు తేడానికి చాలా ముందే మానవ స్త్రీ జాతి అంతరించిపోయేలా ఉంది. స్త్రీ జాతి అంతరించిపోతే పురుషుల్ని కనేదెవరు? మొత్తం మానవ జాతే అంతరించిపోదా? ఆడపిల్లల్ని పుట్టనీకుండా చెయ్యడానికి కారణం వరకట్నం ఇచ్చుకోవాలన్న భారం కాదూ? ప్రతి పురుషుడికీ ఒక స్త్రీ లేకపోవడం కూడా స్త్రీలపై అత్యాచారాలకి ఒక కారణం అవదా? పెళ్ళిళ్ళు అవకపోయినా, ఏ స్త్రీతోనూ సంపర్కం లేకపోయినా, ఊహల్లో కూడా స్త్రీలపై చెడు తలంపులు కలగని పురుషులు తక్కువగా ఏం లేరు. నూటికి 90మంది మంచి వాళ్ళుండి, పది మంది మాత్రమే చెడ్డవాళ్ళుంటే చెడ్డ వాళ్ళ సంఖ్య ఎక్కువగా ఉన్నట్టే. అది జనంలో ఎంతో భీతావహాన్ని కలిగిస్తుంది. కట్నాలిచ్చి పెళ్ళిళ్ళు చెయ్యవలసి రావడం ఒక్కటే కాక, ఆడపిల్ల మాన ప్రాణాలకి రక్షణ లేని పరిస్థితుల్ని చూస్తున్న తల్లిదండ్రులకి ఆడపిల్లని కనడం ఓ పీడకల అయిపోదా? ఆడపిల్లల్ని కనకపోవడం, స్త్రీ పురుష నిష్పత్తిలో తేడాకి కారణమై మళ్ళీ స్త్రీలపై అత్యాచారాల విషవలయాన్ని పూర్తి చెయ్యదా? స్త్రీలపై అత్యాచారాలు చేసేవాళ్ళకి మరణశిక్ష కోసం పోరాడే పట్టుదల ఈ వరకట్న దురాచారం మీద కూడా ఉండవలసిన అవసరం లేదా? కొందరికి వరకట్నం ఇచ్చుకోవడం, ఆర్భాటంగా పెళ్ళి చెయ్యడం తలకు మించిన పని కాకపోవచ్చు. కానీ కట్నాలు ఇవ్వగలిగేవాళ్ళు ఇస్తున్నపుడు, ఇచ్చే స్థోమత లేనివాళ్ళు, ఆర్భాటంగా పెళ్ళి చేసే స్థోమత లేనివాళ్ళు కూడా ఆ రెండు పన్లూ అనివార్యంగా చెయ్యవలసి వస్తుంది. కట్నం తీసుకుని పెళ్ళిళ్ళు చేసుకునే పురుషులందరూ అతి దుర్మార్గులై భార్యల్ని హింసించే వాళ్ళే అయిఉంటారని అనడం లేదు. కట్నాలు వివిధ పరిమాణాల్లో తీసుకుంటారు. కట్నం తీసుకుంటున్న వాడికి, అంతకు ముందే కట్నం తీసుకుని పెళ్ళిళ్ళు చేసుకున్న వాళ్ళు మార్గదర్శకంగా అనిపిస్తారు. కట్నం తీసుకోవడం తమ జన్మహక్కనిపిస్తుంది. ఇంతకు ముందు వాళ్ళతో పోల్చి చూసుకుని కట్నం తక్కువయిందని అసంతృప్తి చెంది, ఆ విషయమై భార్యని హింసించడం, వరకట్నం హత్యలు చెయ్యడం కూడా న్యాయమైన హక్కుల్లానే అనిపిస్తాయి కొందరికి. కట్నాలు తీసుకుని పెళ్ళిళ్ళు చేసుకున్న సీనియర్లు తాము స్వయంగా భార్యల్ని హింసించే వాళ్ళు, కట్నం హత్యలు చేసేవాళ్ళూ కాకపోయినా తమ ఉద్దేశ్యం అది కాకపోయినా కట్నం పెళ్ళిళ్ళు చేసుకునే జూనియర్లకి పరోక్షంగా ఆ విషయంలోనూ మార్గదర్శకులయిపోతారు. జూనియర్లు ఏమనుకుంటారంటే వాళ్ళకి ముట్టవలసినంత ముట్టింది కాబట్టి వాళ్ళుగా చలామణి అవుతున్నారు, ముట్టకపోతే వాళ్ళు మాలాగే ఒత్తిడి తెస్తారు. నాదేం తప్పులేదు అనుకుంటారు. ఈ పరిస్థితుల్లో ఆడపిల్లలకి పెళ్ళిళ్ళు చేస్తే అత్తింట్లో బతుకుతుందో, ఛస్తుందో తెలియని భయంలో ఆడపిల్లల్ని కనకుండా అబార్షన్ చేయించేసుకునే పరిస్థితులకీ, తిరిగి అవి స్త్రీ, పురుష నిష్పత్తిని మార్చేసే పరిస్థితులకి, అత్యాచారాలకీ దారితియ్యవా? నిర్భయ కేసు కట్నాలు ఇచ్చిపుచ్చుకునే విషయంలో అభ్యంతరం కాని పెద్ద పట్టింపు కాని లేని వాళ్ళలో కూడా ఆగ్రవేశాల్ని రగిలించింది. వరకట్న దురాచారం పరోక్షంగా అత్యాచారాల దురాచారానికి కూడా రకరకాలుగా కారణమవుతోందన్న అవగాహన వారిలో కలిగితే ఆ ఆగ్రహావేశాల్ని వరకట్న దురాచారం వైపు కూడా తిప్పడానికి ఆలస్యమేం ఉంటుంది? లింగ నిర్ధారణ నిరోధ చట్టం ఉంది. అయినా లింగ నిర్ధారణలు, భ్రూణ హత్యలూ జరుగుతూనే

లింగ నిర్ధారణ నిరోధ చట్టం ఉంది. అయినా లింగ నిర్ధారణలు, భ్రూణ హత్యలూ జరుగుతూనే ఉన్నాయి. వాళ్ళకేం అనిపిస్తుందంటే ఆడపిల్లగా పుట్టడం ఎందుకు? కష్టాలు పడడం ఎందుకు? మేం చేస్తున్నది భ్రూణహత్య కాదు, కష్టాలపాలవకుండా ఆడపిల్లని రక్షించే ముందు జాగ్రత్త చర్య. వరకట్న సమస్య మీద ఉద్యమ స్థాయి పోరాటం జరిగి సమస్యే తీరిపోతే 'లింగ నిర్ధారణ నిరోధక చట్టం' అవసరమే ఉండదు. వరకట్నాన్ని నిరోధించలేని వరకట్నం నిషేధ చట్టం, లింగ నిర్ధారణ నిరోధక చట్టాన్ని ప్రవేశపెట్టి దాన్ని కూడా విజయవంతం చెయ్యలేక నిర్భయ చట్టం వైపు చూస్తోంది. చట్టాల మీద చట్టాలు చెయ్యడం ఓ ఎత్తయితే లోలోతులకి, మూలాల వైపు చూసి అక్కడ నరకడం ఎత్తుని మించిన లోతు.

ఉన్నాయి. వాళ్ళకేం అనిపిస్తుందంటే ఆడపిల్లగా పుట్టడం ఎందుకు? కష్టాలు పడడం ఎందుకు? మేం చేస్తున్నది భ్రూణహత్య కాదు, కష్టాలపాలవకుండా ఆడపిల్లని రక్షించే ముందు జాగ్రత్త చర్య. వరకట్న సమస్య మీద ఉద్యమ స్థాయి పోరాటం జరిగి సమస్యే తీరిపోతే 'లింగ నిర్ధారణ నిరోధక చట్టం' అవసరమే ఉండదు. వరకట్నాన్ని నిరోధించలేని వరకట్నం నిషేధ చట్టం, లింగ నిర్ధారణ నిరోధక చట్టాన్ని ప్రవేశపెట్టి దాన్ని కూడా విజయవంతం చెయ్యలేక నిర్భయ చట్టం వైపు చూస్తోంది. చట్టాల మీద చట్టాలు చెయ్యడం ఓ ఎత్తయితే లోలోతులకి, మూలాల వైపు చూసి అక్కడ నరకడం ఎత్తుని మించిన లోతు.

'మాకు వరకట్నం ఓ సమస్య కాదు మేం ఇచ్చుకోగలం, పుచ్చుకోగలిగే హోదా వాళ్ళకుండి కట్నం ఇచ్చినంతమాత్రంలో, పుచ్చుకున్నంత మాత్రంలో మా కొచ్చిన అపాయం ఏం లేదు. మేం జాగ్రత్తగా చూసుకుని అపాయం లేని మనుషుల్నే ఎంచుకున్నాం'అంటే అవన్నీ నిజమే కావొచ్చు కానీ అసలు నిజం మరొకటి కూడా ఉంది. వరకట్నం సమస్య కేవలం వ్యక్తిగత సమస్యే కాదు, 'సామాజిక సమస్య' కూడా. వ్యక్తిగతంగా నిరపాయకరంగా ఉన్నా సమాజానికి అది ఒక అపాయాన్ని బహుమతిస్తుంది. నిజానికి ప్రతి వ్యక్తిగత సమస్యకీ సామాజిక సమస్య అయ్యే లక్షణాలు ఉంటాయి. ప్రతీ సామాజిక సమస్యా వ్యక్తుల మీద ప్రభావం చూపిస్తుంది. కాకపోతే నిర్భయ కేసు విషయంలో ఇంతమంది ఎందుకు స్పందించారు? వీళ్ళందరికీ ఏమిటి సంబంధం?

ఆడపిల్లల్ని పుట్టకుండా చేయడం ఓ వివక్ష. పుట్టాక విద్యలో వివక్ష, ఆహారంలో వివక్ష, ఆరోగ్యంలో వివక్ష. ఈ వివక్షలు కూడా స్త్రీ పురుష నిష్పత్తిని తగ్గించేస్తాయి. స్త్రీ పురుష సమానత్వం లేకపోవడం, స్త్రీ పురుష నిష్పత్తి మీద ప్రభావం చూపుతుంది. స్త్రీ పురుషులిద్దరూ సమానులు అన్న భావం లేని వాళ్ళందరూ అత్యాచారాల తలంపు ఉన్న వాళ్ళు కాదు. కానీ, అత్యాచారాలు చేసే వాళ్ళు ఒకళ్ళు కూడా స్త్రీ పురుష సమానత్వాన్ని నమ్మేవాళ్ళు అవరు. కనుక స్త్రీ పురుష సమానవత్వ భావాల్ని ప్రచారం చెయ్యాలి, అలాంటి పరిస్థితులు కల్పించేందుకు ఉద్యమించాలి స్త్రీలపై అత్యాచారాలు ఆగాలంటే.

స్త్రీల అసమానత్వం, స్త్రీల సంఖ్య తగ్గిపోయి ప్రతి పురుషుడికీ ఒక స్త్రీ ఉండే పరిస్థితి లేకపోవడం, నిరుద్యోగం, పేదరికం వల్ల పెళ్ళి చేసుకోవడానికి పిల్లనెవరూ ఇవ్వకపోవడం, నైతిక విలువల్ని నేర్పగలిగే జవసత్వాలు లేని విద్యా విధానం, మార్కెట్ సరుకై బుర్రల్ని తొలిచేసే చెడు తలంపుల్ని కూరేసే స్త్రీ నగ్న అవయవ సౌందర్యం ఒకవైపు, తలపుల్ని అదుపులు తప్పించే మద్యం మరోవైపు. పెనుగాలులు చెట్లని ఊపేసినట్లు మనుషుల్ని ఊపేస్తూ ఉంటే స్త్రీలపై అత్యాచారాలు జరగకుండా ఎలా ఉంటాయి? మరణ శిక్షల కోసం ఉద్యమం చేసే పట్టుదల వీటి మీద కూడా ఉండకపోతే స్త్రీలపై జరిగే నేరాలు ఎలా తగ్గుతాయి?

భూమి మీద మద్యం, మత్తు దొరికే వీలే లేకుండా ఆ కంపెనీలన్నింటినీ మాయం చేసేసే ఉద్యమాలు జరవ కూడదూ? స్త్రీలపై అత్యాచారాలని అంతం చెయ్యడానికి? మద్యం కంపెనీల వాళ్ళు పాపం ఎలా బతుకుతారని జాలా? మరో సహజ అవసరాల్ని తీర్చే కంపెనీ పెట్టుకుంటారు. లేకపోతే పోతారు. పోనీండి స్త్రీ జాతి అంతరిస్తే మానవ జాతే అంతరించే ప్రమాదం ఉంది. కొంత మంది మద్యం పెట్టుబడిదారులు పోతే నష్టమేంటి? రెవెన్యూ తగ్గిపోతుందని మద్యం తయారీని, మద్యం అమ్మకాల్ని ప్రోత్సహిస్తే ఆ వచ్చే రెవెన్యూతో ఏమంత మేలు చెయ్య గలుగుతాయి ప్రభుత్వాలు? తిండి, గుడ్డలకి సబ్సిడీలు ఇచ్చినా, మద్యానికి సరిపోతే పేదవాళ్ళ

బెల్టు షాపుల్ని మూయించడమూ జరగాలి, మద్యం మనిషి ఆరోగ్యం మీద, కుటుంబ ఆర్థిక పరిస్థితుల మీద, సామాజిక పరిస్థితుల మీద తీసుకువచ్చే చెడు ప్రభావాల గురించి బోధించి మనుషుల్ని మార్చే ప్రయత్నమూ జరగాలి. సరదాగా కొంచెం అని మొదలెట్టింది వ్యసనమై తిష్ట వేస్తుందనీ చెప్పాలి. మద్యం తాగే మొగుళ్ళని మహిళలు మెత్తగా తన్నడమూ చెయ్యాలి. ఇంకా లొంగకపోతే ఒదిలి పోవడమూ చెయ్యాలి. అన్నిస్థాయిల్లోనూ జరగాలి ఉద్యమం. మద్య నిషేదం లేకపోతే ఒక్క ఓటు పడకూడదు మహిళల నుండి. మద్యం వల్ల జరిగే అనేక అనర్థాలు – స్త్రీలపై అత్యాచారాలూ, రోడ్డు ప్రమాదాలతో సహా అన్నిటినీ అర్థం చేసుకున్న మగవాళ్ళ నుంచీ కూడా పెద్ద ఎత్తున ప్రజాచైతన్యాన్ని తీసుకురాగలిగితే మంచిది.

చలం గారి ప్రభావంతో 'మేం పిల్లల్ని కనే యంత్రాలమా?' అన్న ఆలోచన వచ్చింది. 'మేం పురుషుడి కామాన్ని తీర్చే యంత్రాలమా?' అన్న ఆలోచన రాబట్టే భర్త అయినా సరే ఇష్టంగా లేనప్పుడు లైంగిక సంబంధానికి బలవంత పెడితే అది అత్యాచారం క్రిందే వస్తుందని చట్టం తెచ్చుకున్నారు. "శరీరం ప్రదర్శించడానికి, పెట్టుబడిదారుడి లాభాల్ని పెంచడం కోసం ఫ్యాషన్ల అమలు జరపడానికి మేం యంత్రాలమా?'అన్న ఆలోచన రావాలి. నిర్భయ కేసుకి సినీ కళాకారులు కూడా చలించిపోయారు. తమ నిరసనని, ఉద్యమకారులకి తమ మద్దతునీ స్పష్టం చెయ్యడానికి కొవ్వొత్తుల ప్రదర్శన చేశారు. వెలిగిపోతున్న తారలు కొందరయినా మేం కళని ప్రదర్శిస్తాం, శరీరాన్ని ప్రదర్శించం అని ప్రతిజ్ఞ పడితే కొవ్వొత్తుల ప్రదర్శన కన్నా అది ఎంతో తేజోవంతమైనది.

రాబడి, అవేం అందుకోగలరు? ఉపాధులు ప్రభుత్వాలు కల్పించలేవు గాని, కల్పించినా పని చెయ్యడానికి ఆరోగ్యమేం ఉంటుంది? అనారోగ్యాన్ని బాగుచేసుకోవడానికి ప్రభుత్వం కల్పించే వైద్య సదుపాయాలు ఏ మూలకి సరిపోతాయి? మద్యం ద్వారా వచ్చే రెవెన్యూ ప్రజలు మత్తులో పడుంటే పాలకులకేం ఉపయోగపడుతుంది. మద్యం సేవించేవారందరూ స్త్రీలపై అత్యాచారాలు చేసేవాళ్ళో, వాటికి సమ్మతిని తెలిపేవారో కాదు. కానీ వాళ్ళు మత్తులో ఉంటారు. ఇంత పెద్ద సంచలనాత్మక ఉద్యమం జరుగుతూ ఉంటే వాళ్ళేం పాల్గొనగలరు? వాళ్ళు కూడా పాల్గొంటే ఉద్యమానికి ఎంత బలం? చివరికి వాళ్ళు వాళ్ళ స్వంత స్త్రీలపైనే అత్యాచారం జరిగినా మత్తు వదిలించుకు రాలేరు. సరదాగా నాలుగు మద్యం షాపుల్ని మూయించేస్తే పెద్ద మార్పే ఉంటుంది? షాపుల్లో పెట్టడానికి, మూతుల్ని తడపడానికి మద్యమే లేకుండా ఉండాలి. బెల్టు షాపుల్ని మూయించడమూ జరగాలి, మద్యం మనిషి ఆరోగ్యం మీద, కుటుంబ ఆర్థిక పరిస్థితుల మీద, సామాజిక పరిస్థితుల మీద తీసుకువచ్చే చెడు ప్రభావాల గురించి బోధించి మనుషుల్ని మార్చే ప్రయత్నమూ జరగాలి. సరదాగా కొంచెం అని మొదలెట్టింది వ్యసనమై తిష్ట వేస్తుందనీ చెప్పాలి. మద్యం తాగే మొగుళ్ళని మహిళలు మెత్తగా తన్నడమూ చెయ్యాలి. ఇంకా లొంగకపోతే ఒదిలి పోవడమూ చెయ్యాలి. అన్నిస్థాయిల్లోనూ జరగాలి ఉద్యమం. మద్య నిషేధం లేకపోతే ఒక్క ఓటు పడకూడదు మహిళల నుండి, మద్యం వల్ల జరిగే అనేక అనర్థాలు - స్త్రీలపై అత్యాచారాలూ, రోడ్డు ప్రమాదాలతో సహా అన్నిటినీ అర్థం చేసుకున్న మగవాళ్ళ నుంచీ కూడా పెద్ద ఎత్తున ప్రజాచైతన్యాన్ని తీసుకురాగలిగితే మంచిది. మద్య నిషేధం అర్థం మద్యం అమ్మకపోవడమే కాకుండా మద్యం తయారీ లేకపోవడం అవుతుంది.

ఒక సరుకుకు మరొక సరుకుని ఫ్రీగా ఇస్తునట్లు నాటకం ఆడడం అమ్మకాలు పెంచడానికి ఓ మార్గం. ఏ సరుక్కయినా స్త్రీ అర్ధనగ్నం, ముప్పాతిక నగ్న సౌందర్యాన్ని ఫ్రీగా చూపించడం అమ్మకాలకి అమోఘమయిన మార్గం. సినిమా సరుకు అమ్మకాలు పెంచడానికి, హీరోయిన్‌తో వాళ్ళ చెలికత్తెలు, వాంపుల వస్త్ర సన్యాసాన్ని అస్త్రంగా వాడుకుంటున్నారు. సినిమాలలో, యాడ్‌లలో జంతువుల్ని చూపించడం, జంతు స్వేచ్ఛని అరికట్టడం క్రిందా, జంతు హింస క్రిందా వస్తుందని చట్టం చేసుకుని స్ట్రిక్ట్‌గా ఫాలో అయిపోయి జంతువుల్ని చూపించడం మానేసారు. గ్రాఫిక్ జంతువులతో సరిపెట్టుకుంటున్నారు. ఆపాటిదానికీ నోచుకోలేదా స్త్రీలు? ఈ విషయంలో గట్టి ఉద్యమాలు జరగక కాని యాడ్‌లలో కానీ, సినిమాల్లో కానీ స్త్రీ శరీరాన్ని చూపించి వ్యాపారాన్ని పెంచుకో కూడదని ఉద్యమ్యాలు జరగొద్దూ. స్త్రీలపై అత్యాచారాలని అంతం చెయ్యడానికి జంతువుల్నయితే గ్రాఫిక్ జంతువుల్ని చూపించొచ్చు కానీ, గ్రాఫిక్ నగ్న స్త్రీలని చూపెట్టకూడదు.

చలం గారి ప్రభావంతో 'మేం పిల్లల్ని కనే యంత్రాలమా?' అన్న ఆలోచన వచ్చింది. 'మేం పురుషుడి కామాన్ని తీర్చే యంత్రాలమా?' అన్న ఆలోచన రాబట్టే భర్త అయినా సరే ఇష్టంగా లేనప్పుడు లైంగిక సంబంధానికి బలవంత పెడితే అది అత్యాచారం క్రిందే వస్తుందని చట్టం తెచ్చుకున్నారు. "శరీరం ప్రదర్శించడానికి, పెట్టుబడిదారుడి లాభాల్ని పెంచడం కోసం ఫ్యాషన్ల అమలు జరపడానికి మేం యంత్రాలమా?'అన్న ఆలోచన రావాలి. నిర్భయ కేసుకి సినీ కళాకారులు కూడా చలించిపోయారు. తమ నిరసనని, ఉద్యమకారులకి తమ మద్దతునీ స్పష్టం చెయ్యడానికి కొవ్వొత్తుల ప్రదర్శన చేశారు. వెలిగిపోతున్న తారలు కొందరయినా మేం కళని ప్రదర్శిస్తాం, శరీరాన్ని ప్రదర్శించం అని ప్రతిజ్ఞ పడితే కొవ్వొత్తుల ప్రదర్శన కన్నా అది ఎంతో తేజోవంతమైనది. స్త్రీలపై అత్యాచారాలు చేసేవాళ్ళకి మరణశిక్ష పడాలని కోరుకునేవాళ్ళంతా స్త్రీ శరీరాన్ని వ్యాపారాన్ని వృద్ధి చేసే సరుకుగా చూపించకూడదని ఉద్యమించాలి. స్త్రీ కళాకారులు స్వచ్ఛందంగా తమని కించపరిచే ఈ అంశాల నుంచి విరమించుకోవాలి. ఉద్యమకారులు స్త్రీ కళాకారుల్ని ప్రభావితం చెయ్యాలి.

ఈ విషయాలన్నీ జెవివి ఆధ్వర్యంలో జరిగిన చర్చా కార్యక్రమంలోనూ, కాకినాడ రంగరాయ మెడికల్‌కాలేజి విద్యార్థులతో జరిగిన డిబేట్‌లో చర్చకు వచ్చాయి. రెండింటిలోనూ కూడా మోరల్ సైన్స్ క్లాసులు లేకపోవడం కూడా ఒక కారణం అని అభిప్రాయపడ్డారు.

సంఖ్యలో సమానులుగా ఉండవలసిన స్త్రీ పురుషులు ఎందుకు సమానంగా లేరు? హోదాలో సమానంగా ఉండవలసిన స్త్రీ పురుషులు ఎందుకు సమానంగా లేదు? ఈ అసమానత్వం ఎప్పుడు, ఎలా ప్రారంభమయింది? ఇది అన్యాయం కాదా? ఈ అన్యాయం చరిత్రలో ఎన్ని రకాలుగా ఉంటూ వచ్చింది? ఒక్కొక్కటీ ఎలా పోయాయి. ఇప్పటికున్న అసమానత్వాలు ఎలా పోతాయి? అనే విషయాల మీద వెలుగుని ప్రసరించి, సమాజ శాస్త్రాలు స్త్రీ పురుష సమానత్వం అనే సత్యాన్ని కళ్ళ ముందుంచుతాయి. ఇదీ సైంటిఫిక్ అవుట్‌లుక్.

'మోరల్ సైన్స్' అంటే ఏమిటి? అన్న చర్చ వచ్చింది. ఇప్పుడు జరిగిన మీటింగ్ కూడా ఒక మోరల్ సైన్స్ క్లాసే అన్నారు కొందరు. మోరల్ సైన్స్ అంటే 'పంచతంత్ర కథలు' చెప్పడం కాదు, 'పురాణ కథలు,' 'దేవుడి కథలు' చెప్పడం కాదు. మోరల్ సైన్స్ అంటే సమాజ శాస్త్రాలు అని అభిప్రాయ పడ్డాం. ఈ సమాజం ఎప్పుడూ ఇలాగే లేదు. మారుతూ వచ్చింది. బాధల్ని, కష్టాల్ని తగ్గించడం కోసమే సమాజం మారుతూ ఉంటుంది. మారే క్రమంలో పాత బాధలు పోయి కొత్త బాధలు వస్తూ ఉంటాయి. వాటిని పోగొట్టడానికి మళ్ళీ సమాజంలో మార్పులురావలసి వస్తుంది. అంతిమంగా సుఖశాంతిమయమైన సమ సమాజం వచ్చి స్థిరపడే వరకూ సమాజం మారుతూనే ఉంటుంది. ఇది సమాజ చరిత్ర. ఈ చరిత్రని ఎలా పరిశీలించాలో అలా పరిశీలించడం వల్లే చదివే వాళ్ళలో పరివర్తన వస్తుంది. 'చరిత్రని ఎలా అర్థం చేసుకోవాలి'?అని ఇ. హెచ్. కార్ రాసిన పుస్తకం ఒకటుంది. స్కూలు చదువుల్లో చరిత్రని ఎలా అర్థం చేసుకోవాలో అలా ఉండదు. స్కూలు చదువుల్లో సమాజ శాస్త్రాల ప్రాధాన్యతే తగ్గిపోతుంది. సైన్సు, మేథమెటిక్స్‌లకే ఎక్కువ ప్రాధాన్యత ఉంటుంది. అవే డబ్బు బాగా సంపాదించడానికి సాధనాలు అన్న భ్రమతో ఎంతెంత సైన్సులు చదివినా సైంటిఫిక్ అవుట్‌లుక్ మాత్రం ఉండడం లేదు విద్యార్థికుల్లో. సైన్సు ద్వారా సైంటిఫిక్ అవుట్‌లుక్‌ని పెంచే సైన్సులే సోషల్ సైన్సులు- సామాజిక శాస్త్రాలు.

ఉదా:- ఒక స్త్రీకి ఆడబిడ్డ పుట్టడానికి కానీ, మగ బిడ్డ పుట్టడానికి కానీ అవకాశం సమానంగా ఉందని, సమాజంలో స్త్రీ పురుషుల సంఖ్య సమానంగా ఉంటుందని మేథమెటిక్స్ చెబుతుంది.

స్త్రీలు పురుషులు ఇద్దరూ మానవజాతికి చెందిన వాళ్ళనీ, స్త్రీ పురుష ప్రత్యుత్పత్తి వ్యవస్థల గురించీ, ఫలదీకరణ గురించి, కణ విభజన గురించీ, టిష్యూలూ అవయవాలు తయారవడం గురించీ, జీర్ణ వ్యవస్థ, శ్వాస వ్యవస్థ, రక్త ప్రసరణ వ్యవస్థ, నాడీ వ్యవస్థ ఇలాంటివన్నీ ఎలా నిర్మాణమై ఉంటాయి, ఎలా పని చేస్తాయి? అనే విషయాల గురించి బయాలజీ చెబుతుంది. ఒక్క పునరుత్పత్తి వ్యవస్థ తప్ప తక్కినవన్నీ స్త్రీ పురుషులిద్దరిలో ఒకేలా ఉంటాయి. ఒకేలా పనిచేస్తాయి. అది తెలుసుకుని బయాలజీ స్టూడెంట్సు "ఒకేలా పని చేస్తాయి కాబట్టి సరిపోయింది. లేకపోతే కోర్సు డబుల్ అయిపోయేది హమ్మయ్య" అని ఊపిరి పీల్చుకుంటారు.

స్త్రీ పురుషుల్దిరూ సంఖ్యలో సమానం, సుఖ దు:ఖాల అనుభూతుల్లో సమానం. ఒకే జాతికి చెందినవాళ్ళు, శరీరం ఒకేలా ఉంటుంది. ఒకేలా పనిచేస్తుంది, పునరుత్పత్తి వ్యవస్థల్లోని తేడాలు అవసరాలేకాని, అసమానతలు కావు, అంచేత స్త్రీ పురుషులిద్దరూ సమానులు అన్న అంశం ఈ సాంకేతిక విజ్ఞానంలోనే ఇమిడిపోయి ఉంది. కాని సమానత్వం ఎంతో మంది మనసులకి పట్టదు.

సంఖ్యలో సమానులుగా ఉండవలసిన స్త్రీ పురుషులు ఎందుకు సమానంగా లేరు? హోదాలో సమానంగా ఉండవలసిన స్త్రీ పురుషులు ఎందుకు సమానంగా లేదు? ఈ అసమానత్వం ఎప్పుడు, ఎలా ప్రారంభమయింది? ఇది అన్యాయం కాదా? ఈ అన్యాయం చరిత్రలో ఎన్ని రకాలుగా ఉంటూ వచ్చింది? ఒక్కొక్కటీ ఎలా పోయాయి. ఇప్పటికున్న అసమానత్వాలు ఎలా పోతాయి? అనే విషయాల మీద వెలుగుని ప్రసరించి, సమాజ శాస్త్రాలు స్త్రీ పురుష సమానత్వం అనే సత్యాన్ని కళ్ళ ముందుంచుతాయి. ఇదీ సైంటిఫిక్ అవుట్‌లుక్.

సైంటిఫిక్ అవుట్‌లుక్ ఇచ్చే సమాజ శాస్త్రాల్ని తెలుసుకోవడమే మోరల్ సైన్స్. అన్యాయాన్ని ఎదిరించమని చెప్పడమే మోరల్ సైన్స్, సాంకేతిక విజ్ఞానం.పాఠ్య పుస్తకాల్లో ఎలాగూ లభ్యమవుతోంది కాబట్టి సైంటిఫిక్ అవుట్‌లుక్‌ని పెంచే సమాజ శాస్త్రాలకి సముచిత స్థానం లభించాలని అభిప్రాయపడ్డాం.

ఎన్నో కారణాలు స్త్రీలపై అత్యాచారాలకి ప్రోద్బలం చేస్తుంటే, ఎన్నో విషయాల మీద ఉద్యమిస్తే గాని వాటిని పరిష్కరించే పరిస్థితి లేకుండా ఉంటే, ఒక్క మరణ శిక్ష గురించే ఆవేశం తగ్గేవరకూ ఆక్రోశిస్తే నిర్భయ చట్టం రావొచ్చు. అప్పుడు మనం వద్దనుకున్నా చూసేవీ, వినేవీ మరణ శిక్షలే! ఎన్ని మరణ శిక్షలో అన్ని మానభంగాలు! నిర్భయ చట్టం వచ్చినా మనవేం నిర్భయంగా ఉండగలం? ఇవి భయపడే విషయాలే కాని ఆహ్లాదకరమైన విషయాలు కావు కదా! 'నిర్భయ చట్టం' స్త్రీలపై అత్యాచారాలని అంతం చెయ్యడానికి, చెయ్యవలసిన ఎన్నో ఉద్యమాల్లో ఒక ఉద్యమం. వాటన్నిటికన్నా శక్తివంతమైనది మాత్రం కాదు. అయినా సరే 'నిర్భయ చట్టం' విజయవంతంగా చట్టమై రావాలని కోరుకుందాం.

# జస్టిస్ జె.ఎస్. వర్మ కమిటీ సూచనలు

- పొత్తూరి సురేష్ కుమార్
అడ్వకేట్

ఉన్నత పదవులలో అత్యంత నైతికత, సమగ్రత ఉన్న వ్యక్తులు ఉంటే వారు వ్యవస్థకు ఉదాహరణగా ఉంటారని పేర్కొంది. పోలీసులు కేవలం చట్టానికి మాత్రమే కట్టుబడే విధంగా రాజకీయ నాయకుల, ఇతర ఉన్నత వ్యక్తుల ప్రభావాలకు లోను కాకుండా ఉండేవిధంగా మారాలి. బాధ్యతను నిర్లక్ష్యం చేసేవారు నిబంధనలకు అనుగుణంగా శిక్షింపబడాలి. మానభంగం ఫిర్యాదు వచ్చినపుడు పోలీసులు తప్పనిసరిగా కేసును నమోదు చేయాలని పౌరసమాజం కూడా తమ దృష్టికి వచ్చిన అత్యాచారాలను రిపోర్టు చేయాలని ఈ కమిటీ పేర్కొంది. ఏ అధికారి అయినా కేసు నమోదు చేయటంలో, దర్యాప్తు చేయటంలో అలసత్వం,నిర్లక్ష్యం వహించినప్పుడు తీవ్రమైన నేరంగా పరిగణించాలి.

మహిళల మీద జరుగుతున్న తీవ్రమైన అత్యాచారాల నేరస్థులను శిక్షించే విషయంలో క్రిమినల్ చట్టాలలో తీసుకురావలసిన మార్పుల గురించి సుప్రీం కోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ వర్మ నాయకత్వంలో లీల సేత్ మరియు గోపాల సుబ్రహ్మణ్యం సభ్యులుగా ఏర్పడిన కమిటీ నెల రోజులు లోపే తన నివేదికను ప్రధాన మంత్రికి జనవరి 23న సమర్పించింది. ఈ కమిటీ అనేక సూచనలను తన నివేదిక ద్వారా చేసింది. ప్రధానంగా 2 సూచనలు చేసింది. 657 పేజీల నివేదికలో అధ్యయనం చేసిన తర్వాత 19 నిర్ధారణలు చేసింది. ఈ నివేదిక 14 అధ్యాయాలుగా విభజింపబడి ఒక్కో అధ్యాయంలో ఒక్కో విషయాన్ని వివరంగా చర్చించారు.

మహిళలపై అత్యాచారాల విషయంలో ప్రభుత్వ వైఫల్యమే ప్రధాన కారణం అని ఈ కమిటీ నిర్ధారణకు వచ్చింది. అందువలనే ప్రభుత్వ అంగాలైన కార్యనిర్వాహక వర్గం, శాసన కర్తలు, న్యాయ వ్యవస్థ మహిళల హక్కులను గౌరవించాలని వారిని సమానంగా చూడాలని మొదటి సూచనగా పేర్కొంది. మహిళలకు సమానహక్కు రాజ్యాంగం ఇచ్చింది కనుక మహిళల హక్కులు నిరాకరించడం అంటే రాజ్యాంగాన్ని ఉల్లంఘించడమేనని పేర్కొంది.

భారతదేశంలోని వివాహాలన్నీ తప్పనిసరిగా వారి వ్యక్తిగత చట్టాలతో సంబంధం లేకుండా మేజిస్ట్రేటు ముందు రిజిష్టరు చేయబడాలని, ఆ మేజిస్ట్రేటు ఆ వివాహం ఎటువంటి కట్న కానుకల డిమాండ్ లేకుండా చూడటం మరియు ఇరు పార్టీల సమ్మతి, స్వేచ్ఛగా ఉండేటట్లు అయితేనే దానికి సార్ధకత వస్తుంది అని పేర్కొన్నారు.

పోలీసులు, ఆర్మీ అధికారులు లాంటి చట్టబద్ధ అధికారుల కస్టడీలలో ఉండగా అత్యాచారాలు జరిగినపుడు సాక్ష్యాధారాల చట్టం సెక్షన్114(ఎ)లో పేర్కొన్న విధంగా పోలీసులు అత్యాచారం చేసారనే భావన తప్పనిసరిగా వర్తించేటట్లు మార్పు తీసుకురావాలి. అనగా చట్టబద్ధ అధికారుల కస్టడీలో ఉండగా అత్యాచారం జరిగిందని ఆరోపణలు వస్తే అవి ఖచ్చితంగా జరిగినట్లు, దానికి కారణం సంబంధిత అధికారులేనని కోర్టు భావించే విధంగా మార్పును సూచించింది. అలా చేయలేదని నిరూపించుకోవలసిన బాధ్యత అప్పుడు అధికారులపైనే ఉంటుంది.



వేధింపులు, విరుద్ధమైన అక్రమ

రాజకీయ సంస్కరణల విషయానికి వచ్చినపుడు నేరస్థులను రాజకీయాల నుంచి బహిష్కరించాలి. రాజకీయ నాయకులు వారిపై ఎటువంటి నేరారోపణలు లేవని ధృవపత్రం పొందాలని, అలాగే హైకోర్టు రిజిస్ట్రారు దగ్గర నుంచి సర్టిఫికెట్ పొందాలని సూచించారు. ఒక వేళ ఏదైనా మేజిస్ట్రేటు నేరం గురించి విచారణ చేపడితే అతనిని ఎన్నికలలో పాల్గొనకుండా అనర్హుడుగా ప్రకటించాలి. అన్ని రకాలైన హీనమైన నేరాలను ప్రజా ప్రాతినిధ్య చట్టం సెక్షన్8(1) నేరాల జాబితాలో చేర్చాలి. ఎవరైతే క్రిమినల్ నేరాలలో భాగస్వామ్యం కల్గి ఉన్నారు అనే ఆరోపణ ఎదుర్కొంటున్నారో వారంతా రాజకీయ పదవుల నుంచి వెంటనే తప్పుకోవాలని ఆ విధంగా ఒక మంచి సాంప్రదాయం సృష్టించాలని సిఫారసు చేశారు.

సంబంధాలు మొదలైనవాటిని కూడా నేరాలుగా పరిగణించాలి. వికలాంగులు అత్యాచారాలకు గురైనపుడు వారి రక్షణకు, న్యాయ సహాయం అందించుటకు ప్రత్యేక పద్ధతులు అవలంభించాలి. అత్యాచారాలకు గురైనపుడు నిర్వహించే వైద్య పరీక్షల విషయంలో తప్పనిసరిగా ఒక క్రమపద్ధతి మరియు కొన్ని గౌరవప్రదమైన విధానాలు అవలంబించాలి. దానికి గాను ప్రపంచ ప్రసిద్ధ నిపుణులచే తయారు చేయబడిన కొన్ని విధానాలను ఈ కమిటీ సూచించింది.

పోలీసులు అత్యాచారాల కేసులో సున్నితంగా వ్యవహరించాలని, నైపుణ్యం, సమగ్రత, నైతికత ఉన్న అధికారులచే ఉన్నత స్థానాలలోనే నియమించాలని పోలీసు వ్యవస్థలో సంస్కరణలు ప్రకాష్ సింగ్ కేసులో సుప్రీంకోర్టు సూచించిన విధంగా తీసుకురావాలని ఈ కమిటీ పేర్కొంది. ఉన్నత పదవులలో అత్యంత నైతికత, సమగ్రత ఉన్న వ్యక్తులు ఉంటే వారు వ్యవస్థకు ఉదాహరణగా ఉంటారని పేర్కొంది. పోలీసులు కేవలం చట్టానికి మాత్రమే కట్టుబడే విధంగా రాజకీయ నాయకుల, ఇతర ఉన్నత వ్యక్తుల ప్రభావాలకు లోను కాకుండా ఉండేవిధంగా మారాలి. బాధ్యతను నిర్లక్ష్యం చేసేవారు నిబంధనలకు అనుగుణంగా శిక్షింపబడాలి. మానభంగం ఫిర్యాదు వచ్చినపుడు పోలీసులు తప్పనిసరిగా కేసును నమోదు చేయాలని పౌరసమాజం కూడా తమ దృష్టికి వచ్చిన అత్యాచారాలను రిపోర్టు చేయాలని ఈ కమిటీ పేర్కొంది. ఏ అధికారి అయినా కేసు నమోదు చేయటంలో, దర్యాప్తు చేయటంలో అలసత్వం,నిర్లక్ష్యం వహించినప్పుడు తీవ్రమైన నేరంగా పరిగణించాలి.

వీధి బాలలు, దిక్కులేని పిల్లల విషయంలో ప్రభుత్వం అత్యంత బాధ్యత వహించి వారికి పునరావాసం, విద్య మొదలైనవి కల్పించాలి. తప్పిపోయిన పిల్లల గణాంకాల విషయంలో జిల్లా మేజిస్ట్రేటు బాధ్యత వహించాలి. వీరి విషయంలో అధికారులు మరింత బాధ్యత, శ్రద్ధ వహించాలి.

న్యాయ వ్యవస్థ తనంతట తానే కొన్ని విషయాలలో అనగా మహిళలపై తీవ్రమైన నేరాల విషయంలో స్పందించాలి. జాతీయ స్థాయిలోనే ఈ విషయమై ఒక వ్యూహం రచించాలి. తప్పిపోయిన పిల్లల విషయంలో వ్యభిచార వృత్తిలోకి స్త్రీలను, పిల్లలను బలవంతంగా దింపే విషయంలో ప్రధాన న్యాయమూర్తి అవసరమైన ఉత్తర్వులు జారీ చేయాలి. బాల నేరస్థుల చట్టం పేర్కొన్నవిధంగా అనాధ గృహాలు, రక్షణ గృహాలు ప్రభుత్వమే నడపాలి. వాటిలో ఉండే ఆహారం, సౌకర్యాలు కౌన్సిలింగ్ మొదలైనవి నాణ్యతగా ఉండాలి. బాలలను మార్చేవిధంగా విద్య బోధన జరిపేవిధంగా చేయటం ప్రభుత్వాల బాధ్యతగా ఉండాలి. ఇప్పటికి చాలా మంది అనాధ పిల్లలు నిర్బంధ చాకిరికి, బిక్షాటనకు బానిసలవుతున్నారు. అందువలన రాష్ట్రాలలోని ఉన్నత న్యాయ స్థానాల ప్రధాన న్యాయమూర్తులు తగిన యంత్రాంగాన్ని నిపుణుల సహాయంతో ఏర్పరచి బాలల, స్త్రీల మరియు వికలాంగుల, వితంతువుల రక్షణకు తగిన చర్యలు తీసుకోవాలి.

స్థానిక ప్రజలతో కమ్యూనిటీ పోలీసు వ్యవస్థను ఏర్పరచాలి. ఆ ప్రాంతంలోని గౌరవప్రదమైన వ్యక్తులను ప్రత్యేకమైన కార్యనిర్వాహక న్యాయమూర్తులుగా నియమించి చిన్న చిన్న నేరాల విషయంలో నిర్ణయం తీసుకొనే అధికారాలు ఇవ్వాలి.

పాలకులకు బుద్ధి చెప్పే విధంగా ఈ కమిటీ కొన్ని సూచనలు చేసింది. వీధి లైట్లు ప్రతిచోట ఏర్పాటు చేయాలని, తోపుడు బండ్ల వ్యాపారాన్ని ప్రోత్సహించాలనీ తద్వారా బస్సుస్టాప్‌ల దగ్గర భద్రత పెరిగే అవకాశం ఉందని సూచించారు.

రాజకీయ సంస్కరణల విషయానికి వచ్చినపుడు నేరస్థులను రాజకీయాల నుంచి బహిష్కరించాలి. రాజకీయ నాయకులు వారిపై ఎటువంటి నేరారోపణలు లేవని ధృవపత్రం పొందాలని, అలాగే హైకోర్టు రిజిస్ట్రారు దగ్గర నుంచి సర్టిఫికెట్ పొందాలని సూచించారు. ఒక వేళ ఏదైనా మేజిస్ట్రేటు నేరం గురించి విచారణ చేపడితే అతనిని ఎన్నికలలో పాల్గొనకుండా అనర్హుడుగా ప్రకటించాలి. అన్ని రకాలైన హీనమైన నేరాలను ప్రజా ప్రాతినిధ్య చట్టం సెక్షన్8(1) నేరాల జాబితాలో చేర్చాలి. ఎవరైతే క్రిమినల్ నేరాలలో భాగస్వామ్యం కల్గి ఉన్నారు అనే ఆరోపణ ఎదుర్కొంటున్నారో వారంతా రాజకీయ పదవుల నుంచి వెంటనే తప్పుకోవాలని ఆ విధంగా ఒక మంచి సాంప్రదాయం సృష్టించాలని సిఫారసు చేశారు.

ఐపిసి సెక్షన్ 100లో మానభంగాన్ని ఎదుర్కొనే క్రమంలో నిందితుడుని చంపడం నేరం కాదని

సూచన చేశారు.

మహిళలపై అత్యాచారాలకు సంబంధించి ఎఫ్.ఐ.ఆర్ నమోదు చేయనట్లయితే సంబంధిత అధికారులను 5 సంవత్సరాలు కఠిన కారాగార శిక్ష లేదా జరిమానా విధించవచ్చు.

యాసిడ్ దాడులకు ప్రత్యేకమైన సెక్షన్ రూపొందించారు. యాసిడ్ దాడుల వలన బాధించబడితే అలాంటి కేసులలో 10సం॥లకు తగ్గకుండా జీవితఖైదు విధించవచ్చు. బాధితులకు నష్టపరిహారం చెల్లించాలని అలాగే యాసిడ్ దాడికి ప్రయత్నం చేసిన కేసులలో 5 సంవత్సరాలకు తగ్గకుండా 7 సం.రాల వరకు కఠిన కారాగార శిక్ష మరియు నష్టపరిహారం విధించవచ్చని సూచించారు.

వివస్త్రను చేయడానికి ప్రయత్నం చేస్తే లేదా బలవంతం చేస్తే 3 సం॥ల వరకు శిక్ష విధించవచ్చు.

స్త్రీల వెంటబడి వారితో సంబంధం పెట్టుకునేందుకు ప్రయత్నించినా, వారి యిష్టానికి వ్యతిరేకంగా ప్రయత్నం చేసినా, ఏవిధమైన సమాచార వ్యవస్థ ద్వారానైనా వారిని నియంత్రించే ప్రయత్నం చేసినా, వారి మానసిక ప్రశాంతతకు భంగం కల్గించినా దానిని స్టాకింగ్ అనే నేరంగా భావించి సంవత్సరం నుంచి 3 సంవత్సరాల శిక్ష విధించాలని సూచించారు. అలాగే స్త్రీలను వ్యభిచార రొంపిలోకి దింపే వారికి శిక్ష 5 సంవత్సరాల నుంచి 7 సంవత్సరాలు విధించవచ్చునని చెప్పారు.

రేప్ పరిధిని విస్తృతపరిచారు. రేప్‌కు శిక్షను మరణించేవరకు జీవితఖైదు విధించవచ్చునని సూచించారు.

కస్టడీలో మానభంగం జరిగితే (అనగా పోలీసు స్టేషన్‌లో, ఆసుపత్రులలో, ఆర్మీ అధికారుల వద్ద, జైళ్ళలో మొదలైన చోట్ల) శిక్షను 10సం॥ల నుంచి మరణించే వరకు జీవితఖైదు విధించవచ్చునని సూచించారు. మానభంగం ప్రక్రియలో స్త్రీల మరణానికి కారణమయినా లేదా అలాంటి పరిస్థితికి కారణమైన 20 సంవత్సరాల నుంచి మరణించే వరకు జీవితఖైదు విధించవచ్చునని సూచించారు.

చిన్న పిల్లలపై రేప్ (16 సం.రాలలోపు) చేస్తే, అంగీకారం ఉన్నా లేకపోయినా అలాంటి నిందితులను 10సం.రాల నుంచి జీవితఖైదు వరకు విధించవచ్చునని సూచించారు. అలాగే చిన్న పిల్లలపై మానభంగం చేసే క్రమంలో వారికి మరణానికి కాని అలాంటి పరిస్థితికి కారణమైన వారికి 20సం.ల నుంచి మరణించే వరకు జైలు శిక్ష విధించవచ్చు.

ఒకరి కంటె ఎక్కువమంది మానభంగం చేసే దాన్ని గ్యాంగ్ రేప్‌గా పరిగణించి 20 సం॥లకు తగ్గకుండా జీవితఖైదు శిక్ష విధించవచ్చు. ఈ క్రమంలో మరణానికి కాని అలాంటి పరిస్థితికి కారణమైతే మరణించే వరకు జీవితఖైదు విధించవచ్చు.

**ఎఫ్.ఐ.ఆర్. నమోదు :** మహిళలపై అత్యాచారాల విషయంలో మహిళా పోలీసే (సాధ్యమైనంతవరకు) కేసు నమోదు చేయాలని బాధితురాలికి అవసరమైన న్యాయ సహాయం లేదా మహిళా సంఘాల, ఆరోగ్య కార్యకర్తల సహాయం అందించాలి. ఒక వేళ బాధితురాలు శారీరక లేదా మానసిక వికలాంగురాలైతే వారింటివద్ద లేదా వారికి అనుకూలమైన ప్రదేశంలో వారి భాష అర్థం చేసుకోగల్గిన నిపుణుల సమక్షంలో కేసు నమోదు చేసి వీడియో తీయాలి.

అలాగే ప్రాసిక్యూషన్ చేయడానికి అనుమతి విషయంలో కూడా ఈ కమిటీ మార్పులు సూచించింది. అనగా ప్రభుత్వోద్యోగులుగా ఉంటూ వారిపై నేరారోపణ వచ్చినప్పుడు ప్రభుత్వ అనుమతి అవసరమైన సందర్భంలో స్త్రీలపై అత్యాచారాల విషయంలో ఆ అనుమతి నుంచి మినహాయింపు ఇవ్వాలని సూచించింది. అనగా ఎటువంటి ప్రభుత్వ అనుమతి లేకుండానే అత్యాచారాల విషయంలో ప్రాసిక్యూషన్ చేయవచ్చని తెలిపింది.

**అత్యవసర సర్వీస్ :** అత్యాచారాల విషయంలో వెంటనే స్పందించటానికి ఒక అత్యవసర సర్వీసు ఏర్పాటు చేయాలని సూచించింది. పోలీసుల సహాయం కొరకు 100 ఫోన్ నంబరు ఏర్పాటు చేసినట్లు అత్యాచారాల విషయంలో హెల్ప్‌లైన్‌ను ఏర్పాటు చేయబడాలి.

**లైంగిక నేరాలు :** వివాహం అయినంత మాత్రాన భార్యలపై వారి అనుమతులు లేకుండా లైంగిక కార్యకలాపాలు జరపరాదని సూచించింది. రేప్ నేరానికి వివాహం డిఫెన్స్ కారాదని పేర్కొంది.

**ఆర్మీ అధికారుల చట్టంలో మార్పులు :** ఆర్మీ అధికారులను నేరాల విషయంలో ప్రాసిక్యూషన్ చేయాలంటే ప్రభుత్వ అనుమతి అవసరం అనే నిబంధన అత్యాచారాల విషయంలో మినహాయింపు ఇవ్వాలని సూచించింది. అనగా ఎటువంటి అనుమానం లేకుండానే అత్యాచార ఆరోపణపై ప్రాసిక్యూషన్ చేయవచ్చు.

అనేక రంగాలను అధ్యయనం చేసి అన్ని వ్యవస్థలలో మార్పులను సూచించి ప్రభుత్వానికి నివేదికను అందచేసినప్పటికీ ప్రభుత్వం కొన్ని విషయాలలో వెనుకంజవేసింది. ఏమైనప్పటికీ వర్మ సిఫారసులు చట్టం రూపంలో వస్తే స్త్రీలపై అత్యాచారాల విషయంపై భయం ఏర్పడుతుందని తద్వారా నేరాల సంఖ్య తగ్గుతుందని ఆశిద్దాం. కాని సమాజంలో నైతిక విలువలు పెరగనంతవరకు, రాజకీయ, సామాజిక వ్యవస్థలు సంస్కరించబడనంతవరకు పూర్తి పరిష్కారం దొరుకుతుందని ఆశించలేము.

★

ప్రతి యేటలాగానే మార్చి8న అంతర్జాతీయ మహిళా దినోత్సవం జరుపుకోబోతున్నాం. కానీ, నేడు మనం జరుపుకోబోతున్న మహిళా దినోత్సవానికి చాలా ప్రాధాన్యత ఉంది. నయా ఉదారవాద విధానాల ప్రభావం మహిళల హక్కులు, రక్షణ, సమాన అవకాశాలు, పరిధుల్ని ధ్వంసం చేస్తున్నాయి. సాధికారత గురించి

# అంతర్జాతీయ మహిళా దినోత్సవం

\- పద్మశ్రీ

చెప్పుకుంటున్న కాలంలో మహిళల మీద జుగుప్సాకరమైన దాడులు పెరిగాయి. సభ్య సమాజం సిగ్గుపడేలా వావి వరుసలు కనుమరుగైపోతున్నాయి. సాహితీ, సాంస్కృతిక రంగాలలో వస్తున్న మార్పులు విష సంస్కృతిని పెంచుతున్నాయి. లైంగిక వేధింపులు, అత్యాచారాలు, హత్యా నేరాలు విజృంభిస్తున్నాయి. అణ్యం, పుణ్యం తెలియని పసిపాపల మీద సహితం సాంఘిక దురాచారాలు కట్టలు తెంచుకుంటున్నాయి. ఇంతటి సంక్లిష్ట స్థితిలో కూడా సామాజిక బంధనాలను అధిగమించి ఇంటా-బయటా అన్ని రంగాల్లో మహిళలు పురుషులకే మాత్రం తీసిపోకుండా పురోగమనం వైపు పయనిస్తున్న సంఘటనలు కోకొల్లలుగా ఉన్నాయి. ఈ నేపథ్యంలో మనం 'అంతర్జాతీయ మహిళా దినోత్సవాన్ని' జరుపుకుంటున్నాము.

**అంతర్జాతీయ మహిళా దినోత్స నేపథ్యం:**

1857 మార్చి 8 అమెరికా దేశంలోని న్యూయార్క్ నగరంలో వేతనాలు పెంచాలని, పనిగంటలు తగ్గించాలని, సౌకర్యాలు కల్పించాలని, అమానవీయ చర్యలకు వ్యతిరేకంగా, ఓటు హక్కు కోసం వేలాదిమంది మహిళలు ఆందోళన చేశారు. 'ఆకలి కడుపులతో పనిచేయడం కన్నా పోరాడుతూ చావటం మేలు' అన్న నినాదం'తో బట్టల మిల్లుల్లో పనిచేసే మహిళా కార్మికులు సమ్మె చేశారు. ఇది సహించలేని యాజమాన్యం మహిళా కార్మికుల్ని మిల్లుల్లో బంధించి నిర్దాక్షిణ్యంగా జరిపిన కాల్పుల్లో 146 మంది తుపాకీ తూటాలకు బలయ్యారు. అందరూ 13-25 సం॥లలో లోపు వయసు వారే. ఈ పిరికిపందల చర్యకు వెరవకుండా చేసిన వీరోచిత పోరాటంతో యజమానులు దిగిరాక తప్పలేదు. షాపుల వారీగా ఒప్పందాలు జరిగాయి.

**మహిళా కార్మికుల బాధలు, పోరాటాలు ప్రపంచ వేదికపై చర్చ:**

'కార్మిక వర్గ సిద్ధాంత పితామహుడు కారల్‌మార్క్స్' నేతృత్వంలో 1866లో స్థాపించబడిన 'అంతర్జాతీయ కార్మిక సంస్థ (మొదటి ఇంటర్నేషనల్) మహిళలకు వృత్తిపరమైన హక్కులు గుర్తించింది. మహిళలు ఇంటికి పరిమితం కాకుండా బయటకు వచ్చి పని చేస్తే కుటుంబాలు దెబ్బతింటాయని, పురుషులకు పని దొరకదని, బేరసారాలాడే శక్తి తగ్గిపోతుందని, కనుక వీరిని ఫ్యాక్టరీల్లో పనిచేయడానికి అనుమతించరాదని జరుగుతున్న ప్రచారాన్ని, వాదనలను ఈ వేదిక ద్వారా మార్క్స్ తిప్పికొట్టాడు.

ఫ్యాక్టరీలలో స్త్రీలు పని చేయాలి. పని చేయడం ద్వారా స్త్రీల జీవితాల్లో విప్లవాత్మక మార్పు వస్తుంది. కుటుంబం అనే సంకుచిత చట్రం నుండి బయట పడవేస్తుందని మార్క్స్ వాదించాడు. అదే సందర్భంలో శ్రామిక మహిళల్ని సంఘటితం చేయాలని, స్త్రీల ప్రత్యేక సమస్యలు కార్మికోద్యమ ప్రధాన స్రవంతిలో భాగం కావాలని మార్క్స్ నొక్కి చెప్పారు. ఈ నిర్ణయం శ్రామిక మహిళల పోరాటాలకు స్ఫూర్తినిచ్చింది.

అంతర్జాతీయ కార్మిక సంస్థ 1889లో మరోసారి శ్రామిక మహిళల సమస్యలపై చర్చించింది. జర్మన్ కమ్యూనిస్టు నేత క్లారా జెట్కిన్ చూపిన చొరవ, ఆమెకున్న రాజకీయ పరిణితి, అనుభవం తోడు కావడంతో 'పారిస్‌లో జరిగిన రెండవ అంతర్జాతీయ మహాసభ(1889)లో మహిళల పని హక్కు, తల్లీ, బిడ్డల సంరక్షణ, ట్రేడ్ యూనియన్ ఉద్యమాల్లో స్త్రీల పాత్ర వంటి అంశాలు చర్చకు పెట్టారు.

**మహిళా కార్మికుల యూనియన్ల ఆవిర్భావానికి దారితీసిన ఘటనలు:**

అమెరికాలోని కుట్టుపని (టైలరింగ్), అంతర్జాతీయ బట్టల మిల్లుల్లో పనిచేసే

'కార్మిక వర్గ సిద్ధాంత పితామహుడు కారల్‌మార్క్స్' నేతృత్వంలో 1866లో స్థాపించబడిన 'అంతర్జాతీయ కార్మిక సంస్థ (మొదటి ఇంటర్నేషనల్) మహిళలకు వృత్తిపరమైన హక్కులు గుర్తించింది. మహిళలు ఇంటికి పరిమితం కాకుండా బయటకు వచ్చి పని చేస్తే కుటుంబాలు దెబ్బతింటాయని, పురుషులకు పని దొరకదని, బేరసారాలాడే శక్తి తగ్గిపోతుందని, కనుక వీరిని ఫ్యాక్టరీల్లో పనిచేయడానికి అనుమతించరాదని జరుగుతున్న ప్రచారాన్ని, వాదనలను ఈ వేదిక ద్వారా మార్క్స్ తిప్పికొట్టాడు.

ఫ్యాక్టరీలలో స్త్రీలు పని చేయాలి. పని చేయడం ద్వారా స్త్రీల జీవితాల్లో విప్లవాత్మక మార్పు వస్తుంది. కుటుంబం అనే సంకుచిత చట్రం నుండి బయట పడవేస్తుందని మార్క్స్ వాదించాడు.

పార్లమెంట్‌లో మహిళా రిజర్వేషన్ బిల్లును ప్రవేశపెట్టాలనే డిమాండ్ సంవత్సరాల తరబడి కొనసాగుతూనే ఉంది. దేశంలోని పాలక పార్టీలన్నీ (కాంగ్రెస్, బిజెపి, సమాజ్‌వాదీ, ఆర్జెడీ, టిడిపి తదితర...) అడ్డుపడుతున్నాయి. కాంగ్రెస్ పార్టీ ఆధ్వర్యంలోని యుపిఎ ప్రభుత్వం బిల్లు పెట్టేందుకే సిద్ధపడడం లేదు.

ప్రపంచ పార్లమెంట్లలో మహిళా ప్రతినిధుల సంఖ్య 1995 నుండి 2012 మధ్య కాలంలో 11.3% నుంచి 19.7%నికి అంటే 75% పెరిగినట్లు ఐక్య రాజ్య సమితి సహస్రాబ్ది లక్ష్యాల నివేదిక 2012 వెల్లడించింది. మన పార్లమెంట్‌లో మాత్రం మహిళల సంఖ్య 9.7% నుంచి 10.96% నికి మాత్రమే పెరిగింది.

మహిళా కార్మికులు చీకటిగదుల్లు, భరించలేని స్థాయిలో యంత్రాల శబ్దాల మధ్య పనిచేయాల్సి ఉండేది. పని చేసేటప్పుడు ఒకరికొకరు మాట్లాడుకోకూడదు. నవ్వకూడదు. పాడకూడదు. వేతనం లేకుండానే అదనపుపని చేయాలి. ఈ స్థితి నుండి మెరుగైన పరిస్థితులు సాధించుకోవాలంటే సంఘటిత రూపం అవసరమని భావించిన శ్రామిక మహిళలు 1900సం॥లో యూనియన్‌ను ఏర్పాటు చేసుకున్నారు.

1903 నేషనల్ ఉమెన్స్ లీగ్, ఇతర శ్రామిక మహిళల సంఘీభావంతో 20వేల మంది బట్టల మిల్లుల కార్మికులు అనేక పోరాటాలు చేశారు. సమ్మెలు చేశారు. 16-25 సం॥ల యువతులు ఎవరు కన్పిస్తే వారిని పోలీసులతో అరెస్టులు చేయించారు. కార్మికుల్ని భయపెట్టి లొంగదీసుకుని పోరాటాన్ని నీరుగార్చేందుకు రకరకాల ప్రయత్నాలు చేశారు.

**మొదటి అంతర్జాతీయ సోషలిస్టు మహిళా సదస్సు :**

జర్మనీలోని స్టట్‌గార్ట్ నగరంలో 1907లో జరిగింది. కామ్రేడ్ క్లారా జెట్కిన్ చొరవతో జరిగిన ఈ సదస్సులో 15 దేశాలకు చెందిన 59మంది మహిళలతో సమన్వయ కమిటీ ఏర్పడింది.

1910లో కోపెన్ హెగెన్‌లో జరిగిన అంతర్జాతీయ సోషలిస్టు మహిళల 2వ మహాసభలో క్లారాజెట్కిన్ "మహిళా దినోత్సవం" జరపాలని తీర్మానాన్ని ప్రతిపాదించారు. ఈ సభకి 17 దేశాల నుండి హాజరైన 100మంది ప్రతినిధులు ఈ ప్రతిపాదనను ఏకగ్రీవంగా ఆమోదించారు. "ప్రపంచ వ్యాప్తంగా వున్న మహిళల పోరాటాలకు సూచికగా సంవత్సరంలో ఒక రోజు పాటించాలని నిర్ణయించారు."

కోపెన్ హెగెన్ మహాసభ నిర్ణయం మేరకు తొలిసారిగా ఆస్ట్రియా, డెన్మార్క్ జర్మనీ, స్విట్జర్లాండ్ దేశాలలో 1911 మార్చి 19న సుమారు 10 లక్షల మంది స్త్రీలు, పురుషులు ఓటు హక్కు ప్రభుత్వ ఉద్యోగాలు, పని హక్కు వృత్తి శిక్షణ తదితర డిమాండ్లపై ప్రదర్శనలు నిర్వహించారు. ఉపాధిలో లింగ వివక్షతను నిర్మూలించాలని డిమాండ్ చేశారు.

అనేక దేశాలు మార్చి8నే మహిళా దినోత్సవం జరపాలని నిర్ణయించాయి. ఆ విధంగా అంతర్జాతీయ స్థాయిలో మహిళా దినోత్సవం జరిగేందుకు మూలాధారమైనది. మన దేశంలో 1975 సం॥ నుండి నిర్వహిస్తున్నారు.

**ప్రస్తుత పరిస్థితులు:**

దేశంలో గత 2 దశాబ్దాలకు పైగా అమలవుతున్న సరళీకృత ఆర్థిక విధానాలు శ్రామిక మహిళల జీవితాల్లో పెనుమార్పులే తెచ్చాయి. . దేశంలో సేవల రంగం విస్తరిస్తున్నది. దేశంలో ఉపాధిపొందుతున్న మహిళల్లో 6%మాత్రమే సంస్థాగతమైన ఉద్యోగాలు పొందుతున్నారు. 94% మంది అసంఘటిత రంగంలో పనిచేస్తున్నారు. మన రాష్ట్రంలో సైతం లక్షలాది మంది కాంట్రాక్టు, ఔట్‌సోర్సింగ్, పార్ట్‌టైమ్, వాలంటీర్ వంటి పేర్లతో పనిచేస్తున్నారు. బీడీ రంగంలో 10లక్షల మంది, నిర్మాణ రంగంలో 8లక్షలు, ఇంటి పనివారులుగా 20 లక్షల మంది శ్రామిక మహిళలు పనిచేస్తున్నారు.

భారతదేశం ప్రపంచంలోకెల్లా పెద్ద ప్రజాస్వామ్య దేశం అని మన పాలకులు గొప్పలు చెబుతుంటారు. 2013 డిశంబర్ 16న మన దేశరాజధాని నగరంలో వైద్య విద్యార్థినిపై జరిగిన సామూహిక అత్యాచార ఘటన మన దేశ పరువుని బజారుకీడ్చింది. ఈ ఘటన కంటే ముందు నుంచే మహిళల మీద జరుగుతున్న విషదాడి ఢిల్లీ నగర ప్రజల్లో కసి నివురుగప్పిన నిప్పులా దాగి ఉంది. డిశంబర్ 16 ఘటనతో ఒక్కసారిగా కట్టలు తెంచుకుంది. ఫేస్‌బుక్, ఇ-మెయిల్స్, ఎస్.ఎం.ఎస్‌లు సంధాన కర్తలుగా ప్రజల్ని కదిలించాయి. కుటుంబాలకు కుటుంబాలే వీధుల్లోకి వచ్చేలా చేశాయి. ప్రభుత్వ నిర్బంధాన్ని సైతం లెక్క చేయకుండా సామూహిక అత్యాచార నిందితులను కఠినంగా శిక్షించాలని, మహిళలకు రక్షణ కల్పించాలని డిమాండ్ చేస్తూ వయస్సుతో నిమిత్తం లేకుండా లక్షలాది గళాలు నినదించాయి. తొలుత సాచివేత వైఖరిలోఉన్న పాలకులు ఈ ఘటన విచారణకు 'జస్టిస్ వర్మ కమిటీ'ని నియమించడం, ఆ కమిటీ నెలరోజుల్లో నివేదికను కేంద్ర ప్రభుత్వానికి సమర్పించింది. వర్మ కమిటీ సిఫారుసుల్లో కొన్ని ముఖ్యమైన అంశాలను పక్కన బెట్టి కేంద్ర ప్రభుత్వం ఆర్డినెన్స్‌ను రాష్ట్రపతి ఆమోదానికి పంపడం అత్యంత దారుణమైన విషయం.

మరో వైపు దేశంలో అన్ని రకాల వస్తువుల ధరలు భగ్గుమంటున్నాయి. పెట్రోల్ మీద గతంలోనే ప్రభుత్వం కంట్రోల్‌ను ఎత్తివేసింది. డీజిల్‌కి అదే విధమైన స్వేచ్ఛనిస్తున్నారు. గ్యాస్ బండలకు కోత పెట్టారు. రైల్వే చార్జీలు పెంచారు. రాష్ట్రంలో విద్యుత్ మరియు ఇంధన సర్దుబాటు చార్జీల పేరుతో ఈ పాటికే 25వేల కోట్ల రూపాయల మేరకు ఛార్జీలు మోపారు. 2013 ఏప్రిల్ నాటికి మరోసారి

13 వేల కోట్ల రూపాయల వేర పెంచేందుకు సన్నాహాలు జరుగుతున్నాయి. ఆర్టీసి ఛార్జీలుపెంచారు. మద్యం ధరలు 1500కోట్ల రూపాయలు పెంచారు. భూముల ధరలు పెంచాలని నిర్ణయించారు. ఇవన్నీ దేశంలోని సామాన్య, మధ్య తరగతి ప్రజల్ని కృంగదీస్తున్నాయి. రైతాంగాన్ని దివాళా తీయిస్తున్నారు. ఇది చాలదన్నట్లు సబ్సిడీ పథకాలకు ఎసరు పెట్టే విధంగా నగదు బదిలీ పథకాన్ని అమలు చేసేందుకు పూనుకున్నారు.

దేశంలోని ప్రజల కొనుగోలు శక్తిని పెంచి పేదలకు అండగా నిలవాల్సిన ప్రభుత్వాలు అందుకు పూనుకోవడంలేదు. దేశంలో 40%మంది ప్రజలు ఇంకా దారిద్ర్యంలోనే ఉన్నారని ప్రపంచబ్యాంకు నివేదిక ప్రకటించింది. 77%మంది ప్రజలు అంటే 83కోట్ల 60లక్షల మంది తిండి కోసం రోజుకి రూ.20 కూడా ఖర్చుచేయలేని స్థితిలో బ్రతుకుతున్నారని అర్జున్‌సేన్ గుప్తా కమిషన్ తెలిపింది. దేశంలోని ప్రభుత్వ గోదాముల్లో 6కోట్ల టన్నుల ఆహార ధాన్యాలు ఏళ్లతరబడి మూల్గుతున్నాయి. ప్రభుత్వ అసమర్థత వల్ల తినడానికి పనికి రాకుండా పోతున్న 2కోట్ల టన్నుల గోధుమలను సముద్రం పాల్జేస్తున్నారు. సముద్రంలోనైనా పారబోస్తున్నారు గానీ ఆకలి బాధలకు గురవుతున్న వారికి అందించడంలేదు.

మరోవైపు దేశంలోని సంపన్నులకు ప్రభుత్వం ప్రతి యేటా ఇస్తున్న రాయితీ 5,20,000కోట్ల రూపాయలు. మన దేశ ఆర్థిక లోటు 5,12,000కోట్లు. ఈ స్థితిలో కూడా సంపన్నులకు రాయితీ ఇవ్వడం అంటే మన పాలకులు ఎవరి ప్రయోజనాల కోసం పాటుపడుతున్నారో దీన్ని బట్టి స్పష్టం అవుతోంది. మన దేశ ఆర్థిక ఇబ్బందుల్ని అధిగమించేందుకు అవసరమైన చర్యలు తీసుకోకపోగా, మరింత ఊబిలోకి నెట్టే విధంగానే ఉన్నాయి. ఇందుకు ఆజ్యం పోసే విధంగా లక్షలాది కోట్ల రూపాయల ప్రజాధనం అవినీతి, కుంభకోణాల ద్వారా లూఠీ చేయబడుతోంది. 2జి స్పెక్ట్రమ్ 1,76,000కోట్లు, బొగ్గు కుంభకోణం 1,86,000కోట్లు మొదలైని ఇందుకు తార్కాణాలు.

భారతదేశ స్వావలంబనని దెబ్బతీసేవిధంగా విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు ద్వారాలు తెరుస్తున్నారు. చిల్లర వర్తకంలోకి ఎఫ్.డి.ఐ.కి అవకాశం కల్పిస్తూ పార్లమెంట్ ఆమోదించింది. తద్వారా ఈ రంగంపై ఆధారపడి బ్రతుకుతున్న 4 కోట్ల కుటుంబాలు ఉపాధి కోల్పోనున్నారు. ఈ పరిణామాలన్నీ మహిళల మీద, వారి కుటుంబాల మీద తీవ్ర ప్రభావాన్ని చూపనున్నాయి.

**దేశంలో మహిళల పరిస్థితి:**

**2011 జనాభా లెక్కల ప్రకారం:**

దేశంలో మహిళలే పోషిస్తున్న కుటుంబాలు 2,69కోట్లు. ఆంధ్ర ప్రదేశ్‌లో 30 లక్షలకు పైగా కుటుంబాలను మహిళలే పోషిస్తున్నారు. రక్తహీనతతో బాధపడుతున్న శ్రామిక మహిళలు 48%మంది ఉన్నారు. ప్రతి యేటా ప్రసవం సందర్భంగా మృత్యువాత పడుతున్న వారు 55 వేల మంది. పుట్టి యేడాదిలోపే చనిపోతున్నవారు, 5 యేళ్ళలోపే రకరకాల వ్యాధులతో చనిపోతున్న వారి సంఖ్య కూడా పెరిగిపోతుంది.

**చట్ట సభల్లో మహిళా ప్రాతినిధ్యం:**

పార్లమెంట్‌లో మహిళా రిజర్వేషన్ బిల్లును ప్రవేశపెట్టాలనే డిమాండ్ సంవత్సరాల తరబడి కొనసాగుతూనే ఉంది. దేశంలోని పాలక పార్టీలన్నీ (కాంగ్రెస్, బిజెపి, సమాజ్‌వాది, ఆర్జెడీ, టిడిపి తదితర...) అడ్డుపడుతున్నాయి. కాంగ్రెస్ పార్టీ ఆధ్వర్యంలోని యుపిఎ ప్రభుత్వం బిల్లు పెట్టేందుకే సిద్ధపడడం లేదు.

ప్రపంచ పార్లమెంట్లలో మహిళా ప్రతినిధుల సంఖ్య 1995 నుండి 2012 మధ్య కాలంలో 11.3% నుంచి 19.7%నికి అంటే 75% పెరిగినట్లు ఐక్య రాజ్య సమితి సహస్రాబ్ది లక్ష్యాల నివేదిక 2012 వెల్లడించింది. మన పార్లమెంట్‌లో మాత్రం మహిళల సంఖ్య 9.7% నుంచి 10.96% నికి మాత్రమే పెరిగింది. మన పొరుగు దేశమైన నేపాల్, బంగ్లాదేశ్ కంటే వెనుకబడి వున్నాం. 545 మంది లోక్‌సభ సభ్యుల్లో 60మంది, 244మంది రాజ్యసభ సభ్యుల్లో 26 మంది మాత్రమే మహిళా సభ్యులున్నారు.

**తగ్గుతున్న మహిళల సంఖ్య:**

దేశంలో స్త్రీ పురుష నిష్పత్తిలో తీవ్రమైన అసమానతలు పెరుగుతున్నాయి. ఇది ప్రమాదకర పరిణామం. ప్రస్తుత తాజా పరిస్థితి 933:1000గా ఉంది. గ్రామీణ, పట్టణ ప్రాంతాలను విభజించి చూస్తే గ్రామాలలో 946: 1000, పట్టణాల్లో 900:1000గా ఉంది. అయితే కేరళ రాష్ట్రం ఇందుకు భిన్నంగాఉంది. స్త్రీ, పురుష నిష్పత్తి 1058:1000గా ఉంది. హర్యానాలో అత్యంత ప్రమాదకరం 861:1000 గా ఉంది.

భారత శిక్షాస్మృతి (ఐపిసి) అత్యంత తీవ్రమైన నేరాలుగా గుర్తించిన అత్యాచారం, అపహరణలు, వరకట్నవేధింపులు, మానసిక, భౌతిక హింస, లైంగిక వేధింపులు, మహిళలను అల్లరిచేయటం (ఈవ్‌టీజింగ్), బాలికల అక్రమ రవాణా వంటి నేరాలు 2007నుంచి పెరుగుతూనే ఉన్నాయి. అత్యాచారాల కేసులు 2010-2011 మధ్య 9.2% పెరిగాయి.

పై సంఘటనలు శ్రామిక మహిళలు, మొత్తంగా మహిళా లోకం, ప్రజాతంత్ర ఉద్యమంలో భాగస్వాములం కావాల్సిన అవసరాన్ని నొక్కి చెబుతున్నాయి. కుల-మత, ప్రాంతీయతత్వ ఉద్యమాలు అందుకు ఆటంకంగా ఉన్నాయి. ఈ ఆటంకాలను అధిగమించి ముందుకెళ్ళాలి. సంఘటిత పోరాటాలను తీవ్రతరం చేయాలి. అప్పుడే మనం మనుగడ సాగించగలం. అందుకు అన్ని స్థాయిల్లోని శ్రామిక మహిళా, ఐద్వా కమిటీలు పునరంకితం కావాలని కోరుతున్నాము.

మణిపూసలు

# భారతదేశ నైటింగేల్- సరోజినీ నాయుడు

**1879 ఫిబ్రవరి 13 సరోజిని నాయుడు జయంతి సందర్భంగా....**

- వకుళాభరణం లలిత



"నేను భారత మహిళను. నాది ఆంధ్ర దేశం. ఆంధ్ర మహిళలను మహాత్మాగాంధి రాట్న రాణులుగా పేర్కొన్నాడు" అని గర్వంతో ఎలుగెత్తి చాటిన మహిళ సరోజినీనాయుడు. 'ఆంధ్రులు హృదయ పాకమున శ్రేష్ఠులు' అని కాకినాడ కాంగ్రెసులో ఆమె పేర్కొన్నారు.

సరోజినీ నాయుడు తల్లి శ్రీమతి వరదసుందరీదేవి. తండ్రి శ్రీ అఘోరానాథ్ చటోపాధ్యాయ. ఇద్దరూ వంగదేశీయులు. హైదరాబాద్‌లో జన్మించిన ఆమె 'లిటిల్ గరల్స్' పాఠశాలలో చదువుకున్నారు. అదే ఉస్మానియా స్త్రీల కళాశాలగా రూపుదిద్దుకుంది. 13వ ఏటనే మెట్రిక్యులేషన్ ఉన్నతశ్రేణిలో పాసైన ఆమె 11వ యేట నుండే ఆంగ్లంలో కవితలు రాయటం ప్రారంభించారు. నిజామ్ ప్రభువు ఆశ్చర్యపడి ఆమెను ఉన్నత విద్యలకు ఇంగ్లండు పంపించాడు. లండన్‌లోని కింగ్స్ కాలేజీలోను, కేంబ్రిడ్జ్ యూనివర్శిటీలోని గిర్టన్ కాలేజీలోను చదివారు. దేశాన్ని మరచిపోక ఈ దేశాన్ని గూర్చి ఉత్తమ కవితలను రాశారు. స్విట్జర్లాండ్ వెళ్ళి అక్కడి రమణీయ ప్రకృతిని చూసి కవితలల్లారు. ఇంగ్లండులోని ఎంతోమంది కవులు, పండితులు ఈమె కవితా పాటవానికి ఆశ్చర్యపడ్డారు. హైదరాబాద్‌లో ఛీఫ్ మెడికల్ ఆఫీసరుగా ఉన్న ముత్యాల గోవిందరాజులు నాయుడిగారిని ప్రేమించారు. ఆనాటికే ఫిజిక్స్ ప్రొఫెసర్‌గా ఉన్న ఆమె తండ్రి విషయం తెలుసుకుని ఆంధ్ర సంస్కరణోద్యమ పితామహుడైన శ్రీకందుకూరి వీరేశలింగంగారితో సంప్రదించి మద్రాసు బ్రహ్మమందిరంలో వారివురికీ వివాహం జరిపించారు. అందుకే నేను ఆంధ్రమహిళను అని చాటుకోగల్గారు.

1905లో సరోజినీ నాయుడు కాంగ్రెసు సభలో ఇచ్చిన ఉపన్యాసం ఎంతోమందిని ఆకర్షించింది. ఆమె కవయిత్రి మాత్రమే కాదు. ఒక మహాశక్తి. ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ, బెంగాలీ భాషల్లో అనర్గళంగా కవితాగానం లాగే ఉపన్యసించి తన దేశభక్తిని చాటుకున్నారు.

గోపాలకృష్ణ గోఖలే సరోజినీ నాయుడిని ఏమి చేస్తావని ప్రశ్నిస్తే, ఐదు సంవత్సరాల్లో దేశంలోని ముస్లిం, హిందూ సఖ్యతను తెస్తానని చెప్పింది. ఆమెకు ముస్లీంలు, పార్శీలు, హిందువులూ అందరూ స్నేహితులే. మానవులంతా సోదర భావంతో కలిసి, మెలసి ఉండాలని వాంఛించారు. 1921లో జరిగిన హిందూ ముస్లిం మత కలహాల్లో కూడా నిర్భయంగా తిరుగుతూ శాంతిప్రియత్వాన్ని చాటారు. 1922లో గాంధీజీ జైలుకు వెళుతూ దేశ ఐక్యతను కాపాడాల్సిన బాధ్యత ఆమెదేనన్నారు. దానికామె సమాధానం, "నేను స్త్రీని, అన్ని మతాలవారు, అన్ని వర్గాలవారు అన్నదమ్ములుగా మెలిగేట్లు చూస్తాను"అని అన్నారు.

కాంగ్రెసులో ఆమె 25 సంవత్సరాలు పనిచేశారు. ఆమెకు సమ్మోహన శక్తి ఉందని గాంధీ భావించారు. 1914లోనే 'రాయల్ సొసైటీ ఆఫ్ ది లిటరేచర్' సభ్యురాలైంది. చిన్ననాటినుంచే తన ఆంగ్ల కవిత్వానికి గొప్పపేరు సంపాదించుకున్న ఆమె బ్రిటీష్‌వారితో వాదించి, ఎదిరించి కీర్తిని పొందారు. ఆమె విదేశీయాత్రలన్నీ ఒంటరిగానే చేశారు. గాంధీకి గాని, ఇతర కాంగ్రెసు నాయకులకు గాని ఆమె సమర్థత పట్ల విపరీతమైన నమ్మకం. 1920లో జరిగిన జలియన్‌వాలాబాగ్ దురంతాలను ఖండించి సమర్థించబోయిన మాంటె నోరు మూయించారు. ఆల్బర్ట్‌హాల్లో జలియన్‌వాలాబాగ్ దురంతాలను, స్త్రీలకు జరిగిన అవమానాలను ఆమె వివరిస్తున్న సమయంలో రౌడీమూక అల్లరి చేస్తుంటే

ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఉప్పు కొఠారీలపై జరిగిన దాడికి నాయకత్వం వహించారు. ఆమెకు ఆహారం అందించకపోయినా, ప్రళయం వచ్చినా తన పనిలోనే ఉంటానని చెప్తూ, మిగిలిన వారిని 'మీరు ఆ విధంగా ఉండగలరా?' అని ప్రశ్నించారు. 1932 ఏప్రిల్‌లో శాసనోల్లంఘనోద్యమంలో అరెస్టు అయ్యారు. 'క్విట్ ఇండియా' ఉద్యమంలో మరలా అరెస్టులు చేసి గాంధీజీ, మీరాబెన్, మహాదేవ దేశాయిలతో పాటు పూనాలో ఆగాఖాన్ మందిరంలో బంధించారు. 1931లో విడుదలై రౌండ్‌టేబుల్ సమావేశానికి భారత ప్రతినిధిగా హాజరైనారు. 1920లోనే అంతర్జాతీయ మహిళా సభకు భారత ప్రతినిధిగా జనీవా వెళ్ళారు. భారత స్త్రీల గొప్పతనాన్ని చాటిచెప్పారు.

స్త్రీకి ప్రత్యేక హక్కులు అవసరం లేదనీ, వాళ్ళు దేశస్వాతంత్ర్య పోరాటంలో పాల్గొంటే హక్కులు వాటంతట అవే వస్తాయనీ, హక్కులు ఒకరు ఇచ్చేవి, ఒకరు పుచ్చుకునేవి కావనీ ఆమె తేల్చిచెప్పారు. స్త్రీల ఓటింగ్ హక్కుకోసం ఆమె గట్టిగా పోరాడారు.

"నోరుమూయండి"అని పెద్దగా అరిచారు.

అమెరికాలో ఆమె ఇచ్చిన ఉపన్యాసం అక్కడి ప్రజలను ఆశ్చర్యపరిచింది. ఒక వ్యాపారస్తుడు లేచి "ఇటువంటి శక్తి నేను ఏ స్త్రీలోనూ చూడలేదు" అని అన్నాడు.

ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఉప్పు కొఠారీలపై జరిగిన దాడికి నాయకత్వం వహించారు. ఆమెకు ఆహారం అందించకపోయినా, ప్రళయం వచ్చినా తన పనిలోనే ఉంటానని చెప్తూ, మిగిలిన వారిని 'మీరు ఆ విధంగా ఉండగలరా?' అని ప్రశ్నించారు. 1932 ఏప్రిల్‌లో శాసనోల్లంఘనోద్యమంలో అరెస్టు అయ్యారు. 'క్విట్ ఇండియా' ఉద్యమంలో మరలా అరెస్టులు చేసి గాంధీజీ, మీరాబెన్, మహదేవ దేశాయిలతో పాటు పూనాలో ఆగాఖాన్ మందిరంలో బంధించారు. 1931లో విడుదలై రౌండ్‌టేబుల్ సమావేశానికి భారత ప్రతినిధిగా హాజరైనారు. 1920లోనే అంతర్జాతీయ మహిళా సభకు భారత ప్రతినిధిగా జనీవా వెళ్ళారు. భారత స్త్రీల గొప్పతనాన్ని చాటిచెప్పారు. 1947 మార్చి 23నుంచి ఏప్రిల్ 2వ వరకు ఢిల్లీ ఎర్రకోటలో జరిగిన ఆసియా ఖండ సమైక్యసభకు ఆమె అధ్యక్షత వహించారు. ఆమె ఎక్కడున్నా ఏం చేసినా శాంతిదూతయే.

1917లో దక్షిణాఫ్రికాలో బానిసల కన్నా హీనంగా, నికృష్టంగా జీవితం గడుపుతున్న ప్రవాస భారతీయుల ఉద్ధరణ కోసం, నిర్బంధ కూలి చట్టానికి వ్యతిరేకంగా పనిచేశారు. భారతీయుల రక్షణ కోసం 1923లో కెన్యాకు వెళ్ళారు. 1924లో బెల్గాం సమావేశంలో పాల్గొన్నారు. ఆఫ్రికా నుంచి వచ్చిన ప్రతినిధులు సరోజినీ నాయుడిగారిని తమ దేశానికి పంపమని కోరారు. ప్రవాస భారతీయుల కోసం కృషి చేసిన వ్యక్తుల్లో గాంధీ తర్వాత పీఠం సరోజినీ నాయుడిదే.

స్త్రీకి ప్రత్యేక హక్కులు అవసరం లేదనీ, వాళ్ళు దేశస్వాతంత్ర్య పోరాటంలో పాల్గొంటే హక్కులు వాటంతట అవే వస్తాయనీ, హక్కులు ఒకరు ఇచ్చేవి, ఒకరు పుచ్చుకునేవి కావనీ ఆమె తేల్చిచెప్పారు. స్త్రీల ఓటింగ్ హక్కుకోసం ఆమె గట్టిగా పోరాడారు.

ఆంధ్రమహిళా సభలో 1945 జనవరి 17వ తేదీన ఇచ్చిన ఉపన్యాసంలో మహ్మద్‌ఖ్యాతికి ఆయన భార్య ఫాతీమా కారణమనీ, స్త్రీ శక్తి అంతటిదనీ చాటిచెప్పారు.

స్వాతంత్ర్య భారతదేశంలో ఉత్తరప్రదేశ్ గవర్నర్‌గా తన సామర్థ్యాన్ని నిరూపించారు. పొరపాటున కూడా 'హర్ ఆక్సలెన్సీ'అనే పదాన్ని వాడనియ్యక, తల్లినని, సోదరినని మనుష్యులంతా ఒక్కటేనని తన సుహృద్భావాన్ని చాటారు.

తన కుటుంబంలో అందరూ వివిధ రంగాల్లో పైకి వచ్చారు. పెద్దకూతురు పద్మజానాయుడు బెంగాల్ గవర్నరైంది. రెండో కూతురు లీలామణి కళాశాల ప్రొఫెసర్‌గానూ విదేశీ కార్యాలయంలో పనిచేశారు. పెద్ద కుమారుడు మేజర్ జయసూర్య గొప్ప డాక్టర్. హోమియో స్పెషలిస్టు. పార్లమెంటరీ సభ్యుడు. రెండో కుమారుడు శ్రీరణధీర్ కవి. ఉర్దూ, ఆంగ్ల భాషల్లో కవితలు రాశాడు. దేశభక్తుడు. 1945లో మరణించాడు. భర్త సుప్రసిద్ధ డాక్టరు. నిత్య ఖాదీధారి. భార్యాభర్తల మధ్య పరస్పర అవగాహన, ఆప్యాయతలుండేవి.

సరోజినీ నాయుడు నిరాడంబర జీవి. ప్రజలను ప్రేమించేవారు. ఆంధ్ర మహిళే కాదు, భారతీయ మహిళ. మహిళల హక్కుల కోసం పోరాడిన మహిళా ప్రతినిధి. 1949 మార్చి 2వ తేదీన మరణించారు. ఆమె ధైర్యం, సాహసం, శాంతిప్రియత్వం మహిళా లోకానికి మార్గదర్శకాలు. మహిళల్లో ఆమె ఒక మణిపూస.



## ఆమె

ఇంటివారి ఇలకరుచుకుపోయిన వదనాలు
ఇరుగు పొరుగుల ముళ్ళ లాంటి చూపులు
అంతేమరి, వేశావుగా వెధవ్వేషాలు
అనిపించే అమ్మలక్కల వ్యంగ్యాలు
ఎంతపని చేశావే అనే నిష్టూరాలు
అమ్మా నాన్నల మాటలు

పోలీసుల ప్రశ్నల్లో బాణాలు
వినిపించే ప్రతి మాటలు తలపిస్తున్నాయి తూటాలు

వేసే ప్రతి సవాలూ
మరొకసారి రేప్ చేస్తోంది

ఎక్కడెక్కడ తాకారు?
ఎన్నెన్ని సార్లు తాకారు?
ఎవరెవరు తాకారు?

అసలు నిన్నే ఎందుకు తాకారు?
నువ్వే వారిని రెచ్చ గొట్టావేమో?

బిత్తరపోయిన మనసు,
చిత్రిక పట్టిన చెక్కలా అయిన ఒళ్ళు

చీదరగా అనిపించిన అమానుషమైన రేప్ కంటే
బాధించినది, తరువాత వచ్చిన పోలీసుల తతంగమా?

ప్రశ్నల వర్షం, ప్రెస్ వాళ్ళ సెన్సేషన్ హంగామానా?
ఇరుగుపొరుగుల వాక్యాణాలా?

తప్పు నీదే, నీదే నీదే...
రుజువు చేయాలనే తపనే అందరిలోనూ!

తప్పు తనదేనేమో అనే భావన
కృంగదీసే వేదన
ఎవరికీ పట్టదు ఆమె మనసు.
ఎవరికీ పట్టదు ఆమె తనువు.
ఎవరికీ పట్టదు ఆమె వేదన.

- కాశీపట్నం సీతా వసంతలక్ష్మి

రియల్ స్టోరీ

# అమ్మా! నన్నూ ప్రేమించవూ!!

- ఎస్. జగదీశ్వరి

అది ఓ పెద్ద స్కూలు ఆవరణ. ఆవరణ అంతా చిన్న చిన్న మొక్కలతో, పద్ధతి ప్రకారం పెంచిన లాన్‌తో, అక్కడక్కడ నీడనిచ్చే పెద్ద చెట్లతో ఎటు చూసినా పచ్చదనంతో ఆహ్లాదంగా ఉంది. ఓ వైపు చిన్న ప్లే గ్రౌండ్. అందులో అరుగులు, ఊయలలు, జారుడు బండ మొదలైనవి పిల్లలు ఆడుకునేందుకు ఉన్నాయి. ఇంకొంచం సేపటిలో అక్కడ మీటింగు ప్రారంభం కానుంది అన్నదానికి నిదర్శనంగా అక్కడ ఒక చిన్న టేబుల్, దాని వెనుక రెండు కుర్చీలు వేసి ఉన్నాయి. ముందు ఎర్రటి తివాచీ వరచి ఉంది. పైన ఎండ తగులకుండా తెల్లటి షామియానా వేసి ఉంది. పచ్చదనం, ఎర్రదనం, తెల్లదనంతో కలబోసి నిండుదనంగా ఉంది అక్కడ వాతావరణం. తివాచీ మీద ఎందరో మాతృమూర్తులు కూర్చొని ఉన్నారు. వారి ఒడిలో పిల్లలు కూర్చొని ఉన్నారు. ప్రతీచోటా తానే ఉండలేని దేవుడు తనకు మారుగా తల్లిని సృష్టించాడు అన్నదానికి నిదర్శనంగా ఉన్నారు అక్కడ ఉన్న మాతృమూర్తులు.

క్రింద కూర్చొని కాగితాన్ని ముక్కలు ముక్కలుగా చేస్తున్న తన బిడ్డకు మళ్ళీ మళ్ళీ కాగితాన్ని అందిస్తున్నది ఓ తల్లి.

మెడ నిలవలేక ఒక వైపుకు వంచేస్తున్న తన బిడ్డకు తన హృదయాన్నే ఆసరాగా నిల్పిన ఓ తల్లి.

చొంగ కారుస్తున్న తన బిడ్డ నోటిని తన చీర కొంగునే కర్చీఫ్‌గా మార్చుకొని తుడుస్తున్న ఓ మాతృమూర్తి.

పెద్ద పెద్దగా అరుస్తూ, కాళ్ళు చేతులు కొట్టుకుంటున్న తన బిడ్డ నోటికి ఇష్టంగా చాక్లెట్లు అందిస్తున్న ఓతల్లి.

కర్ణుడికి కవచకుండలాలు ఉన్నట్లుగా తన బిడ్డకు రెండు చెవులకు రెండు మిషన్లు ఉంటే, వాడు వాటిని విసుగ్గా తీసి విసిరి కొడుతుంటే మళ్ళీ మళ్ళీ వాడి చెవిలో పెడుతున్న సహనశీలి ఇంకో తల్లి.

చూడడానికి ఎంతో బొద్దుగా, ముద్దుగా ఉన్నప్పటికీ ఇహలోక స్పృహ లేనట్టు ఎటో చూస్తున్న బిడ్డను జాగ్రత్తగా పట్టుకుని ఒడిలో కూర్చోబెట్టుకున్నది ఓతల్లి.

క్షణం ఓ దగ్గర నిలవక అటూ ఇటూ పరుగెడుతున్న బిడ్డ వెనుక వయస్సును మరిచి పరిగెడుతున్నది ఓ తల్లి.

ఇంత అందాలొలికే బిడ్డలకు ఇంత లోపమా? వినికిడి శక్తి పూర్తిగా లేక కేవలం సైగలతోనే జీవించవలసిన తన కన్నబిడ్డ దుస్థితికి కుంగిపోతూ బాధను బయటకు కనపడనీయకుండా నవ్వుతున్న ఎందరో మాతృమూర్తులు అక్కడ కూర్చొని ఉన్నారు.

అప్పుడే అక్కడికి స్కూల్ కరస్పాండెంట్ సుశీలగారితో పాటు సన్నగా నాజూగ్గా, అప్పుడే తోటనుండి కోసుకువచ్చిన గులాబీలా ఉన్న ఓ అమ్మాయి కూడా వచ్చింది. "నా ఆహ్వానాన్ని మన్నించి ఇక్కడికి విచ్చేసిన మాతృ మూర్తులందరికీ వందనాలు, చిన్నారు లందరికీ ఆశీర్వచనాలు" అంటూ సుశీలా మేడమ్ మీటింగు ప్రారంభించారు. "ఈ అమ్మాయి పేరు రాధ. ఈమె ఈరోజు నుండి ఈ స్కూలుకు ప్రిన్సిపల్. నేను ఏ ఆశయంతో ఈ 'సేవ' స్కూలుని స్థాపించానో మీ అందరికీ తెలుసు. నా ఆశయాన్ని నిలబెట్టి, ఈ స్కూలుని ముందుకు తీసుకువెళుతుందన్న నమ్మకంతోనే రాధగారిని మన స్కూలుకి ప్రిన్సిపల్‌గా నియమించాను. ఎం.ఎస్.సి (స్పీచ్ థెరపీ) చదివి హైదరాబాద్‌లో ఇంతకంటే మంచిచోట పనిచేసే అవకాశం వచ్చినా వదులుకుని మన స్కూల్‌లో పనిచేయటానికి సహృదయంతో వచ్చింది" అంటూ రాధని అక్కడున్న వారందరికీ పరిచయం చేసింది. కొత్తగా వచ్చినవారిని, ఇలా మీటింగు పెట్టి స్కూల్లో పనిచేస్తున్న 10 మంది టీచర్లకు, 8మంది ఆయాలకు, 150మంది విద్యార్థుల తల్లిదండ్రులకు పరిచయం చేయడం "సేవ" స్కూలు ఆనవాయితీ.

"ప్రస్తుతం విద్యార్థులంతా ఇంజనీరింగ్‌వైపు పరుగులు పెడుతుంటే నీవు ఈ కోర్స్ ఎందుకు చేశావో వీరందరికీ వివరిస్తావా!" అని సుశీలా మేడమ్ రాధని అడిగింది.

"అందరికీ నమస్కారం! నేను ఈ ప్రశ్నకు సమాధానంగా నా జీవితంలో జరిగిన సంఘటనలను కొన్ని మీముందు ఉంచుతాను మీరంతా ఓపిగ్గా వింటానంటే" అని రాధ తన ఉపన్యాసాన్ని ప్రారంభించింది. 'వింటాం' అంటూ తమ అంగీకారాన్ని కరతాళ ధ్వనుల ద్వారా తెలియజేసారు వారంతా.

నాకు 5 సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు తమ్ముడు పుట్టాడు. బంగారు బొమ్మలా, దొండపండులా ఉన్నవాడ్ని చూస్తే నాకు చాలా ఆనందం వేసింది. ఆడుకోవడానికి తోడు దొరికాడని గంతులు వేశాను. అప్పుడే ఇంట్లో అందరూ నాకు పెద్దరికాన్ని ఆపాదించారు. నువ్వు అక్కవి వాడ్ని బాగా చూసుకోవాలి అని చెప్పడం ప్రారంభించారు. కాని ఒకటిన్నర సంవత్సరం వచ్చినా వాడు అందరిలా

ఇంత అందాలొలికే బిడ్డలకు ఇంత లోపమా? వినికిడి శక్తి పూర్తిగా లేక కేవలం సైగలతోనే జీవించవలసిన తన కన్నబిడ్డ దుస్థితికి కుంగిపోతూ బాధను బయటకు కనపడనీయకుండా నవ్వుతున్న ఎందరో మాతృమూర్తులు అక్కడ కూర్చొని ఉన్నారు.

నడవలేదు, ఎదగలేదు. ఎక్కువ అల్లరి చేసేవాడు. కోపంగా చేతిలోని వస్తువులన్నీ విసిరివేస్తూ గలాటా చేసేవాడు.

ఆరోజు ఆదివారం. ఉదయాన్నే వరండాలో కూర్చుని ఎక్కాలు నేర్పిస్తూ నాకు జడ వేస్తుంది అమ్మ. పక్కనే బొమ్మలతో ఆడుకుంటున్నాడు 'రాజా'. అమ్మకి ఇష్టమైన పేరు రాజశేఖరం. ఆ పేరే తమ్ముడికి పెట్టుకుంది. అప్పుడే నాన్న కూరలు తేవటానికి స్కూటర్‌పై మార్కెట్‌కి వెళుతున్నారు. అది గమనించిన రాజా నాన్న వెనుక పరిగెత్తుకుంటూ వెళ్ళాడు. అది నాన్న గమనించలేదు. రాజా మాత్రం అలానే రోడ్డుమీదకు పరిగెత్తుకుంటూ వెళుతున్నాడు. వెనుక నుండి మేమంతా ఎంత అరుస్తున్నా వినిపించుకోలేదు. వెనుకనుండి వస్తున్న లారీ హారన్ కూడా వాడు పట్టించుకోలేదు. అప్పుడే ఎదురుగా వస్తున్న అమ్మమ్మ వాడ్ని గట్టిగా పట్టుకుంది. అప్పుడు ఇంట్లో అందరికీ వాడిపై అనుమానం వచ్చింది. వెంటనే మా ఫ్యామిలీ డాక్టరు దగ్గరకు పరుగు పరుగున వెళ్ళారు. ఆయన వెంటనే ఇ.ఎన్.టి.కి రిఫర్ చేశారు. " మీ రాజాకు పూర్తిగా రెండు చెవులు వినబడవు కాబట్టి, రెండు సంవత్సరాలైన మాటలు రాలేదు" అని ఇ.ఎన్.టి. డాక్టర్ చెప్పిన మాటలు అందరి గుండెల్లో తూటాల్లా పేలాయి. ఇలా ఎందుకు వచ్చిందో కారణం మాత్రం చెప్పలేదు. "మీ ఇంట్లో ఎవరికీ లేదన్నారు. మేనరికం కాదన్నారు. పుట్టగానే ఏడ్చాడా? జ్వరం ఏదైనా వచ్చిందా? మందులు ఏమైనా రియాక్షన్ ఇచ్చాయా?" అని రకరకాల ప్రశ్నలను డాక్టరుగారు అడిగారు. వాటన్నింటికీ సమాధానంగా అమ్మ ఏడ్వటం ప్రారంభించింది. ఈ జన్మకు వీడితో 'అమ్మ' అని పిలిపించుకోగలనా? అని ఏడ్వడం ప్రారంభించింది. ఓ వటవృక్షంలా నిలిచి నాన్న అందరికీ ధైర్యం చెప్పటం ప్రారంభించారు. దుఃఖపడడానికి ఆయనకు సమయమే లేదు. అందర్నీ ఓదార్చడంతోనే సమయం సరిపోయింది. అప్పటిదాకా ఆనందంగా ఉన్న మా ఇల్లు దుఃఖ సాగరమై పోయింది. తన దుఃఖాన్ని బయటకు రానీయకుండా ధైర్యంగా కనపడడానికి విశ్వప్రయత్నం చేస్తున్న అమ్మను చూసి నాన్న తల్లడిల్లిపోయారు. మేనరికం వద్దని, అందరిని ఎదిరించి అమ్మని వివాహం చేసుకున్నాడు నాన్న. అయనకు నేనిచ్చే బహుమానం ఇదా? అని అమ్మ బాధపడడం నాకింకా గుర్తుంది.

అప్పటి నుండి ఇంట్లో వాతావరణమే మారిపోయింది. ఎలా వీడికి మాటలు రప్పించాలి? ఎలా వీడికి వినిపించాలి? అందరి మదిలో ఇదే ప్రశ్న. 15 సంవత్సరాల క్రితం నిపుణులైన డాక్టర్ల కొరత. స్పీచ్ థెరపీ ఇచ్చే వారు లేరు. అందరు సిటీల్లోనే ఉండేవారు. తమ్ముడ్ని చెన్నై, హైదరాబాద్, బెంగుళూరు అన్ని ఊర్లు తిప్పారు. ఓ చిన్న కంపెనీలో పనిచేస్తున్న అమ్మా, నాన్నల సంపాదన అంతంత మాత్రమే. డబ్బులు మాత్రం చాలా ఖర్చు పెట్టారు. ఎన్ని సమస్యలు ఎదురైనా వాళ్ళు పట్టువదలని విక్రమార్కుల్లా తమ పోరాటాన్ని ఆపలేదు.

డాక్టరు సలహా ప్రకారం రాజాకు రెండు చెవులకు మిషన్లు పెట్టారు. మిషన్లు పెట్టుకోవాలంటే వాడికి చాలా చాలా విసుగు, చిరాకు, విసిరి కొట్టేవాడు. మిషన్లు అలవాటు చేయడమే ఓ పెద్ద యజ్ఞం. నా చెవిలో కూడా ఒక మిషను పెడితేకాని వాడు పెట్టుకునేవాడు కాదు. స్పీచ్ థెరపీ చెప్పేవారి కోసం వారు చాలా మందిని ఎంక్వైయిరీ చేశారు. దగ్గరలో ఉన్న ఓ పల్లెలో గవర్నమెంటు స్కూల్‌లో ఒక టీచర్‌కి థెరపీ ఎలా ఇవ్వాలో తెలుసు అని తెలుసుకున్నారు. ఆయన దగ్గరకు వారానికి 4 రోజులు వాడిని తీసుకుని వెళ్ళేవారు. ఇంటి నిండా శబ్దాలు చేసే రకరకాల బొమ్మలు. ఇంట్లో పెద్ద అద్దం. దాని ముందు కూర్చోపెట్టి అక్షరాలు పలికించే వారు. మనం చాలా అవలీలగా లెక్కలేకుండా ఏదేదో మాట్లాడేస్తాము. కాని 'ఆ మాటలు' రాకపోతే వాటి కోసం జీవితాన్నే ధారబోసి ప్రయత్నం చేయాలి అనేది అక్షర సత్యం.

అమ్మ లోకమే మారిపోయింది. ఎంతసేపు తమ్ముడి గోలే. అప్పటి వరకు నన్ను వదలని అమ్మ నా గురించి పట్టించుకోవడం మానేసింది. నాకు అమ్మంటే ఎంతో ఇష్టం. అమ్మ అన్నం పెడితే తినేదాన్ని, కథ చెపితే కాని నిద్రపోయేదాన్ని కాదు. కాని ఇప్పుడు నేనే తినాలి. కథలు కాదు కదా కనీసం కబుర్లు కూడా చెప్పడం లేదు. అప్పుడు అనిపించేది నాకు కూడా ఏదైనా లోపం ఉంటే ఎంత బాగుండేదని. ఎంత సేపు అమ్మ ఒడిలోనే ఉండవచ్చుఅని.

'అమ్మా! ఈ లెక్క అర్థం కాలేదు చెప్పవా?' అంటే 'నాన్నని అడుగు' అనేది. 'అమ్మా! జడవేయవా?' అంటే 'పిన్నిని అడుగు' అనేది. ఇలా ఎప్పుడూ అన్నింటికీ నన్నే సర్దుకుపొమ్మనేది. అప్పుడు నా కనుల నుండి కన్నీటి చుక్కలు రాలాయి. మొదటి సారిగా "అమ్మా! నన్నూ ప్రేమించవూ!" అని అడిగేదాన్ని. అలాగని అమ్మకు నేనంటే ప్రేమ లేదని కాదు. నేనంటే అమితమైన ఇష్టం, ప్రేమ. రోజూ రాత్రి పడుకునే ముందు అమ్మ నాకు దుప్పటి కప్పి నా నుదుటిమీద ముద్దు పెట్టి కన్నీళ్ళతో నిండిన కళ్ళను తుడుచుకోవటం నేను రోజూ చూసే అపురూప దృశ్యం. కళ్ళు తెరిస్తే ఎక్కడ అమ్మ కనుక్కుంటుందోనని కళ్ళు మూసుకునే ఆ ఆనందాన్ని అనుభవించేదాన్ని. కాని మనస్సులో ఏదో తెలియని అవ్యక్తమైన బాధ. కానీ మా అమ్మని మాత్రం నిరంతరం వదలకుండా ఉండేదాన్ని.

రాజాకి నాలుగు సంవత్సరాల వయస్సులో మామూలు స్కూల్‌లో ఎల్‌కెజిలో చేర్పించారు. మొదట వాడి సమస్య విని వారు స్కూల్లో చేర్చుకోవటానికి ఒప్పుకోలేదు. కాని అమ్మ వారిని ఒప్పించింది. కాని అక్కడ మరో సమస్య ఎదురైంది. "మీ అబ్బాయి

**15 సంవత్సరాల క్రితం నిపుణులైన డాక్టర్ల కొరత. స్పీచ్ థెరపీ ఇచ్చే వారు లేరు. అందరు సిటీల్లోనే ఉండేవారు. తమ్ముడ్ని చెన్నై, హైదరాబాద్, బెంగుళూరు అన్ని ఊర్లు తిప్పారు. ఓ చిన్న కంపెనీలో పనిచేస్తున్న అమ్మా, నాన్నల సంపాదన అంతంత మాత్రమే. డబ్బులు మాత్రం చాలా ఖర్చు పెట్టారు. ఎన్ని సమస్యలు ఎదురైనా వాళ్ళు పట్టువదలని విక్రమార్కుల్లా తమ పోరాటాన్ని ఆపలేదు.**

**ఓరోజు అమ్మకు జ్వరం వచ్చింది.**

**లంచ్‌టైమ్‌కి స్కూలుకి వెళ్ళలేకపోయింది. అప్పుడు వాడి లంచ్ బాక్స్‌లోని అన్నం కుక్క తినేసింది. అదికూడా చెప్పలేని స్థితిలో వాడు సాయంత్రం వరకూ ఉన్నాడు. వాడి నిస్సహాయత నన్ను కదిలించివేసింది.**

వల్ల పిల్లలందరూ ఇంట్లో వింతవింతగా అరుస్తున్నారని పేరెంట్స్ అంతా కంప్లైంట్ చేస్తున్నారు. అందుకని వాడిని స్కూల్‌కి పంపవద్దు" అని హెచ్.ఎం. చెబితే అమ్మ తల్లడిల్లిపోయింది. మాటలు రాని కారణంగా వాడు ఒక్కోసారి పెద్దపెద్దగా అరిచేవాడు. అమ్మ ఒకరోజు స్కూల్లో ఉండి, పిల్లలందరికీ చాక్లెట్లు కొనిచ్చి "రాజా మీలాగ మాట్లాడాలంటే మీరందరూ వాడితో మాట్లాడాలి. అంతేకానీ మీరంతా ఇంటికి వెళ్ళి వాడిలా అరవకూడదు. అలాచేస్తే మీ మేడమ్ వాడ్ని స్కూల్‌కి రానివ్వదుకదా! అని వారిని బుజ్జగించింది. మీరందరూ వాడి చెవి మిషను లాగకూడదు. వాడికి నొప్పికదా! అది లేకపోతే వాడికి వినపడదు కదా" అని వారికి అర్థమయ్యే రీతిలో చెప్పింది. పేరెంట్స్ అందరినీ అర్థించి ఒప్పించింది. ప్రతీదీ పోరాటమే వాడితో. అలుపెరుగని పోరాటం చేసింది అమ్మ వాడితో.

'అ' అన్న శబ్దం రావాలంటే 100 సార్లు పలికించాలి. మిషన్ పెట్టుకుంటే తొందరగా వస్తాయి. కొంతకాలానికి అమ్మ శ్రమ ఫలించింది. వాడు 'అమ్మ' అని మొదటిసారి పిలిచినప్పుడు మా ఇంట్లో దీపావళి పండుగ.

ఓరోజు అమ్మకు జ్వరం వచ్చింది.

లంచ్‌టైమ్‌కి స్కూలుకి వెళ్ళలేకపోయింది. అప్పుడు వాడి లంచ్ బాక్స్‌లోని అన్నం కుక్క తినేసింది. అదికూడా చెప్పలేని స్థితిలో వాడు సాయంత్రం వరకూ ఉన్నాడు. వాడి నిస్సహాయత నన్ను కదిలించివేసింది.

రాజా టివి బాగా చూస్తాడు. క్రికెట్ అంటే చాలాపిచ్చి. ఓసారి ఏడవతరగతి పరీక్షలప్పుడు క్రికెట్ ఆడితేనే చదువుతాను అని మొండికేస్తే రాత్రి 10 గంటలకు అమ్మ వాడితో క్రికెట్ ఆడింది.

అప్పుడు నాకు 10వ తరగతి పరీక్షలు జరుగుతున్నాయి. అదే సమయంలో చెన్నయ్ నుండి ఒక డాక్టర్ వచ్చాడు. 10 రోజులు ఆయన దగ్గరికి రాజాని థెరపీకి తీసుకుని వెళ్ళాలి. పక్క ఇంటి ఆంటీ దగ్గర జడవేయించుకుని పరీక్షలకు వెళ్ళేదాన్ని. ఇలా చెప్పుకుంటూపోతే హృదయాన్ని కదిలించే, కరిగించే సంఘటనలు ఎన్నో ఎన్నెన్నో. అవన్నీ మీరు ప్రస్తుతం అనుభవిస్తున్నవే.

నాది ఇంటర్ పూర్తయి బి.టెక్.లో చేరే సమయం ఆసన్నమయింది. అప్పుడు నేను ఇంజనీరింగు చదవనని మొండికేసి బిఎస్సీ (స్పీచ్ థెరపీ) చేశాను. ఇంట్లో ఎవరూ నా నిర్ణయాన్ని హర్షించలేదు. ఇటువంటి పిల్లల మధ్య నీవు వద్దు, ఇంట్లో పడే బాధలు చాలు అని అమ్మమ్మ కన్నీళ్ళు పెట్టుకుంది.

కానీ నా నిర్ణయాన్ని హర్షించిన ఒకే ఒక్క వ్యక్తి మా అమ్మ. నిపుణులైన థెరపిస్టులు లేక ఎంతో అవస్థపడింది. అమ్మ నాకు ఒకప్పుడు చెప్పిన మాటలు నా మనస్సులో చెరగని ముద్రవేశాయి. ఇలాంటి కొడుకుగా నాకు వీడు పుట్టాడు. నీకు తమ్ముడుగా, అమ్మమ్మకు మనవడుగా వీడున్నాడు. అందుకని వీడి బాధ్యత అందరిమీద ఉంది. వీడు బాగుంటే అందరం ఆనందంగా ఉండేవాళ్ళం. కాని వీడ్ని తీర్చిదిద్దడంలోనే మనం ఆనందాన్ని అనుభవించాలి. తప్పదు. నీవు పక్క ఇంట్లో అక్క తమ్ముడు ఆడుకుంటుంటే ఆశగా చూడటం నేను ఎన్నో సార్లు గమనించాను. నీవు వాడి దగ్గరికి వెళ్ళగానే వాడు నిన్ను కొట్టిన సందర్భాలు చాలా ఉన్నాయి. తల్లిగా నేను ఏమీ చేయగలను? బాధ్యతగా, ప్రేమగా తీర్చిదిద్దడం తప్ప. నా ఆశయానికి మీరంతా సహకరించాలి.

అప్పుడే నా మనస్సులో ఇటువంటి పిల్లలకు సేవ చేయాలి అన్న ఆశయం ఏర్పడింది. 'అమ్మా! నన్నూ ప్రేమించవూ!' అని మూగగా రోదించిన నాకు నా కన్నతల్లే రోల్‌మోడల్. నా తల్లి పడ్డ ఆవేదన, తపన, ఆరాటం, పోరాటం కళ్ళారా చూశాను. ఈ కోర్స్ చదివి జ్ఞానాన్ని తెచ్చుకుని నా వంతు సేవ చేయడానికి మీ ముందుకు వచ్చాను. అవయవ లోపంతో పుట్టినా, మనోబలంతో, ఆత్మస్థైర్యంతో విజేతలుగా నిలిచిన వారెందరో వున్నారు. మీరందరూ మీ పిల్లల్ని అంతటివారిగా తీర్చిదిద్దుతారని నా అభిలాష. మీ అందరికి శిరస్సువంచి పాదాభివందనం చేస్తున్నాను" అంటూ తన ఉపన్యాసాన్ని ముగించింది రాధ.

అక్కడ ఉన్నవారందరూ అశ్రునయనాలతో రాధని మనస్ఫూర్తిగా దీవించారు. వారందర్నీ ప్రేమించే తల్లి దొరికిందని ఆనందపడ్డారు.

**అవయవాల లోపంతో పుట్టినా, అద్భుత విజయాలను సాధించిన ఎందరో మహానుభావులకు నా ఈ చిన్నకథ అంకితం.**

## మరో ప్రపంచం

తెల్ల కాగితం పాప మానసం
బిందు రూపమై చేరె భావనం
మంచి భావనం, మనో చేతనం
బాగు బాగని తెలిపె నింగితం
సాగిపొమ్మని పలికె సమ్మతం
మంచి భావనల్ చేరె నో క్రమం
రోజు రోజుకూ ఎదిగె నా క్రమం
క్రమ క్రమంగా నిండె కాగితం – పాప మానసం
పరిమళించెను పాప వర్తనం
పొంగి పొరలుతూ ఆయె తరంగం
మనసు మనసునూ తట్టె తరంగం
కలసి కట్టుగా ఆయె సాగరం – భావజాల సాగరం!
ధాత్రినంతనూ ముంచె సాగరం – భావజాల సాగరం!
కొత్త కొత్తగా పుట్టె ప్రపంచం
మరోప్రపంచం, మంచి ప్రపంచం

డా॥ డి.ఎల్.వి.

సాహస బాల



# మలాలా!

## విజేతగా వర్ధిల్లాలి

- వేములపల్లి సత్యవతి.

డిశంబర్ 2011లో అక్టోబర్ 11వ తేదీన అంతర్జాతీయ బాలికల దినోత్సవంగా జరపాలని ఐక్య రాజ్య సమితి నిర్ణయించింది. 2012 అక్టోబర్ 11వ తేదీన ప్రపంచ దేశాలన్నీ బాలికల దినోత్సవంగా జరపాలని పిలుపునిచ్చింది. అంతర్జాతీయంగా అన్ని దేశాల లోని బాలికలు సాంఘిక దురాచారాలకు గురవుతున్నారని అధ్యయనాల ద్వారా గుర్తించి ఈ నిర్ణయం తీసుకోవటం జరిగింది.

9-11-2012న పాకిస్థాన్‌లోని సాహస బాలిక (మైనర్) మలాలాపై తాలిబన్లు కాల్పులు జరిపారు. రెండు తూటాలు ఆ బాలిక శరీరంలో నుండి దూసుకుపోయాయి. ఒక తూటా వెన్నెముక సమీపంలో దిగబడింది. పెషావర్‌లోని పాకిస్థాన్ సైనిక ఆసుపత్రిలో శస్త్ర చికిత్స చేసి తొలగించారు. రెండవ తూటా కనుబొమ్మ వద్ద బాగా లోతుకు దిగబడింది. మలాలాకు వైద్యం చేయటానికి బ్రిటన్ ముందుకొచ్చింది. బర్మింగ్‌హామ్‌లోని క్వీన్ ఎలిజిబెత్ ఆసుపత్రిలో మెరుగైన వైద్య చికిత్స మొదలయింది. శ్వాస నాళానికి శస్త్ర చికిత్స జరిగింది. కనుబొమ్మ వద్ద బుల్లెట్ దిగబడిన మార్గంలో (ఇన్) ఉందని అదే ఆందోళనగా ఉందని ఆమెకు శస్త్ర చికిత్స చేసిన డాక్టర్ రోజర్ అన్నారు. ఎంత సమయం పట్టేది ఇప్పుడే చెప్పలేమని తప్పక విజయవంతమవుతుందని ఆశిస్తున్నామని అన్నారు. మలాలాకు మద్దతుగా హిందువులు, ముస్లింలు, సిక్కులు 200 మంది దాకా సమావేశమయ్యారు. మహిళా హక్కుల కార్యకర్తలు, కౌన్సిలర్లు, మత గురువులు కూడా దానిలో పాల్గొని ప్రసంగించారు. సాహస బాలిక పూర్తిపేరు మలాలా యూసఫ్‌జాయ్. 2009 నుంచి తాలిబన్ల వలన ఎదుర్కొంటున్న సంఘటనలను ఏరోజుకారోజు తన ఫేస్‌బుక్‌లో రాసుకునేది 'గుల్‌మకాయ్' పేరుతో రాయటం మొదలుపెట్టింది. ఈ సంగతి తాలిబన్లకు తెలిసింది. రాయటం మానమని, బడికి వెళ్ళవద్దని హెచ్చరించారు. చదువుకోవాలన్న ఆకాంక్ష ఉన్న మలాలా వారి హెచ్చరికలను పెడచెవిన పెట్టింది. వాటిని ఖండించింది. బడికి వెళ్ళడం మానలేదు. ఒకరోజు స్కూలు బస్సులో ఉన్న మలాలాపై ఆ ముష్కరులు కాల్పులు జరిపారు. సాహస బాలిక మలాలాను ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి 'బాన్‌కీమూన్' చదువుకోసం పోరాడిన మలాలాను ప్రపంచంలోని బాలికలందరి విద్యాహక్కుకు ప్రతినిధిగా నిలిచిందని కొనియాడారు. ఆమె గౌరవార్థం నవంబర్ 10వ తేదీన 'మలాలాడే'గా ప్రకటించారు.

మలాలా కుటుంబానికి, మీడియాకు, యాంకర్లకు ప్రత్యేక రక్షణ కల్పిస్తామని పాకిస్థాన్ ప్రభుత్వం తెలిపింది. ఆ దేశంలో ఇవ్వబడే అత్యున్నత సాహస పురస్కారం "సతారే సుజత్" ఈ సంవత్సరం మలాలాకు ఇవ్వబడుతుందని పాకిస్థాన్ ప్రకటించింది. మలాలాపై కాల్పులకు తెగబడిన తాలిబన్ ఇహసానుల్లాపై 10 కోట్లు రివార్డు ప్రకటించింది. 2012వ సంవత్సరంలోనే ప్రసిద్ధ ముస్లిం మహిళా గాయనిని బ్యూటీపార్లర్ నుండి తిరిగి వస్తున్నప్పుడు తాలిబన్లు కాల్చి చంపారు. ఇస్లాంకు సంగీతం వ్యతిరేకమని చెప్పారు. తాలిబన్లను మొదట పెంచి పోషించి, పెద్ద చేసింది అమెరికా. భారత్‌కు వ్యతిరేకంగా పాకిస్థాన్ అందులో భాగస్వామి అయింది. భస్మాసుర హస్తంలాగ తాలిబన్లు 9/11న అమెరికా భవనంపై విమానదాడి చేసి వేలాది మందిని బలి తీసుకున్నారు. పాకిస్థాన్‌లో తాలిబన్లు సవాలుగా నిలిచి ప్రపంచానికే ముప్పు తెచ్చేవారుగా తయారయ్యారు. వారి దురాగతాలను భూస్థాపితం చేయటానికి లక్షలకొలది మలాలాలు తయారు కావాలి. ఆసుపత్రి నుండి డిశ్చార్జి అయి వచ్చిన మలాలా మరింత తేజోవంతంగా బాలికా విద్య కోసం పోరాడతానని ప్రకటించింది.

ఆడపిల్లల చదువు కోసం ఉద్యమించాలి. ఆధునిక ప్రపంచాన్ని పాత కాలపు భావాలవైపు తీసుకుపోతున్న చీకటి శక్తులను తరిమివేయాలి. 'విద్య' అనే వెలుగుపూలు పూయించాలి.

సూర్యాస్తమయం సమయం. అరణ్యం ఒక పక్క ఎర్రని కాంతితో, మరోపక్క కమ్ముకొస్తున్న చీకట్లతో నల్లని పొగలూదుతూ మండిస్తున్న ఎర్రని కొలిమిలా ఉంది. పక్షులు గుంపులు గుంపులుగా గూళ్ళకు చేరుతున్నాయి. వాటి అరుపులతో వనమంతా సందడిగా ఉంది. లేళ్ళ గుంపులు పగటి బద్ధకాన్ని వదిలించుకుని హుషారుగా వెన్నెల విహారానికి సిద్ధమవుతున్నాయి. ఆ దట్టమైన అరణ్యంలో అతి ప్రశాంతంగా, ముచ్చటగా, ప్రతిభావంతుడైన చిత్రకారుని సృష్టిలా ఉంది ముని ఆశ్రమం.

ఆశ్రమంలో సాయం సంధ్యా కార్యక్రమాలు మొదలయ్యాయి. అగ్నిహోత్రాలు వెలుగుతున్నాయి. గంభీర మంత్రనాదాలు మధురంగా వినపడుతున్నాయి. మునికాంతలు ఫలపుష్ప తరువులకు నీళ్ళుపోసి సేదదీరుతున్నారు. కొందరు దైవ పూజకోసం మాలలల్లుతున్నారు. పిల్లలు అరణ్య సంచారం చేసి తిరిగివచ్చి తమకోసం ఆతృతగా ఎదురు చూస్తున్న తల్లుల కౌగిళ్ళలో చిక్కుబడి ఉన్నారు. కొందరు తల్లులు పిల్లలను సాయం సమయ అనుస్టానాల కోసం త్వరపెడుతున్నారు. అక్కడ ఒక చిన్న కుటీరంలో ఒక తల్లి అరణ్య సంచారం నుంచి ఇంకా తిరిగిరాని తన పిల్లల కోసం ఎదురుచూస్తూ నిల్చుంది.

ఆ పిల్లల మీదనే ఆమె ప్రాణాలన్నీ పెట్టి బతుకుతున్నట్లు ఆమె కళ్ళవంక చూస్తే అర్థమవుతుంది. ఆ కళ్ళలో ఆతృత, ఆర్తి. దయ కురిపించే ఆమె కళ్ళ నిండుగా భయం చోటుచేసుకుంది.

ఆ తల్లి పేరు సీత.

తన ఇద్దరు కుమారుల కోసం ఎదురు చూస్తోంది.

రోజూ ఈ సమయానికి ఇద్దరూ అరణ్యం నుంచి తిరిగి వచ్చేవారు. వస్తూ వస్తూ ఏవో అడవిపూలు తెచ్చేవారు. వాటిని




-ఓల్గా

దేవతార్చనకు ఉపయోగించమని తల్లిని బతిమాలేవారు. పేరు తెలియని పూలతో పూజ చేయనని సీత అనేది. వాళ్ళిద్దరూ కలిసి ఆ పూలకు చిత్రవిచిత్రమైన పేర్లు పెట్టేవారు. సీత నవ్వుతుంటే వారు అలిగేవారు. సీత వాళ్ళిద్దరినీ బుజ్జగించి ఆ పూలతో పూజచేసి వాళ్ళను సంతోషపెట్టేది. చీకటి చిక్కబడే వేళకు బాలకులిద్దరూ కంఠమెత్తి పాడుతుంటే వనమంతా పరవశించి వింటుంది.

ఆ లవకుశులు ఇంకా తిరిగి రాలేదు. సీత మనసు ప్రమాదాన్ని శంకించటం లేదు. లవకుశులకు అడవి కొట్టిన పిండి. వాళ్ళు అక్కడే పుట్టారు. అక్కడే పెరిగారు. వాళ్ళు అరణ్య పుత్రులు. కానీ ఆలస్యానికి కారణమేమిటి? అది తెలియకే భయ సందేహాలు. లవకుశులు అయోధ్య వెళ్ళివచ్చిన నాటినుంచీ సీత మనసులో పిల్లల గురించి అంతకు ముందు లేని ఆందోళన చోటుచేసుకుంది. ఏదో తెలియని అలజడి మనసులో. ఇప్పుడూ అదే అలజడి. అరణ్యం గురించి కాదు నగరం గురించే- క్రమంగా చీకట్లు దట్టమయ్యాయి. సీత కళ్ళే దీపాల్లా వెలుగుతున్నాయి.

లవకుశులకు అడవి కొట్టిన పిండి. వాళ్ళు అక్కడే పుట్టారు. అక్కడే పెరిగారు. వాళ్ళు అరణ్య పుత్రులు. కానీ ఆలస్యానికి కారణమేమిటి? అది తెలియకే భయ సందేహాలు. లవకుశులు అయోధ్య వెళ్ళివచ్చిన నాటినుంచీ సీత మనసులో పిల్లల గురించి అంతకు ముందు లేని ఆందోళన చోటుచేసుకుంది. ఏదో తెలియని అలజడి మనసులో. ఇప్పుడూ అదే అలజడి. అరణ్యం గురించి కాదు నగరం గురించే-

ఇంతలో ఆ దీపాల కాంతిలో ఇద్దరు బాలకులు వచ్చి చేరారు. సీత ఒక్క నిట్టూర్పు విడిచి ఇంత ఆలస్యమయిందేమని ప్రశ్నించింది. లవుడు "అమ్మా ఇటుచూడు" అంటూ తన పైకండువాలో కట్టుకొచ్చిన పూలను పళ్ళెంలో పోశాడు. క్షణంలో పర్ణశాల మున్నెన్నడూ ఎరుగని సుగంధంతో నిండిపోయింది.

పూలు. ఎర్రని, తెల్లని, పచ్చని పూలు పళ్ళెం నిండా నవ్వుతున్నాయి. అవి ఎన్నడూ చూడని పూలు. ఆ పరిమళం పూర్వం ఎరుగనిది. కుశలవులిద్దరూ తాము సాధించిన ఆ పుష్ప విజయానికి గర్విస్తున్నట్టు తల్లివైపు చూశారు.

"ఎక్కడివిరా ఈ పూలు. ఎంత బాగున్నాయి" అంది సీత వాటిని వేళ్ళతో సున్నితంగా స్పృశిస్తూ.

"అమ్మా ఇవాళ అడవిలో ఒక కొత్త ఉద్యానవనం కనుగొన్నాము. అలాంటి ఉద్యానవనం ఎక్కడా చూడలేదు. వాల్మీకి తాతయ్య వర్ణించే నందనవనం కూడా దీనిముందు దిగదుడుపే" అన్నాడు కుశుడు. లవుడు అన్నమాటను సమర్థిస్తున్నట్లు కళ్ళతోనే ఆమోదాన్ని తెలిపాడు.

"ఎవరి ఉద్యానవనం అది కుశా" అడిగింది సీత.

"అమ్మా ఆ ఉద్యానవనం ఎంత సుందరమో దాని యజమాని రూపమంత వికారం. మేం పూలు కోసుకుంటూ ఉంటే ఆమె వచ్చింది. మేం భయపడ్డాం. అన్నయ్య ఎలాగో ధైర్యం తెచ్చుకుని 'మేం ముని బాలకులం. పూజకు పూలు కోసుకున్నాం' అని చెప్పాడు. మేం వడివడిగా వచ్చేశాం. అబ్బా ఆ రూపం పరమ వికారం. ఒట్టి కురూపి" వెగటుగా చెప్పాడు లవుడు.

"తప్పు నాయనా. మనుషుల ఆకారాలను చూసి వారిని అసహ్యించు

కోరాడు. ఆమె కురూపి అయినా ఎంతో మంచి పూలతోట పెంచింది కదా" అంది సీత.

"ఆమె మనిషంతా బాగానే ఉందమ్మా. కానీ ముక్కూ చెవులూ లేవు. ఎవరో కోసినట్టు అక్కడంతా పెద్దలొట్ట" కుశుడు ముఖం చిట్లించుకున్నాడు.

సీతకు ఒక్కసారి తన వీపుమీద ఎవరో కొరడా ఝుళిపించినట్లయింది.

"ముక్కూ చెవులూ లేవా?"

"లేకపోవటమంటే-ఒకప్పుడు ఉండేవేమో. ఎవరో కోసేశారు. అలా అనిపించింది కదన్నయ్యా" కుశుని సాక్ష్యం కోరాడు లవుడు.

సీతకిప్పుడు నిశ్చయమే.

ఆమె శూర్పణఖ. తప్పకుండా శూర్పణఖే.

పద్దెమిదేళ్ళనాటి మాట. రాముడిని వలచి వచ్చింది. ఎంత అందమైన మనిషో. రామలక్ష్మణుల క్రూరమైన పరిహాసానికి పాపం కురూపియైపోయింది. ఇప్పుడా శూర్పణఖ ఈ అరణ్యంలోనే ఉందా? ఎంత కాలం గడిచింది!

శూర్పణఖను రాముడు అవమానిస్తే రావణుడు తననపహరించి రాముడి మీద ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నాడు.

పురుషుల పగలూ ప్రతీకారాలూ తీర్చుకోవటానికేనా స్త్రీలుంది?

రావణుడి చెల్లెలని తెలియకపోతే రామలక్ష్మణులు శూర్పణఖనట్లా చేసేవారు కాదు. రావణుని రెచ్చగొట్టాలనే రాముడి అభిమతం, అతనితో కయ్యానికి కారణం కోసం వెతుకుతున్న రాముడి అన్వేషణ శూర్పణఖ వల్ల నెరవేరింది.

అదంతా రాజకీయం.

పాపం శూర్పణఖ ప్రేమ ప్రేమ అంటూ పలవరిస్తూ వచ్చింది. ముక్కూ చెవులూ లేని ఆ కురూపిని ఇంకెవరు ప్రేమిస్తారు?

**పురుషుల పగలూ ప్రతీకారాలూ తీర్చుకోవటానికేనా స్త్రీలుంది?**

**రావణుడి చెల్లెలని తెలియకపోతే రామలక్ష్మణులు శూర్పణఖనట్లా చేసేవారు కాదు. రావణుని రెచ్చగొట్టాలనే రాముడి అభిమతం, అతనితో కయ్యానికి కారణం కోసం వెతుకుతున్న రాముడి అన్వేషణ శూర్పణఖ వల్ల నెరవేరింది.**

జీవితమంతా ప్రేమ రాహిత్యంలోనే గడిపిందా?

తనలోని ప్రేమనంతా రంగరించి ఆ పూలతోట పెంచిందా?

తన సౌందర్య కాంక్షకు ఫలంగా ఉద్యానవనాన్ని రూపుదిద్దిందా?

ఆమె హృదయ సౌకుమార్య ప్రతిఫలాలా ఈ పూలు.

పాపం శూర్పణఖ.

సీత కళ్ళల్లో నీళ్ళు చూసి లవకుశులు ఆశ్చర్యపోయారు.

"ఏంటమ్మా ఇది. ఎవరి అనాకారితనం గురించో విన్నంత మాత్రాన ఇంత బాధపడతావెందుకమ్మా".

సీత కళ్ళు తుడుచుకుని చిన్నగా నవ్వి-" రేపు నన్ను ఆ ఉద్యానవనానికి తీసుకెళ్తారా"? అనడిగింది.

లవకుశులు నమ్మలేనట్లు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"నిజంగా నేను మీతో వస్తాను. తీసుకెళ్తారా? ఆ మార్గం గుర్తుందా?"

సీత మాటలకు అన్నదమ్ముల సంబరం నింగినంటింది.

అమ్మ తమతో అరణ్య విహారానికి వస్తుందంటే వాళ్ళ మనసులు ఉప్పొంగిపోయాయి. తమకు సుపరిచితమైన అరణ్య ప్రాంతాలన్నీ తల్లికి చూపించాలని ఇద్దరికీ కుతూహలం. కానీ సీత ఎన్నడూ రాదు. ఎప్పుడన్నా వెళ్ళినా తోటి మునికాంతలతో కలిసే. అమ్మ చేతులు పట్టుకుని ఆ దుర్గమారణ్యంలో సంచరిస్తామనీ, అమ్మ భయపడకుండా ధైర్యం చెబుదామనీ, వింతలన్నీ చూపుదామనీ అనుకుంటే ఆ చిన్నారులకు ఉత్సాహం ఆగటంలేదు.

ఆ రాత్రి ఎప్పుడు తెల్లారుతుందో గదా అనుకున్నారు.

ఆ రాత్రి సీతకు కూడా భారంగానే గడిచింది. గత కాలపు జ్ఞాపకాలు ఎంత తోసివేసినా ముందుకొచ్చి నిల్చున్నాయి.

రాముడితో ఆనందంగా గడిపిన ఆ అరణ్యవాసపురోజులు.

శూర్పణఖ రాక- ఎంత మనోహరంగా నడిచి వచ్చిందో. తలలో తెల్లని మల్లెపూలు. మెడలో పచ్చగన్నేరు పూలహారాలు. చేతులకు నీలాంబరాల మాలలు. ఒక కదిలే పూలతీగలా వచ్చింది. తన ఆభరణాల వంక చిత్రంగా చూసింది.

పరిమళంలేని,సౌకుమార్యం లేని ఆ బరువులెందుకు మోస్తున్నావన్నట్లే చూసింది. తనను చూడటమేగాని మాటలు లేవు. సరాసరి రాముడి దగ్గరకు వెళ్ళింది. తను వీళ్ళ మాటల మీద ధ్యాస ఉంచే ఏదో పని చేసుకుంటోంది. కొద్దిసేపు గడిచేసరికి

**శూర్పణఖ రాక- ఎంత మనోహరంగా నడిచి వచ్చిందో. తలలో తెల్లని మల్లెపూలు. మెడలో పచ్చగన్నేరు పూలహారాలు. చేతులకు నీలాంబరాల మాలలు. ఒక కదిలే పూలతీగలా వచ్చింది. తన ఆభరణాల వంక చిత్రంగా చూసింది.**

**పరిమళంలేని,సౌకుమార్యం లేని ఆ బరువులెందుకు మోస్తున్నావన్నట్లే చూసింది. తనను చూడటమేగాని మాటలు లేవు. సరాసరి రాముడి దగ్గరకు వెళ్ళింది. తను వీళ్ళ మాటల మీద ధ్యాస ఉంచే ఏదో పని చేసుకుంటోంది. కొద్దిసేపు గడిచేసరికి ఆశ్రమంలో రక్తపాతం.**

ఆశ్రమంలో రక్తపాతం.

ఒక స్త్రీ హృదయ విదారక రోదన.

ఎంత శపించిందో ఆ చర్యకు.

ఆ శాపం ఇంకా తనను వీడినట్లు లేదు.

ఆమెను ఏ పురుషుడూ ప్రేమించడు.

తనను ప్రేమించే పురుషుడు తనను దూరం చేశాడు.

ఇద్దరి కథలూ చివరికి ఒకటేనా?

తనను చూసి శూర్పణఖ ఏమంటుంది?

తన మీద కోపంతో మాట్లాడదేమో- అయినా చూడాలి. శూర్పణఖను చూడాలి.

+ + +

మర్నాడు ఉదయం పనులన్నీ పూర్తయ్యాక సీతను వెంటబెట్టుకుని లవకుశులిద్దరూ బయలుదేరారు.

"అమ్మా ఇవాళ నీకు నా రాజాని చూపుతాను" అన్నాడు లవుడు.

అరణ్యంలో స్వేచ్ఛగా తిరిగే మత్తగజం లవుడికి వశమైంది.

దానిపైనెక్కి అన్నదమ్ములిద్దరూ విహరిస్తారు.

" అమ్మా నువ్వు రాజాను ఎక్కవా?" మురిపెంగా అడిగాడు లవుడు.

"ఒద్దమ్మా నాకు నడవటమే ఇష్టం" అంది సీత. పట్టపుటేనుగుపై ఊరేగిన రోజులను తలుచుకుంటూ.

సీతకు ఏనుగంటే భయమనుకున్నారు అన్నదమ్ములు.

"పాపం అమ్మకు ఏనుగెక్కటం ఎలా వస్తుంది? భయం కూడా'' లవుడిని కోప్పడ్డాడు కుశుడు.

తమకు అడవిలో మాలిమి అయిన జంతుజాలాన్నంతా తల్లికి పరిచయం చేస్తూ నడిపించారు.

పిల్లల మాటలతో మార్గాయాసమే తెలియలేదు సీతకు.

" ఇదేనమ్మా ఆ ఉద్యానవనం".

సీత నిలబడిపోయింది. ప్రకృతి మధురహాసంలాంటి ఆతోటను చూస్తే సీత నోటమాట రాలేదు. అశోకవనం దీనిముందు దిగదుడుపే.

''ధన్యురాలివి శూర్పణఖా'' అనుకుంది.

"రామ్మా లోపలికి వెళ్దాం"అంటున్న పిల్లలతో-

"నేను ఒక్కదాన్నే వెళ్తాను. మీరు సాయంత్రం వరకూ అరణ్య విహారం చేసిరండి. కలిసి ఆశ్రమానికి వెళ్దాం.

దూరంగా ఒక స్త్రీ కనిపించింది. ఆమె ముఖం అటువైపు తిరిగి ఉన్నా, ఆకారాన్ని చూసి ఆమె శూర్పణఖే అయి ఉంటుందనుకుంది సీత.

దగ్గరగా వెళ్ళి "శూర్పణఖా" అని మెత్తగా పిలిచింది.

శూర్పణఖ వెనుదిరిగి చూసింది. ఆమె సీతను గుర్తుపట్టలేదు.

"ఎవరమ్మా నువ్వు? దోవ తప్పి వచ్చావా? నా పేరెలా తెలును?'' అనడిగింది.

"దోవ తప్పలేదు శూర్పణఖా-దోవ వెతుక్కుంటూ వచ్చాను. నేను సీతను".

శూర్పణఖకు నోట మాట రాలేదు.

సీత. ఈమె సీత. ఎంత మారిపోయింది!

ఒంటినిండా నగలతో భారంగా ఉండే సీతే తనకు తెలుసు. అదీ ఎక్కువసేపు చూడనేలేదు.

రావణుడ్ని సంహరించి ఆర్య సామ్రాజ్యాన్ని దక్షిణాపథమంతా విస్తరించిన సర్వంసహా చక్రవర్తి శ్రీరామచంద్రుడి పట్టమహిషి సీత ఈమెనా?

శూర్పణఖ నమ్మలేకపోతోంది.

ఈ నారచీరెలేమిటి? ఈ పూలదండల నగలేమిటి?

ఎండకు కంది కమిలిన ఆ బంగారు ఛాయ ఏమిటి?

ఈమె సీతా! శ్రీరాముడి భార్య సీతేనా?

"సీతా-అంటే శ్రీరామచంద్రుని-"

శూర్పణఖను మధ్యలోనే ఆపేసి

''నేను జనకుని కుమార్తెను. జానకిని. భూపుత్రిని" అంది అభిమానంతో.

"మరి శ్రీరాముడు" శూర్పణఖకంతా అయోమయంగా ఉంది.

"శ్రీరాముడు నన్ను పరిత్యజించాడు. ప్రస్తుతం వాల్మీకి ఆశ్రమంలో ఉంటున్నాను".

శూర్పణఖకు నోట మాట రాలేదు. శ్రీరాముడు సీతను పరిత్యజించటమా- సీతారాముల ప్రేమ ఆమెకు తెలిసినంత బాగా మరెవరికీ తెలియదు. దానికి ఆమె చెల్లించిన మూల్యం తక్కువది కాదు.

శ్రీరాముని ప్రేమించిన స్త్రీలకు వేదన తప్పదా?

సీత ముఖంలో శూర్పణఖకు శాంతగంభీరతలు తప్ప వేదనా ఛాయలు కనిపించలేదు.

సీత చాలా ఎదిగింది అనుకుంది శూర్పణఖ.

''నిన్న మా పిల్లలు మీ ఉద్యానవనం చూశారు. నిన్నూ చూశారు. ఇవాళ వాళ్ళే నన్నిక్కడికి తీసుకొచ్చారు. నీ తోట ఎంతో అందంగా, హాయిగా ఉంది" చిరునవ్వుతో చెప్పింద సీత.

" ఆ చిన్నారులు నీ కుమారులా. ఎంత ముచ్చటగా ఉన్నారో''అంది శూర్పణఖ.

సీత ముఖంలో ఓ క్షణం చిన్న గర్వం కదలాడి మాయమైంది. అది శూర్పణఖ దృష్టిని దాటిపోలేదు.

" ఈ తోటలో మొక్కలూ, లతలూ, తరువులూ అన్నీ నా బిడ్డలే'' అంది శూర్పణఖ.

''ఔను, అందుకే అంత మనోహరంగా ఉన్నాయి" ఒప్పుకుంది సీత.

శూర్పణఖ కళ్ళల్లో గర్వం గర్వంగా

**"చాల కష్టమే అయింది. సౌందర్యానికి అసలు అర్థం కనుక్కోవటం చాలా కష్టమే అయింది. అమిత సౌందర్యగర్వితను. నా ముక్కు చూసుకుని నేనెంత మురిసిపోయేదాన్నో నీకు తెలియదు. మీ ఆర్యుల నిడుపాటి ముక్కులు నాకు విచిత్రంగా తోస్తాయి. విచిత్రంలో కూడా ఒక సౌందర్యం లేకపోలేదు. నా ముక్కు పొడవూకాదు, అలాగని చప్పిడిదీకాదు. ముక్కు ఎలా ఉండాలని ఆ ఈశ్వరుడు సృష్టి ప్రారంభంలో తలిచాడో అటువంటి ముక్కు నాదని నాకెంతో గర్వం. పచ్చని, తెల్లని గడ్డిపూలని నా ముక్కుకి ఆభరణాలుగా ధరించేదాన్ని. ముక్కు పుటాలకటూ ఇటూ నక్షత్రాల్లా మెరిసేవవి. నా ప్రియులు నా ముక్కుని సున్నితంగా చుంబిస్తే నాకెంతో పులకింత.**

వచ్చి నిల్చింది.

" చెప్పు శూర్పణఖా- నీ జీవితం ఎలా ఉంది?"

" ఈ వనమంత అందంగా, ఆనందంగా ఉంది".

" నాకు సంతోషంగా ఉంది శూర్పణఖా. నీకు జరిగిన అవమానానికి నువ్వు ఏమైపోతావో అనుకున్నాను. నీ సౌందర్యకాంక్ష నాకు తెలును. నీ కురూపితనాన్ని నువ్వు భరించగలవా? భరించలేక ఏ అఘాయిత్యం చేసుకున్నావోనని నీవు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా బాధపడేదాన్ని".

తన వంక చూసిన సీత కళ్ళల్లో దయకూ, ప్రేమకూ కరిగిపోయింది శూర్పణఖ.

వారిద్దరి హృదయాలలో స్నేహభావం అంకురించి వారి శరీరాలు పులకించాయి.

"నువ్వు ధైర్యసాహసాలు గలదానివి" అంది సీత.

మనస్ఫూర్తిగా సీత అన్న ఆ మాట శూర్పణఖ మనసులో ఉద్వేగాన్ని నింపింది.తన జీవిత గమనాన్ని సీతకు చెప్పాలనే స్నేహార్తి హృదయంలో మొలకెత్తింది.

"నన్నిప్పుడు ఇలా చూసి ఇదంతా తేలికగా జరిగిందనుకోకు సీతా. జీవితాన్ని ఎదుర్కోవటంలోనే రాటుదేలాను. అందానికి అర్థం తెలుసుకోవటంలోనే ఆనందాన్ని పొందగలిగాను.

కురూపినైన తొలిరోజులలో బతుకు దుర్భరంగానే ఉండేది.

నా రూపం నాకే అసహ్యమనిపించేది. నన్ను నేను ద్వేషించుకునేదాన్ని. ప్రాణాలు తీసుకుందామని ప్రయత్నించిన రోజులూ ఉన్నాయి.

నాకు సౌందర్యం కావాలి. ప్రేమ కావాలి. ఆ రెండూ లేకుండా నేను బ్రతకలేను అలాంటి నేను కురూపినయ్యాను.

నా రూపం చూసి పురుషులు, నేను మోహించిన అందమైన పురుషులు నన్ను అసహ్యించుకునేవారు.

ఇక ఎందుకీ బతుకు అనుకున్నాను. ఆ రోజులు నరకప్రాయంగా ఉండేవి. నా మనసు నిత్యం బాధతో కోపంతో రగులుతుండేది. శ్రీరాముడినీ, అతని తమ్ముడినీ, నిన్నూ ఎంత శపించానో. విషం కురిపించాను మీమీద. నా మనసులో ప్రేమలేశమైనా లేకుండా ద్వేషమే పీఠం వేసుకుని కూచుంది. అందాన్ని ప్రేమించే నేను అందమైన ప్రతీదాన్నీ ద్వేషించటం మొదలుపెట్టాను. నా సౌందర్య కాంక్ష సౌందర్యవతులపై అసూయగా మారింది.

నేనొక నడిచే అగ్నిపర్వతాన్నయ్యాను, ఎగసిపడే దుఃఖ సముద్రాన్నయ్యాను".

బాధామయమైన శూర్పణఖ జ్ఞాపకాలతో ఇద్దరి మనసులూ బరువెక్కాయి.

" అంత బాధనుండి ఎలా బయటపడ్డావు శూర్పణఖా".

"చాల కష్టమే అయింది. సౌందర్యానికి అసలు అర్థం కనుక్కోవటం చాలా కష్టమే అయింది. అమిత సౌందర్యగర్వితను. నా ముక్కు చూసుకుని నేనెంత మురిసిపోయేదాన్నో నీకు తెలియదు. మీ ఆర్యుల నిడుపాటి ముక్కులు నాకు విచిత్రంగా తోస్తాయి. విచిత్రంలో కూడా ఒక సౌందర్యం లేకపోలేదు. నా ముక్కు పొడవూకాదు, అలాగని చప్పిడిదీకాదు. ముక్కు ఎలా ఉండాలని ఆ ఈశ్వరుడు సృష్టి ప్రారంభంలో తలిచాడో అటువంటి ముక్కు నాదని నాకెంతో గర్వం. పచ్చని, తెల్లని గడ్డిపూలని నా ముక్కుకి ఆభరణాలుగా ధరించేదాన్ని. ముక్కు పుటాలకటూ ఇటూ నక్షత్రాల్లా మెరిసేవవి. నా ప్రియులు నా ముక్కుని సున్నితంగా చుంబిస్తే నాకెంతో పులకింత.

ఆ ముక్కుని కోల్పోవడమంటే ఏమిటో నాకు తప్ప మరెవరికీ అర్థం కాదు. దాన్నంతా భరించాను. విరూపంవల్ల వచ్చిన వికృతమైన ఆలోచనల భారాన్నంతా మోశాను. ఒక్కోసారి అందరినీ అన్నిటినీ రూపహీనం చేయాలనిపించేది.

ఆ కసి నుంచి బైటపడటానికీ, మళ్ళీ సౌందర్యాన్ని ప్రేమించటానికీ రూప, అరూపాల అసలు సారాంశాన్ని కనుగొనటానికీ నాతో నేను యుద్ధమే చేయాల్సివచ్చింది.

ఆ యుద్ధంలో నాకు సహకరించినది ఈ అనంత ప్రకృతి.

ప్రకృతికి రూప, కురూప అనే తేడాలేదని గ్రహించటానికి చాలా కష్టపడ్డాను. అనేక ప్రాణులను గమనించాను. స్తబ్ధత, చలనంలలోని ఏక రూపతను గమనించాను. రంగుల రహస్యాలు కనుగొన్నాను, ఈ విషయంలో నాకు గురువెవరూ లేరు. నాకు నేను సాధన చేశాను. ప్రకృతిలోని ప్రతి అణువునూ శోధించాను. ఆ శోధనలో నాకళ్ళే

మారిపోయాయి. నాకంటికి ప్రతిదీ అందంగానే కన్పించింది. నాతోసహా ప్రతిదాన్నీ అసహ్యించుకునే నేను నాతో సహా ప్రతిదాన్నీ ప్రేమించసాగాను.

తోటి పక్షులు ఏదో కారణాల పొడిచి పొడిచి ఈకలు పీకిన చిన్న పక్షి నాలో కలిగించిన స్పందన ఎంత ప్రేమభరితమో అంత సౌందర్య పూరితమని గ్రహించటానికీ, ఆ స్పందనను పట్టుకుని అర్థం చేసుకోటానికీ నేను చేసిన సాధన అసామాన్యమైనది.

క్రమంగా నా చేతులను ప్రేమించటం నేర్చుకున్నాను. ఆ చేతులతో సృష్టించటం, శ్రమించటం, సేవించటం నేర్చుకున్నాను. ఇదంతా జరగటానికి పది సంవత్సరాల పైనే పట్టింది. పది సంవత్సరాల కఠోర దీక్ష, శ్రమ ఫలించాక ఈ తోటను పెంచటం మొదలుపెట్టాను".

తన జీవన యాన సత్య సౌందర్యాన్ని సీతముందు పరిచింది.

"నువ్వెంత అందంగా ఉన్నావు శూర్పణఖా. నీ అందాన్ని ఏ పురుషుడూ గ్రహించలేకపోవచ్చు కానీ"

సీత కంఠం రుద్ధమైంది.

తన అగ్నిపరీక్ష కంటే శూర్పణఖ గురైన పరీక్ష తక్కువది కాదు అనుకోగానే సీత కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి.

శూర్పణఖ హాయిగా అందంగా ఆనందంగా నవ్వింది.

"పురుషులకు మాత్రం కళ్ళుండవా? మనసుండదా? కురూపులను చేయటం, వారిని అసహ్యించుకోవటం మాత్రమే తెలిసిన పురుషుల గురించి కాదు".

"అంటే"– సీత ఆగినా ఆమె అభిప్రాయం తెలిసింది.

"నీ ఊహ నిజమే సీతా. నాకొక పురుషుని సాహచర్యం దొరికింది. నా చేతుల్లోంచి ప్రకృతిలోకి ప్రవహించే సౌందర్యాన్ని కొద్దిసేపు తనది చేసుకుని, తనను నాకర్పించుకునే అదృష్టవంతుడు ఉన్నాడు" అంటూ శూర్పణఖ గొంతెత్తి

**ప్రకృతికి రూప, కురూప అనే తేడాలేదని గ్రహించటానికి చాలా కష్టపడ్డాను. అనేక ప్రాణులను గమనించాను. స్తబ్ధత, చలనంలలోని ఏక రూపతను గమనించాను. రంగుల రహస్యాలు కనుగొన్నాను, ఈ విషయంలో నాకు గురువెవరూ లేరు. నాకు నేను సాధన చేశాను. ప్రకృతిలోని ప్రతి అణువునూ శోధించాను. ఆ శోధనలో నాకళ్ళే మారిపోయాయి. నాకంటికి ప్రతిదీ అందంగానే కన్పించింది. నాతోసహా ప్రతిదాన్నీ అసహ్యించుకునే నేను నాతో సహా ప్రతిదాన్నీ ప్రేమించసాగాను.**

సుధీరా అని పిల్చింది.

సార్థక నామధేయుడైన ఒక దృఢకాయుడు అక్కడికి వచ్చాడు.

" ఈమె సీత"

సుధీరుడు గౌరవంగా నమస్కరించాడు.

" సీతకు నిన్ను చూపాలనే పిల్చాను".

ఆ మాటలతో సుధీరుడు వెనుదిరిగి వెళ్ళిపోయాడు. ఆ చిన్న చర్యతో ఇంతవరకూ ఏ స్త్రీ పురుషుల మధ్యా తను చూడని బంధమేదో వీరిమధ్య ఉన్నట్లనిపించింది సీతకు.

" నీ జీవితాన్ని సఫలం చేసుకున్నావన్నమాట".

"సాఫల్యానికి అర్థం పురుషుని సాహచర్యంలో లేదని గ్రహించాను. అది తెలిశాకే నాకీ పురుష సాహచర్యం కలిగింది".

సీత శూర్పణఖ మాటలు శ్రద్ధగా వింటోంది. ఏదో వివేకం, గాంభీర్యం ఆమె మాటల్లో. మరీ మరీ వినబుద్ధేస్తుంది.

"సీతా – నువ్వు".

"కుమారుల పెంపకంలో నా జీవితం సార్థకమవుతోంది".

" అదే నీ జీవితాదర్శమా?"

"ఔను. నేను రాముని పత్నిని. పట్టమహిషిగా నా బాధ్యతలు నెరవేర్చలేకపోయాను. రామరాజ్యానికి వారసులనైనా అందించాలిగా".

" ఎన్నడూ రాజ్యంలో లేకపోయినా రాజ్యం నీ జీవితం రాజ్యంతో ఎలా ముడిపడిపోయిందో కదా సీతా".

"రాజపత్నినయ్యాక తప్పదు గదా" నవ్వింది సీత.

"ఎందుకో నాకు మొదటినుంచీ రాజ్యమంటే భయం. నా అన్న ఎంత చెప్పినా లంకా నగరంలో ఉండేదాన్నికాదు. అరణ్య విహారంలోని హాయి మరింకెక్కడా దొరకదు".

"నాకూ అరణ్యవాసమే ప్రియం. రాముడు పరిత్యజించినా ఈ వనవాసం నా క్లేశాన్ని తగ్గించింది".

వారి మాటల్లో సమయం తెలియకుండాపోయింది.

"నా బిడ్డలకు వారు శ్రీరాముని తనయులని తెలియదు. నేను చెప్పలేదు. సమయం వచ్చినప్పుడు తెలుస్తుంది".

" తెలిశాక వారిక అరణ్యంలో క్షణమైనా ఉంటారా?"

శూర్పణఖ సీతవంక జాలిగా చూసింది.

"వారికి అరణ్యవాసమే ఇష్టమే" బలహీనంగా అంది సీత.

"వారికి ఇష్టం కావొచ్చు. కానీ రాజ్యానికి అరణ్యమంటే ఏం ప్రేమ? నగరాల అభివృద్ధి కోసం, నాగరీకుల రక్షణ కోసం అరణ్యమృత్రులు తరలిపోక తప్పదేమో".

తప్పదని సీతకూ తెలుసు.

**"తప్పక వస్తాను శూర్పణఖా. నా బిడ్డలు నన్నొదిలి నగరానికి వెళ్ళాక నేను భూపుత్రికనవుతాను. ఈ చల్లని తరువుల నీడన సేదదీరుతూ జీవితానికో కొత్త అర్థం కల్పించుకుంటాను".**

"అప్పుడేం చేస్తావు. ఒక్కతివి వాల్మీకి ఆశ్రమంలోనే ఉండిపోతావా?"

"లేదు శూర్పణఖా. నా తల్లి భూదేవి ఆశ్రయం పొందుతాను.

"నీ తల్లి ఎక్కడ లేదని సీతా-అయితే నీ తల్లికి ఇంతకంటే సుందర రూపం మరెక్కడా లేదని నా ఉద్దేశ్యం".

గర్వంగా తోటంతా కలయజూసింది శూర్పణఖ.

శూర్పణఖ ఉద్దేశం అర్థమైనట్లు నవ్వింది సీత. ఆ అయాచిత ఆదరణకు సీత మనసు ఉప్పొంగింది. సహోదరి భావం మనసంతా నిండింది.

"తప్పక వస్తాను శూర్పణఖా. నా బిడ్డలు నన్నొదిలి నగరానికి వెళ్ళాక నేను భూపుత్రికనవుతాను. ఈ చల్లని తరువుల నీడన సేదదీరుతూ జీవితానికో కొత్త అర్థం కల్పించుకుంటాను".

పిల్లలు రావటంతో వారి సంభాషణ ఆగింది.

శూర్పణఖ వారికి మధురఫలాలను అందించింది. వాళ్ళు ఆప్యాయంగా ఆరగించారు.

"ఎవరమ్మా ఆవిడ" మార్గమధ్యంలో తల్లిని అడిగారు.

"నాకు కావలసిన మనిషి నాయనా. ఎంతో ఆప్తురాలు".

"మరి మాకెప్పుడూ చెప్పలేదేమమ్మా".

"సమయం వచ్చినప్పుడు అన్నీ తెలుస్తాయి. కానీ అరణ్యంలో ఈ ఉద్యానవనానికి త్రోవ మాత్రం ఎన్నడూ మర్చిపోకండి. మీరు ఎక్కడికి వెళ్ళినా. ఏం చేసినా ఈ త్రోవమాత్రం మర్చిపోకండి. మర్చిపోరు కదూ".

"మర్చిపోమమ్మా" తల్లికి మాట ఇచ్చారు లవకుశులు.

**(ఓల్గా రచన 'విముక్త' నుండి..)**

# ఆరోగ్యం

– డా॥ రమాదేవి

**ప్ర: సర్వైకల్ క్యాన్సర్‌ను గుర్తించడానికి ముందు కన్పించే లక్షణాలేమిటి?**

**జ:** సర్వైకల్ క్యాన్సర్‌కి సాధారణంగా ముందే లక్షణాలు కనిపించవు. సర్వైకల్ క్యాన్సర్ రావటానికి చాలా సంవత్సరాల ముందే గర్భాశయ ముఖద్వారం చుట్టూ ఉన్న కణాలలో మార్పు కనిపిస్తుంది. అయితే ఈ మార్పును కేవలం చుట్టూ ఉన్న స్రవాలను తీసి మైక్రోస్కోపులో పరిశీలించటం ద్వారా మాత్రమే తెలుసుకోగలం. దానినే పాప్‌స్మియర్ లేదా సర్వేకల్ స్మియర్ అంటారు. 30 సంవత్సరాలు దాటిన స్త్రీలు సంవత్సరానికి ఒకసారి ఈ పరీక్ష చేయించుకుంటే సరిపోతుంది. మూడు సంవత్సరాలు నెగిటివ్ రిపోర్టు వస్తే తర్వాత 5 సంవత్సరాల కొకసారి చేయించుకుంటే సరిపోతుంది. ఇది చాలా సింపుల్ పరీక్ష.

ఒక చిన్న ఐస్‌క్రీమ్ పుల్ల లాంటిదానితో ఈ సర్విక్స్ చుట్టూ ఉన్న స్రావాలను తీసి మైక్రోస్కోపుకింద పరీక్ష చేస్తారు. దీనిద్వారా క్యాన్సర్ రాకముందే కనిపెట్టి ట్రీట్‌మెంట్ తీసుకుంటే పూర్తిగా నివారించడానికి వీలవుతుంది.

**ప్ర: డెంగ్యు, చికెన్‌గున్యా లాంటి వ్యాధులు కాకుండా తీసుకోవాల్సిన జాగ్రత్తలు తెలుపగలరు?**

**జ:** డెంగ్యు, చికెన్‌గున్యా రెండూ జబ్బులూ దోమలు కుట్టడం ద్వారా వస్తాయి. మలేరియా దోమలు రాత్రిళ్ళు కుడితే, ఈ దోమలు పగలు కుట్టడం ద్వారా ఇవి వస్తాయి. ముఖ్యంగా కుండీలు, టైర్లు, నీళ్ళ ట్యాంకులు లాంటి వాటిలో నీళ్ళు నిలువ ఉంటే ఈ దోమలు వ్యాపిస్తాయి. అందువలన వ్యక్తిగతంగా దోమలు కుట్టకుండా దోమతెరలు కట్టుకోవడం లాంటి జాగ్రత్తలు పాటించాలి. నీళ్ళు ఎక్కువ నిలువ లేకుండా చూడాలి. అపార్టుమెంట్లు, లేదా కాలనీలో ఉన్న వాళ్ళంతా కలసి ఒక రోజు 'డ్రైడే' పాటించాలి.

**ప్ర: స్త్రీలకు మోకాళ్ళు, నడుము నొప్పి రావటానికి కారణాలు, తీసుకోవాల్సిన జాగ్రత్తలు?**

**జ:** స్త్రీలు తమ గురించి పట్టించుకోకపోవటం వలన చాలామందికి ఈ కీళ్ళనొప్పులు, నడుము నొప్పులు వస్తున్నాయి. స్త్రీలు ముఖ్యంగా పౌష్టికాహారాన్ని అంటే ఐరన్, కాల్షియం పుష్కలంగా ఉండే ఆహారాన్ని తీసుకోవాలి. ఆడపిల్లలు టీనేజ్‌లో చదువులు, సన్నగా ఉండాలనే కోరికతో సరైన ఆహారం తీసుకోకపోవటం, వ్యాయామం లేకపోవడం చూస్తున్నాము. పెళ్ళయిన తరువాత వారి శరీరం కాన్పులు, నెలసరిలాంటివాటి వలన మరింత బలహీనపడుతుంది. తమ గురించి శ్రద్ధ తీసుకోకపోవటంతో పోషక విలువలు చూడకుండా మంచి ఆహారం భర్త, పిల్లలకు పెట్టి మిగిలింది తినటం, మెనోపాజ్ వయస్సులో బరువు పెరగటం, పనిభారంతో మెకాళ్ళు, నడుములు నొప్పులు రావటం జరుగుతుంది. అలా కాకుండా ఉండాలంటే

**తీసుకోవాల్సిన జాగ్రత్తలు:**

1. చక్కని పోషక విలువలున్న ఆహారాన్ని తీసుకోవటం, ముఖ్యంగా మాంసం, కోడిగుడ్లు, పాలు, పెరుగు, ఆకుకూరలు చిన్నప్పటి నుంచే ఆడపిల్లలు తినాలి.

2. బరువును అదుపులో ఉంచుకోవాలి. మోడల్‌గా సన్నగా ఉండాలని కాకుండా ఆరోగ్యమంతమైన బరువు (టోన్డ్ బాడీ) ఉండాలి. ఎక్కువ బరువు ఉంటే మోకాళ్ళపైన ఉన్న శరీర బరువుకు నాలుగురెట్లు బరువు మోకాళ్ళమీద పడటంద్వారా కీళ్ళు తొందరగా అరిగిపోతాయి.

3. ఆహారం ద్వారా తీసుకున్న కాల్షియం ఎముకలకి అందాలంటే ప్రతిరోజూ 30 నుండి 40 నిమిషాలపాటు వ్యాయామం తప్పనిసరి. ప్రతిరోజూ ఉదయం నడక తమ జీవితంలో భాగంగా చేసుకోవాలి. ఇవన్నీ మాకెలా సాధ్యం అంటే నొప్పులతో బాధపడక తప్పదు.



**Dr. Satyanarayana. Jonna** MD, RD.,
Consultant Radiologist
Ex. Registrar Apollo Hospital, Chennai
Satyam in Diagnostic






**Ln. Jonna Lakshmi Narayana** B.Sc., B.L.,
Executive Director,
9849167486, 9533395333

Jonna's



Ultimate In Diagnostic Care

# Satyam Diagnostics

**Advanced Imaging & Research Centre (MRI & CT)**

Opp: Ganga, Gouri Cine Complex, Anantapur - 515 001

☎ : 08554 - 279177, 278133

e-mail : satyamdiagnostics@gmail.com

( A UNIT OF SRI SATYA SAI CT SCAN & DIAGNOSTICS PVT. LTD.)

**Round the clock Emergency Diagnostics MRI & CT**

**ULTIMATE IN DIAGNOSTIC CARE**

# పోటీ

- డా॥ డి.ఎల్.విద్య

ఆకాశం మూసుక్కూర్చుంది. ఏ క్షణాన్నయినా వాన పడేలా ఉంది. రమణ రెండు బస్సులు మారి ఇంటికి వెళ్ళాలి. ఉద్యోగం పని అయిపోగానే అతనికి ఎంత తొందరగా ఇల్లాల్నీ, ఇంటినీ, పిల్లల్ని చూసుకోవాలనే ఆతృతే ప్రతిరోజూ. బస్‌లో ఉన్నంతసేపూ చల్లని గాలి వీస్తూనే ఉంది. దిగేసరికి ఓ జల్లు కురిసి చల్లగా..హాయిగా తడిపేసింది రమణని. రెండో బస్సు దొరికే లోపల. ఆ బస్ దిగాక...చూస్తే అక్కడ వర్షపు ఛాయలే లేవు. ఇంటివైపు నడిచాడు. గేటు పట్టుకుని అక్కడే నిలబడిపోయాడు. మరోజల్లు తడిపేసి ఆహ్లాదంతో ముంచెత్తింది అతన్ని. సుమతోపాటు ఓ అరడజను మంది పిల్లలు కేకలేస్తూ పరిగెడుతున్నారు. ఒకర్నొకరు పట్టుకుని పకపక నవ్వుతున్నారు. ఆ నవ్వుల పువ్వుల జల్లులో తడిసిపోయాడు రమణ.

సుమ తన ఇద్దరు పిల్లల్ని ఎప్పుడూ ఆడిస్తూ, కబుర్లు కథలూ చెప్తూ పిల్లల్లో పిల్లయిపోయి తిరుగుతూ ఉంటుంది ఎప్పుడూ ఇంట్లో. పిల్లలు పుట్టకముందు చేసే ఉద్యోగం మానేసి, పిల్లల పెంపకం అనే ఉద్యోగంలో పడింది పిల్లలు పుట్టాక. వాళ్ళు బడికెళ్ళి వస్తుంటే వాళ్ళ చదువుల పోటీలు .....రోజూ ఆటలు లేకపోయినా....ఎప్పుడో జరిగే ఆటలపోటీలు, పాటల్తో, కథల్తో ఉల్లాసంగా పాఠాలు జరగకపోయినా అమావాస్యకో, పున్నానికో జరిగే పాటల పోటీలు..........అన్నీ పోటీలే... అన్నీ ఒకసారి వాళ్ళనందలం ఎక్కించి, మరోసారి వాళ్ళ లేత మనసుల్ని దారుణంగా గాయపరిచేవే, ఏదీ వాళ్ళకి ఆనందాన్ని కలిగించటం లేదని గ్రహించింది. స్కూల్లో, టీచరు ఉద్యోగంలో చేరిపోవాలనిపిస్తూ ఉంటుంది సుమకి. బోర్లా పడుతూ, పాకుతూ మొదటిసారి తమ కాళ్ళపై తాము నిలబడి సంభ్రమంగా నవ్వుతూ, తప్పటడుగులు వేస్తూ, ఆ విద్యల్లో తమ విజయోత్సాహాన్ని చూపిస్తున్నారనిపించేది సుమకి తమ పిల్లల బాల్య చేష్టలు చూస్తూ ఉంటే. ఏ చదువు చదువుకున్నా ఎంత చదువుకున్నా బాల్య చేష్టలంత సహజమైన ఆనందాన్నిచ్చేలా ఉండాలి చదువు. విషయాల్ని ఆత్రంగా నేర్చుకుంటూ ఉండడమే జీవన తత్వం, జీవితానందం, అదే అసలైన చదువు అనిపిస్తూ ఉంటుంది. పోటీ లేకపోతే అసలు నేర్చుకోవడమే ఉండదు. అని ఎవరైనా అంటే సుమ అసలు ఒప్పుకోదు. ఏమీ తెలియని, అన్నీ తెలుసుకోవాలని కుతూహలపడే ఈ పసిపిల్లలకి పోటీల, ఓటముల చేదు రుచులు చూపించకుండా, చదువుని ఓ సహజ కాంక్షగా తీర్చిదిద్దే టీచరు అవాలనుకుంటూ ఉంటుంది సుమ. బడి చదువులు తమకిస్తున్న అసంతృప్తినీ, ఆవేదనని, ముద్దు ముద్దుగా తమ భాషలో పిల్లలు చెప్పుకుంటూ ఉంటే అర్థం చేసుకున్న సుమ.. ఇదిగో ...ఇలా పిల్లలందర్నీ చేరదీసి పోటీలేని ఆటలతో వాళ్ళని ఆనందంతో గెంతులేయిస్తోంది. టీచరు ఉద్యోగం ఎప్పుడు వస్తుందో తెలియదు గానీ, విద్యార్థి దశలో పరుగుల రాణి అయిన సుమ, ఇప్పుడు పిల్లలతో కలిసి పరుగులు తీస్తోంది. మట్టి వాసనల్ని, సుమ సౌరభాల్ని మోసుకెళ్ళే, వాన చెలి పిల్లగాలిలా.



ఆ రోజు సుమ, రమణల పెళ్ళి రోజు, ఎన్నోరోజుల ముందే రెండు వేల రూపాయలు సుమ చేతికిచ్చేడు రమణ. అందమైన పట్టుచీర కొనుక్కోమని. స్నానం చేసి వచ్చిన సుమ పాత చీరలోనే స్వచ్ఛంగా, శుభ్రంగా, స్ఫటికంలా ఉంది. కొనుక్కున్న చీర ముందు చూపించకుండానే కట్టుకుని చూపిస్తుందని ఆశగా ఉన్నాడు రమణ. "కొత్త చీర కట్టుకోలేదేం?" అడిగేడు రమణ ఆశ్చర్యంగా. ఆ మాటకు చెప్పుకొచ్చింది సుమ.

'నువ్వే కదా గంగని ఎంత మంచి మనసో ఈ పిల్లది!' అన్నావు అని మొదలెట్టింది వృత్తాంతం అంతా.

గంగ ఇంటర్మీడియట్ వరకు చదువుకుంది. చిన్న పిల్లగా ఉన్నప్పట్నుంచి వాళ్ళమ్మతోపాటు వచ్చి వీళ్ళింట్లో పనిచేసేది. గంగ పన్లోకొచ్చి పేపరు తిరగేసి కేరింతలు కొట్టడం ప్రారంభించింది. రేపు దుమ్మా అని ప్రకటించేసింది. నగరంలోని ప్రముఖ బట్టల షాపు వాళ్ళు అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా ముగ్గుల పోటీ నిర్వహిస్తున్నారు. గంగ ఆ పోటీలో పాల్గొనాలనుకుంటుంది. అదీ సంగతి! పిల్లలూ...చదువులు... ఆటలూ పోటీలు వీటితో విసిగిపోయి ఓ స్థిర నిర్ణయానికి వచ్చిన సుమ ముగ్గుల పోటీని గంగ నోటంట విని సహజంగానే విసుక్కుంది. అయినా పిల్ల సరదా పడుతోందికదా అని ప్రోత్సహించింది. ఇంటర్‌నెట్ సెంటర్‌కి వెళ్ళి అంతర్జాతీయ మహిళా దినోత్సవం గురించి బ్రౌజ్ చేసి చదివి, ఉద్వేగానికి లోనయ్యింది. తర్వాత రెండురోజులకి ముగ్గుల పోటీలో తను గెలుచుకున్న ఆకుపచ్చ పట్టుచీర పట్టుకొచ్చి సంబరంగా చూపించింది సుమకి గంగ. పేపర్లో కూడా వేశారు గంగ కలెక్టరు నుంచి బహుమతి తీసుకుంటున్న దృశ్యాన్ని కలెక్టరు గారి ప్రసంగాన్ని.

కలక్టరు గారి ప్రసంగానికి అంతర్జాతీయ మహిళా దినోత్సవ చరిత్రకి ఏమీ సంబంధం లేదు. అంతర్జాతీయ మహిళా దినోత్సవాన్ని ఓ ఉద్యమ స్ఫూర్తితో జరుపుకోవాలి గాని, ఇలా ఉత్సవంలాగా జరుపుకోవడం! మనసంతా చిరాకు చిరాకుగా తయారయింది సుమకి. గంగ ఆనందానికి తను కూడా ప్రతిస్పందించినా, ఈ చిరాకు వేరు మరి. మహిళల సమస్యలన్నీ

తరువాయి భాగం 42వ పేజీలో

ఏ చదువు చదువుకున్నా ఎంత చదువుకున్నా బాల్య చేష్టలంత సహజమైన ఆనందాన్నిచ్చేలా ఉండాలి చదువు. విషయాల్ని ఆత్రంగా నేర్చుకుంటూ ఉండడమే జీవన తత్వం, జీవితానందం, అదే అసలైన చదువు అనిపిస్తూ ఉంటుంది. పోటీ లేకపోతే అసలు నేర్చుకోవడమే ఉండదు. అని ఎవరైనా అంటే సుమ అసలు ఒప్పుకోదు. ఏమీ తెలియని, అన్నీ తెలుసుకోవాలని కుతూహలపడే ఈ పసిపిల్లలకి పోటీల, ఓటముల చేదు రుచులు చూపించకుండా, చదువుని ఓ సహజ కాంక్షగా తీర్చిదిద్దే టీచరు అవాలనుకుంటూ ఉంటుంది సుమ.

# రొమ్ము క్యాన్సర్ - చికిత్స

## (ఫిబ్రవరి 4 ప్రపంచ క్యాన్సర్ దినం సందర్భంగా..)

- డా॥ కె. భారతీ సాగర్

శరీరంలో అన్ని భాగాలలో వచ్చేలాగానే వక్షోజాలలో కూడా క్యాన్సర్ వస్తుంది. మహిళల్లో వచ్చే క్యాన్సర్‌లలో ఇదే ప్రథమ స్థానంలో ఉంది. అభివృద్ధి చెందుతున్న మరియు అభివృద్ధి చెందిన దేశాలన్నింటిలో కూడా ఈ క్యాన్సర్ అధిక సంఖ్యలో మహిళలను కబళిస్తోంది. పెరుగుతున్న పట్టణీకరణ మరియు పాశ్చాత్య దేశాల జీవన శైలిని అలవరుచుకోవటం అనే రెండు కారణాలు ఈ క్యాన్సర్ సోకటానికి ప్రధాన కారణాలుగా ఉన్నాయి.

మహిళల్లో వచ్చే అన్ని క్యాన్సర్లలో ఇది 16 శాతం స్థానాన్ని ఆక్రమిస్తోంది. ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనా ప్రకారం ప్రపంచ వ్యాప్తంగా 2004వ సంవత్సరంలో 5,19,000మంది స్త్రీలు వక్షోజ క్యాన్సర్ మూలంగా మరణించారు.

వక్షోజ క్యాన్సర్ రావటానికి కుటుంబంలో వక్షోజ క్యాన్సర్ చరిత్ర ఉండటం, అధిక కాలం శరీరంలో ఈస్ట్రోజన్ హార్మోన్ స్థాయిలు అధికంగా ఉండటం. తొందరగా అంటే చిన్న వయస్సులోనే రజస్వల కావటం, లేటుగా నెలసరులు ఆగటం(మెనోపాజ్), లేటు వయసులో మొదటి సంతానాన్ని కనటం మొదలగునవి, ప్రాథమిక రిస్కు కారణాలుగా నిర్ధారణ జరిగింది. ఇవేగాకుండా ఎక్కువ రోజులపాటు గర్భ నిరోధక మాత్రలు వాడటం, మెనోపాజ్‌లో వచ్చే సమస్యల కొరకు వాడే హార్మోన్ రిప్లేస్‌మెంట్ చికిత్స ద్వారా కూడా వక్షోజ క్యాన్సర్ వస్తోందని గమనించటమైనది.

పైన చెప్పిన ప్రత్యుత్పత్తి కారణాలే కాకుండా మద్యపానం, అధిక బరువు ఉండటం, శారీరక వ్యాయామం లేకపోవటం వంటివి కూడా వక్షోజ క్యాన్సర్‌కి, దాని ద్వారా వచ్చే మరణాలకు కారణాలుగా ఉన్నాయి.

**వ్యాధి లక్షణాలు:-** సాధారణంగా ఈ క్యాన్సర్ గడ్డలు ఎడమ వైపు వక్షోజంలో వస్తాయి. వక్షోజాల పై భాగంలో వెలుపలి వైపు వస్తాయి. తొంభై శాతం క్షీర వాహికలలో వస్తాయి. మొదటగా చంకలలో గడ్డలుగా కూడా రావచ్చు లేదా వక్షోజాలలో గడ్డగా గానీ, వక్షోజాలు మందంగా అవటం గాని ఉండవచ్చు. ఇవే కాకుండా చనుమొనలు లోపలికి ముడుచుకోవటం, వాటి నుంచి స్రావాలు కారటం, రాష్‌లాగా ఏర్పడటం మొదలగునవి ఉండవచ్చు. వక్షోజాలలో నిరంతరం నొప్పిగా గాని లేదా నొక్కినప్పుడు నొప్పిగా కానీ

### కేన్సర్ రోగులకు ఉపశమనం ఈ పరికరం

కేన్సర్ బాధితుల శరీరాల్లో పేరుకుపోయే హానికారక స్రావాలు వారి ఆరోగ్యాన్ని మరింతగా పాడుచేస్తాయి. ఈ నేపథ్యంలో ఒంట్లోంచి కేన్సర్ స్రావాలను బయటికి పంపించి ఆ ముప్పు నుంచి తప్పించే ఇంప్లాంట్‌ను బ్రిటన్ శాస్త్రజ్ఞులు తొలిసారి ఒక అండాశయ కేన్సర్ బాధితురాలికి అమర్చారు. 63ఏళ్ళ ఆ మహిళ లండన్‌లోని హామర్‌స్మిత్ ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నారు. ప్రపంచంలో ఈ ఇంప్లాంట్‌ను అమర్చుకున్న తొలి వ్యక్తి ఆమే. కేన్సర్ కణాలు 'ఆసూటెజ్' అనే స్రావాల్ని విడుదల చేస్తాయి. ఆ స్రావం శరీరంలో క్రమేపీ పేరుకుపోతుంటుంది. ఆ స్రావాలను తొలగించుకునేందుకు బాధితులు తరచుగా ఆస్పత్రికి వెళ్తుండాలి. అదే, ఈ పరికరాన్ని అమర్చుకుంటే కేన్సర్ స్రావాలు మూత్రం ద్వారా బయటికి పోయేలా చేస్తుంది. సాధారణంగా, అండాశయ కేన్సర్‌తో బాధపడుతున్న మహిళల్లో మూడువంతులమంది పొత్తికడుపు భాగంలో పేరుకునే కేన్సర్ స్రావాలతో ఇబ్బంది పడతారు. ఉదాహరణకు.. ఈ ఇంప్లాంట్‌ను అమర్చుకున్న బామ్మగారినే తీసుకుంటే ఆవిడ ప్రతి మూడు వారాలకొకసారి ఆస్పత్రికి వెళ్లి 5 లీటర్ల స్రావాలను తొలగించుకోవాల్సి వచ్చేది. పేగు, క్లోమం, గర్భాశయం, రొమ్ము కేన్సర్ బాధితుల్లో కూడా ఈ స్రావాల సమస్య ఉంటుంది. కాగా అల్ఫా పంప్‌గా పేర్కొంటున్న ఈ కొత్త పరికరం స్రావాలను బయటికి పంపించడమే కాదు, అండాశయ కేన్సర్ ఏ స్థితిలో ఉందో ఎప్పటికప్పుడు పర్యవేక్షిస్తూ ఆ సమాచారాన్ని వైద్యులకు చేరవేస్తుందట. దీనివల్ల బయాప్సీ అవసరం ఉండదని వైద్యులు వివరిస్తున్నారు. గతంలో ఈ పంపును కాలేయ జబ్బులతో బాధపడేవారికి అమర్చేవారు. ఒవేరియన్ కేన్సర్ యాక్షన్ రిసెర్చ్ సెంటర్ విభాగాధిపతి ప్రొఫెసర్ హానీ గబ్రా ఈ పరిశోధనకు నేతృత్వం వహించారు.

ఉండవచ్చు. వక్షోజాల చర్మంపైన ఎర్రని రాషెస్ కానీ గుంతలు పడటం లేదా సన్నని రంధ్రాలుగా ఏర్పడడం కాని ఉంటుంది. ఎప్పటి నుంచో ఉన్న గడ్డలు కూడా క్యాన్సర్‌గా మారవచ్చు. చీము గడ్డ అంటే బయాటిక్ చికిత్స తరువాత కూడా అలాగే ఉండటం. మెనోపాజ్ వచ్చిన స్త్రీలలో ఒకే వక్షోజంలో నిరంతరం నొప్పి వస్తుండటం, వక్షోజాలలో ఎడతెగని నొప్పి వస్తు ఉండి, నొప్పి మందులు మరియు ఇతరత్రా ప్రిమ్‌రోస్ ఆయిల్ లాంటివి వేసుకున్నా కూడా నొప్పి తగ్గకపోవటం లాంటి లక్షణాలుంటాయి.

**నివారణ మరియు నియంత్రణ:-** ఈ క్యాన్సర్ నియంత్రణలో నివారణ ప్రధాన పాత్రవహిస్తుంది. ఎక్కువ కాలం పిల్లలకి స్తన్యం ఇవ్వటం వక్షోజ క్యాన్సర్‌కి నివారణగా పనిచేస్తుంది. అధిక కాలం ఈస్ట్రోజెన్ ఆధారిత గర్భ నిరోధక గోళీలు వాడటం, హార్మోన్ రిప్లేస్‌మెంట్ మందులు జాగ్రత్తగా వైద్యుల పర్యవేక్షణలో అవసరమైనంతకాలం మాత్రమే వాడవలసి ఉంటుంది. అలాగే సంతులితమైన పోషకాహారాన్ని తీసుకోవాలి. చురుకైన జీవన శైలిని అలవాటు చేసుకోవాలి. మద్యపానం చేయకూడదు. అధిక బరువును తగ్గించుకోవాలి.

ఇవే కాకుండా స్క్రీనింగ్ ప్రోగ్రామ్స్ వలన కూడా వక్షోజ క్యాన్సర్‌ని ప్రభావవంతంగా నివారించవచ్చు. ఈ క్యాన్సర్ ద్వారా వచ్చే మరణాలను నివారించవచ్చు. ముఖ్యంగా దిగువ తరగతి మధ్య తరగతి వర్గాలలో ఈ కార్యక్రమాల ద్వారా ఎక్కువ శాతం వ్యాధి నివారణ సాధ్యపడుతుంది. వ్యాధి నిర్ధారణ ప్రారంభ దశలో చేయుటం అనేది ఈ వ్యాధి నియంత్రణలో కీలకమైన భాగము.

ఈ వ్యాధికి గురయ్యే వర్గాలలో వ్యాధి ప్రారంభ లక్షణాల గురించి ప్రచారం చేయటం మరియు ప్రారంభ లక్షణాలున్నపుడే వ్యాధిని నిర్ధారించటం ప్రధాన అంశం.

**పరీక్షలు:**

1 **మామోగ్రఫీ:-** రెండు వక్షోజాల మామోగ్రఫీ చేయుటం. అయితే ఈ పరీక్షతోపాటు అల్ట్రాసౌండ్ పరీక్ష కూడా కలిపి చేస్తే ఎక్కువ ప్రభావవంతంగా ఉంటుంది.

2. FNA సైటాలజీ లేదా బయాప్సీ, అల్ట్రా సౌండ్ పరీక్ష నిర్దేశంతో వక్షోజాల నుంచి కణజాలాన్ని తీసి హిస్టో పెథాలజీ పరీక్షలు చేయటం.

3. ఈస్ట్రోజన్ మరియు ప్రొజెస్టరాన్ రిసెప్టార్లను ఇమ్యూనో సైటో కెమిస్ట్రీ పద్ధతిలో నిర్ధారించటం.

4. HER2 వంటి బయలాజికల్ మార్కర్స్ పరీక్ష వ్యాధి నిర్ధారణకు చికిత్సని నిర్దేశించటానికి ఉపయోగపడుతుంది.

**చికిత్స:-** క్యాన్సర్ కణితి యొక్క సంఖ్య, పరిమాణం, హిస్టలాజికల్‌గా పాజిటివ్‌గా ఉన్న చంకలలోని లింఫ్ నోడ్ల సంఖ్య, కణితి గ్రేడు వీటి మీద ఆధారపడి వ్యాధి నివారణని అంచనా వేయవచ్చు. దీనినే NPI (Nottingham Prognostic Index) అంటారు. ఇది 3.41 కన్నా తక్కువగాఉంటే ఆ వ్యక్తిలో చికిత్సా ఫలితం బావుంటుందని చెప్పవచ్చు.

వక్షోజ క్యాన్సర్ ఇతర చోట్లకు పాకకుండా ఉన్నప్పుడు సింథల్ మాస్టెక్టమీ (వక్షోజాలను తొలగించే) చికిత్స ఉపయుక్తంగా ఉంటుంది. క్యాన్సర్ కణితి చిన్నదిగా ఉండి ఇతర ప్రదేశాలకు వ్యాపించకుండా ఉన్నప్పుడు, పెద్ద గాటు ద్వారా ఆ కణితిని తొలగించి, వక్షోజాలకి రేడియో థెరపీ ఇవ్వటం ద్వారా చికిత్స చేయవచ్చు. అట్లాగే ఇలాంటి కేసుల్లో కూడా టామోక్సిఫెన్ లాంటి ఔషధాలతో కీమోథెరపీ కూడా ఇవ్వవచ్చు. ప్రస్తుతం వ్యాధి ప్రారంభదశలో ఉన్నపుడు, స్థానికంగా పెద్ద గాటు చేసి దాని ద్వారా కణితిని తొలగించటం ద్వారా ఎక్కువ శాతం చికిత్స చేస్తున్నారు. కాకపోతే క్యాన్సర్ కణితి పెద్దగా ఉండి చిన్న వక్షోజం ఉన్నపుడు, అధిక సంఖ్యలో కణుతులున్నప్పుడు, వక్షోజాలకి రేడియో థెరపీ ఇవ్వలేని పరిస్థితులలో పైన చెప్పిన కణితిని తొలగించి వక్షోజాలని ఉంచటం సరికాదు. ఎందుకంటే దీని వలన క్యాన్సర్ తిరగబెట్టే ప్రమాదముంటుంది.

కణితిని తొలగించి రేడియో థెరపీ ఇచ్చిన తరువాత కూడా కొన్ని కేసులలో క్యాన్సర్ కణజాలం సూక్ష్మరూపంలో ఉంటే వ్యాధి తిరగబెట్టి తీవ్రమవవచ్చు. ఇలాంటి కేసులలో శస్త్ర చికిత్స, రేడియో థెరపీతోపాటు కీమో థెరపీ మందులు కూడా వాడవలసిఉంటుంది. స్థానిక కణజాలంలో క్యాన్సర్ వ్యాపించిన దశలో దానిని నియంత్రించటం, వ్యాధి ఇంకా వ్యాపించకుండా చేయుటం ప్రాథమిక కర్తవ్యాలు. ఈ దశలో కీమో థెరపీ, రేడియో థెరపీ చికిత్సలు సంయుక్తంగా చేయవలసి ఉంటుంది.

**ముగింపు:-** అందుకే ఎవరైతే రిస్కు గ్రూపులో ఉంటారో వారు 40 దాటిన తరువాత నుండి క్రమం తప్పకుండా డాక్టరు సలహాతో మామోగ్రఫీ లాంటి పరీక్షలు చేయించుకుంటూ ఉండాలి. ఒకవేళ ఏదైనా ఉందని తెలిసితే సత్వర చికిత్స నిపుణులైన వైద్యుల ద్వారా పొందాలి. ఎప్పటికైనా 'ప్రివెన్షన్ ఈజ్ బెటర్ దాన్ క్యూర్'కదా.

## హైకూలు

అమ్మానాన్నలు 'ఏటిఎం'లయ్యారు
పెంపకం లోపమో... మైక్రోఫామ్లీ మాయో
ప్రపంచీకరణ భూతం
మానవ సంబంధాల్ని
అంగడి సరుకుని చేసింది

పల్లెపట్నం అయ్యింది
బాల్యం హాస్టల్లో బందీగా మిగిలింది
చదువుల కొను'గోలు'లో
అమ్మా, నాన్న కొవ్వొత్తులైపోతున్నారు

**- సుధా కిరణ్ బి.**

# మరోదారి

- అబ్బూరి ఛాయాదేవి

"ఇంతకన్నా చావడం నయం!" అంటోంది శ్యామల గట్టిగానే, కూతురు సుహాసిని వంటింట్లోకి వచ్చేసరికి. తల్లి అలా అనడం, కూతురు వినడం అది మొదటిసారి కాదు.

ఇంట్లో ఏ ఇబ్బంది ఎదురైనా, దాన్ని ఎదుర్కోలేని నిస్సహాయత ఏర్పడినప్పుడు చావుని కోరుకుంటుంది తల్లి. ఆ ఇబ్బంది ఎలాగో గడిచిపోగానే తల్లి మామూలు మనిషి అవుతుందని సుహాసినికి తెలుసు. అందుకే తల్లి మాటలు విని నవ్వింది. కూతురి నవ్వు వినగానే శ్యామలకి చిర్రెత్తుకొచ్చినట్లుంది.

"ఎందుకే ఆ నవ్వు?" అంది కూతురికేసి ఉరిమినట్లు చూస్తూ.

"అవును, ఇప్పుడు ఏమంత కష్టమొచ్చిందని-చావడం నయం అంటున్నావు? నువ్వేనా, ఇంట్లో అందరం చావాలా?"అంది సుహాసిని వెటకారంగా.

"మీరెందుకే మధ్యలో! మీ నాన్నని చేసుకున్నందుకూ, మిమ్మల్ని కన్నందుకు నేను చావాలి గానీ"అంది శ్యామల సాగదీస్తూ.

"ఇప్పుడేమైందని అంత నిష్ఠూరంగా మాట్లాడుతున్నావ్? దేనికంతగా బాధపడిపోవడం?'' అంది సుహాసిని తల్లిని శాంతింపజేద్దామని.

''అవునే, నావల్లనే కదా నీకు ఏ సంబంధమూ కుదరడం లేదు!"అంటూ శ్యామల కళ్ళు ఒత్తుకుంది.

"అదేమిటమ్మా? నీ వల్ల సంబంధాలు కుదరకపోవడం ఏమిటి? నువ్వేం చేశావని?" అంటూ సుహాసిని నిజంగానే ఆశ్చర్యపోయింది.

" నేను నల్లగా ఉండబట్టే కదా నువ్వూ నల్లగా పుట్టావు! నీ నలుపు చూసే కదా పెళ్ళి చూపులకి వచ్చిన వాళ్ళు తిరిగి వెళ్ళిపోతున్నారు. అందుకే, మీ బామ్మ తన కొడుక్కి నన్ను చేసుకోవడానికి ముందు ఇష్టపడలేదు. "కోడలు నలుపైతే కులమంతా నలుపు" అనే సామెత ఉందిట. అన్నట్లే అయింది."అంది శ్యామల నేరం చేసిన దానిలా తలదించుకుని.

'ఏమిటమ్మా ఆ మూఢ విశ్వాసాలు! తల్లిరంగే పిల్లలకి వస్తుందని జన్యు శాస్త్రంలో ఎక్కడా చెప్పలేదు. తండ్రి రంగు రావచ్చుకదా" అంది సుహాసిని.

"నీ దురదృష్టం కొద్దీ నా రంగే వచ్చింది నీకు" అంది శ్యామల నీరసంగా.

"పోనీలే అమ్మా, నా నలుపు నచ్చినవాడే చేసుకుంటాడు. ఎవడో నా కోసం పుట్టే వుంటాడు-ఎక్కడో ఉండే ఉంటాడు. నాన్న నిన్ను చేసుకోలేదూ, అలాగే!" అంది సుహాసిని తేలిగ్గా నవ్వుతూ.

"ఆ, చేసుకున్నారు మీ నాన్న. పాతికవేలు కట్నం తీసుకుని! ఇప్పుడు నువ్వేమో కట్నం తీసుకున్నవాణ్ణి చేసుకోనని మొండిపట్టు పట్టావు. ఎవడొస్తాడే అంత ఉదారంగా?" అంది తల్లి.

"అయినా అంత ఔదార్యం నాకేం అక్కర్లేదులే. నా నలుపుని పట్టించుకోనివాణ్ణే చేసుకుంటాను. పెళ్ళి చేసుకోకపోతే జీవితం సాగదా? ఆ మూడు ముళ్ళు వేయించుకోడానికి తలొంచుకోనక్కర్లేకుండా హాయిగా దర్జాగా ఉంటాను" అంటూ తల్లి చేసిన పకోడీలు రెండు పళ్ళెంలోంచి తీసుకుంది.

"ఆ, హాయిగా దర్జాగా ఉందువుగాని, నేను ఇలాగే నీకు వేళకి అన్నీ అమర్చి పెట్టడానికి నీతో శాశ్వతంగా ఉంటాననుకుంటున్నావా?"అని బెదిరించింది శ్యామల.

"ఎవరూ శాశ్వతం కాదులే. నేనే నీకన్నా ముందుగా -ఇప్పుడే పోతాననుకో-నీకూ నాకూ కూడా సమస్య ఉండదు కదా!"అంది సుహాసిని గంభీరంగా ముఖంపెట్టి.

"ఛీ, నోర్ముయ్, ఏమిటీ మాటలు!" అంది తల్లి.

"అవునమ్మా నువ్వేకదా అంటున్నావ్-ఇంతకన్నా చావడం నయం అని. నేను మాత్రం అనుకోకూడదా? మీ కడుపున పుట్టి, నా చదువుకోసం మీ చేత అంత ఖర్చు పెట్టించి, చివరికి పెళ్ళి విషయంలో మీకు ఇంత నిరాశా, బాధా కలిగిస్తున్నందుకు నాకు మాత్రం ఆత్మహత్య చేసుకోవాలనిపించదా.?"అని తల్లిని ఆట పట్టించడానికి అంటున్నా సుహాసిని కంఠం వణికింది.

శ్యామల గబుక్కున గరిటెని గట్టుమీద పడేసి కూతుర్ని గట్టిగా కౌగిలించుకుంది. "ఇంకెప్పుడూ అలాంటి మాటలు అనకే తల్లీ"అంది ఏడుపు గొంతుతో.

సుహాసిని మెల్లిగా తల్లి చేతులు విడిపించుకుని, 'నువ్వు కూడా ఇంకెప్పుడూ చావు మాట ఎత్తకమ్మా. ఇంకేదారీ లేనట్లు ప్రతిసారీ 'చావు నయం' అనుకుంటావేం? సమస్య ఎంత తీవ్రంగా ఉన్నా, ఆత్మహత్య పరిష్కారమార్గం కాదు కదమ్మా. నువ్వు చచ్చిపోతే మా సమస్య తీరిపోతుందా? నువ్వే ఆలోచించు"అంది తల్లిని సముదాయిస్తూ.

'నిజమేనే, నీకు సంబంధం ఏదీ కుదరడంలేదు. నలుగురికీ సంజాయిషీలు చెప్పుకోలేక చస్తున్నాను. ఇవన్నీ భరించలేక ఏదో గుటుక్కున మింగి చస్తే నయం అనిపిస్తుంది"అంది శ్యామల తన ఆలోచనని సమర్థించుకుంటూ.

''నువ్వు చీటికీ మాటికీ అలాంటి మాటలంటూంటే వినడం వల్లేనేమో, తమ్ముడు కిందటేడాది ఎం.సెట్.లో ర్యాంకు రాలేదని 'బేగాన్ స్ప్రే' తాగబోయాడు. సమయానికి నేను చూశాను కాబట్టి బతికిపోయాడు. ఇలా అధైర్యపడి ప్రతివాళ్ళూ చావడానికి ప్రయత్నించడమేనా? జీవితాన్ని ఎదుర్కోవడానికి సాహసం ఉండొద్దా? మరోదారి ఉండదా? మమ్మల్ని కనిపెంచిన దానివి, ప్రతి దానికి, నువ్వే ఇలా పిరికితనాన్ని ప్రదర్శిస్తే ఎలాగమ్మా?"అంది సుహాసిని ఉద్రేకంగా.

శ్యామల బొటబొటా కన్నీళ్ళు కార్చింది.

తల్లిని దగ్గరికి తీసుకోవాలనిపించినా, అలాగే నిలబడి, 'ఏడవడం కాదమ్మా చెయ్యవలసింది'అంది సుహాసిని.

"మరేం చేయనే?... నీ విషయంలో ఇప్పుడు మేమేం చెయ్యం? ఇంత చదువు చెప్పించాం. పనిపాటలు నేర్పించాం. ఆరోగ్యంగా ఉండేలా పెంచాం. ఇంకా ఏం కావాలే ఈ మగవాళ్ళకీ, వాళ్ళని కన్న వాళ్ళకీనూ?"అంది శ్యామల కీచుగొంతుతో.

"పెళ్ళి చేసి పంపించడం కోసమే కాదుకదమ్మా నన్ను తీర్చిదిద్దినది? నన్నొక వ్యక్తిత్వం ఉన్న దానిగా తీర్చిదిద్దారు. ఉద్యోగం చేసుకుంటూ నా కాళ్ళమీద నేను నిలబడగలను. నా జీవితాన్ని నాకిష్టమైన రీతిలో జీవిస్తాను. సరియైన వాడు దొరికినప్పుడు పెళ్ళి చేసుకుంటాను. పెళ్ళొక్కటే నా గమ్యం అనుకోకు. నాకు మరోదారి లేదనుకోకు"అంది సుహాసిని కచ్చితంగా.

తల్లి వంట పొయ్యి వైపుకి తిరిగింది, ఇష్టంగానో, అయిష్టంగానో, సుహాసిని ఇటు తిరిగి చూసేసరికి వంటింటి గుమ్మంలో ఎదురుగా తండ్రి.

ఎప్పుడొచ్చాడో సుహాసిని గమనించలేదు. ప్రోత్సాహకరమైన చిరునవ్వు కనిపించింది తండ్రి ముఖంలో. సగర్వంగా మందహాసం చేసింది సుహాసిని తండ్రికేసి చూస్తూ.

**(అబ్బూరి ఛాయాదేవి గారు రచించిన 'ఎవర్ని చేసుకోను?' కథల సంపుటి నుండి)**

మీడియా

# తప్పెవరిది? శిక్షెవరికి?

- కె. అరుణ

ఈ మధ్య అన్నీ సీరియస్ పుస్తకాలే చదువుతున్నా. అందుకే కాస్త సరదాగా చదివే కథల పుస్తకాలకోసం లైబ్రరీలో వెతుకుతుంటే కనపడిందా పుస్తకం. అప్పుడు నా కంటికి 'కథలు' అన్నదే కనిపించింది. వెంటనే తీసేసుకున్నాను. ఇంటికెళ్లగానే చదువుదామని తీశా. మొదటి కథే తేడాగా ఉంది. ఏంటిది అని అట్ట చూశా. అదొక ప్రాచుర్యం పొందిన నవరివార పత్రికలోని సరసమైన కథలసంపుటి. మహానుభావుడు ఆ కథలురాయడం, వాటిని ఆ పత్రిక ప్రచురించడమేకాదు. వాటిని తిరిగి ఎంతో సగర్వంగా ఓ పుస్తకంగా అచ్చు వేసుకున్నాడు. ఇందుకు అతగాడికెంత ధైర్యం కావాలి? ధైర్యం కాదు, సమాజం పట్ల ఎంత బాధ్యతారాహిత్యం! ఎంత నిర్లక్ష్యం! ఎవరెలా పోతే నాకేంటి, నా డబ్బులు నాకొస్తాయి అన్న పొగరు కాదూ! వెగటు పుట్టిస్తున్నా నాలుగైదు కథలు చదివాను. ఆ కథల్లో రచయిత మనస్తత్వం అద్దంలో చూసినట్లే అనిపించింది. ఆడవారి పట్ల అతనికున్న అభిప్రాయం కొట్టొచ్చినట్లు కనిపించింది. అన్ని కథల సారమూ ఒక్కటే! ఎందులోనూ స్త్రీకి ఆత్మగౌరవం అన్నదే లేదు.

ఆ పుస్తకం చదువుతుంటే పిచ్చ కోపం వచ్చింది. ఎదురుగా వుంటే పట్టుకుని తన్నాలనిపించింది. ఎందుకంటే, మకిలిపట్టిన ఇలాంటి అభిప్రాయాలు అతనిలోనే వుంటే పోయేదేమీ లేదు. మహా అయితే అతని సంబంధీకులు, పరిచయస్తులు, అతనికి ఎదురయ్యేవాళ్లు బలవుతారేమో!(మాటలే కాదు, బహుశా చూపులు కూడానేమో! వీళ్లు ఏ ఆడది ఎదురైనా అవయవ సౌష్టవాన్నే గమనిస్తారేమో అని నాకో అనుమానం! ఆఖరికి తల్లయినా, చెల్లయినా!) కానీ, ఈ ధూర్తుడు అతని మనసులోని కంపును, మురికిని తన రచనల (వీటిని రచనలు అంటే రచనలే తలవంచుకుంటాయి! కథలంటే మహా మహా కథకులంతా సిగ్గుపడరూ) ద్వారా నలుదిశలా వ్యాపింపచేస్తున్నాడే అని! ఇలాంటివారిని ఏంచేయాలి! వీటిని మనం ఆహ్వానించడం, ఆదరించడమంటే...నీచ సంస్కృతిని ఆదరించడమేగా! వీటిని మనం దూరం పెట్టలేమా! నడి బజార్లో లేకుండా అడ్డుకోలేమా?

నేడు ఏ బిజీ సెంటర్లో చూసినా ఫుట్‌పాత్ మీద చవుకబారు సిడిలు(క్వాలిటీలో కాదు అందులోవున్న విషయం) అమ్మేస్తున్నారు. పత్రికలు అమ్మే బుక్‌స్టాల్స్‌లో మామూలు పత్రికలకన్నా ఎక్కువ బూతు సాహిత్యమే వుంటుంది. ప్రత్యేకంగా అడిగితే మరిన్ని ఘాటైన పుస్తకాలు ఇస్తారట! విసిఆర్‌లు ఉన్న రోజుల్లో వీడియో పార్లర్లలో ఇదే తంతు! ఇప్పుడు డివిడిలు! ఇక సినిమాకెళ్తే ఎక్స్‌పోజింగ్‌లేని సినిమా వుంటుందా? అప్పట్లో సినిమా మొత్తం మీద ఓపాట అలాంటిది వచ్చిపోయేది .మరిప్పుడో! పేర్లు పడింది మొదలు చివరిదాకా ఒకరిద్దరు కథానాయికలు పోటీపడి మరీ అందాలు ఆరబోస్తున్నారు. ఇవి చాలవన్నట్లు 'ఐటమ్‌సాంగ్' ప్రత్యేకం! అసలివన్నీ ఎందుకు? నట్టింట్లో టివి ఆన్‌చేస్తే చాలదూ! అండర్‌వేర్ నుండి అత్తరు బుడ్డీ వరకూ ప్రతి దానికీ అమ్మాయిల అందాలే ముడిసరుకు.

పైన చెప్పుకున్న పుస్తకాలు పిల్లలకు కనపడకుండా దాయొచ్చు. ఫలానా సినిమా సంగతి తెలిశాక చూడటం మానుకోవచ్చు. కానీ మనింటి హాల్లో దిగబడ్డ దెయ్యాన్ని ఎలా ఆపగలం? 'ఎఫ్' ఛానల్లో అయితే దాన్ని లేకుండా చేయొచ్చు. కానీ, న్యూస్ ఛానల్లోనూ ఈ ప్రకటనలు ఆగవు( థర్టీ మినిట్స్ పేరుతో ముద్దులు, కౌగిలింతల కార్యక్రమాలు సరేసరి)టివి ఆన్‌చేయకుండా పిల్లా పెద్దా ఎవరూ ఆపలేరు. మరెలా? పిల్లలు మంచి వాతావరణంలో పెరగాలనే అందరూ కోరుకునేది. కానీ పరిస్థితి మన

**జరుగుతున్న అఘాయిత్యాలకు, మారుతున్న విలువలకు... ఈ సంస్కృతికి ఎలాంటి సంబంధం లేదా? ఖచ్చితంగా వుంది! జరుగుతున్న నేరాల వెనుక అసలు నిందితులు వీరు కాదూ? ఆయా తప్పులు చేసిన నిందితులను ఉరితీస్తే పరిస్థితులు మారిపోవు. అదే నిజమైతే, స్వప్నికపై యాసిడ్ దాడి అనంతరం ఎన్‌కౌంటర్‌లో నిందితులు మరణించారు. ఆ తరువాత ఎలాంటి దురంతాలూ జరగలేదా? జరిగాయి. అసలైన తప్పు అక్కడ మాత్రమే లేదు. కాసులకోసం కక్కుర్తిపడే వారిని అనీ లాభంలేదు. అసలు తప్పు పాలకుల్లో వుంది. వారి విధానాల్లో వుంది. వారి నిర్లక్ష్యంలో వుంది. ప్రజలపట్ల వారి ఉదాసీనతలో ఉంది.**

చేతుల్లో లేకుండా పోతోంది. మంచి, చెడు అని మాటలతో చెప్పగలిగే పరిస్థితి లేకుండా ఆ సమయాన్ని టివి ఆక్రమిస్తుంది.

ఇలాంటి వాతావరణంలో పెరిగే పిల్లలు ఎలాంటి మనస్తత్వాన్ని అలవర్చుకుంటారు? చుట్టూ ఉన్న వాతావరణ ప్రభావానికి గురికాకుండా ఎలా వుంటారు? ప్రేమంటే అందమైన అనుబంధం. కానీ, అది వీటి పుణ్యమాని తాత్కాలిక ఆకర్షణగా మారిపోయింది. శృంగారం శరీరానికి సంబంధించినది కాదు. మనసుకు సంబంధించింది అనే వాస్తవం అర్థమయ్యేనరికి నర్వనాశనం అయిపోతోంది. మనం యువతకు తెలియజేయాల్సిన నిజాలెన్నో వున్నాయి. భవిష్యత్ నిర్మాతలు వారేగా మరి! రేపటి భారతం వారి చేతిలోనే కదా! ఇదెందుకు గమనించరు?

కొందరు కథకులు, రచయితలు, నిర్మాతలు, దర్శకులు, నటులు, ఛానళ్లవారు చాలా వరకు నమాజాన్ని దిగజార్చుతున్నవారే! ఇందుకు వీరంతా బాధ్యత వహించాల్సిందే! కాదంటే కుదరదు! జరుగుతున్న అఘాయిత్యాలకు, మారుతున్న విలువలకు... ఈ సంస్కృతికి ఎలాంటి సంబంధం లేదా? ఖచ్చితంగా వుంది! జరుగుతున్న నేరాల వెనుక అసలు నిందితులు వీరు కాదూ? ఆయా తప్పులు చేసిన నిందితులను ఉరితీస్తే పరిస్థితులు మారిపోవు. అదే నిజమైతే, స్వప్నికపై యాసిడ్ దాడి అనంతరం ఎన్‌కౌంటర్‌లో నిందితులు మరణించారు. ఆ తరువాత ఎలాంటి దురంతాలూ జరగలేదా? జరిగాయి. అసలైన తప్పు అక్కడ మాత్రమే లేదు. కాసులకోసం కక్కుర్తిపడే వారిని అనీ లాభంలేదు. అసలు తప్పు పాలకుల్లో వుంది. వారి విధానాల్లో వుంది. వారి నిర్లక్ష్యంలో వుంది. ప్రజలపట్ల వారి ఉదాసీనతలో ఉంది.

విచ్చలవిడి శృంగారం నిండిన సినిమాలేంటో వారికి తెలుసు. ఇంటర్నెట్ వ్యవహారాలు ఎలా అరికట్టవచ్చో తెలుసు. అన్నీ తెలిసీ ఏమీ పట్టనట్లు వుండడమూ తెలుసు. ఏదైనా ఉదంతం జరిగినపుడు హడావుడి కాదు. ప్రభుత్వం చేయాల్సింది .బాధితులకు సానుభూతి తెలపడం మాత్రమే కాదు. మనకు కావాల్సింది! మనం కోరుకునేది అసలైన పరిష్కారం! ఈ దారుణాలనుండి అసలైన విముక్తి, స్వేచ్ఛ, సమానత్వం, ఆరోగ్యవంతమైన సమాజం. మనం ప్రభుత్వాన్ని చేతకానిది అడగటంలేదు, చేయలేనిది కోరడంలేదు. వారి చేతిలో వున్నదే. అనుకుంటే తక్షణమే లభించేదే. ప్రభుత్వం కఠినంగా వ్యవహరిస్తే ఉన్న చట్టాలను కఠినంగా అమలుచేస్తే ఎన్నో నమస్యలు పరిష్కారం అవుతాయి. ఆరోగ్యవంతమైన నమాజం మన కళ్ళముందు ఆవిష్కరింపబడుతుంది.

ప్రభుత్వాన్ని కదిలించాలంటే ఆ పని ఏ ఒక్క మహిళా సంఘానిదో, ఏ ఒక్క పార్టీదో కాదు. అది కేవలం మహిళలు, విద్యార్థుల పని మాత్రమే కాదు! సమస్త ప్రజానీకం ఏకమవ్వాలి. వీటిని నిరసించాలి. నినదించాలి. ఆ సినిమాలను, ఆ కార్యక్రమాలను, ఆ చచ్చు పుస్తకాలను దూరం పెట్టాలి. అప్పుడు మనం కోరుకున్న ఫలితం తప్పకవస్తుంది. అబ్బాయిలు ఎదుటివారి అభిప్రాయాన్ని మన్నించగల మంచి కాలమొస్తుంది. మన అమ్మాయిలు స్వేచ్ఛగా నడయాడే రోజులొస్తాయి. ●

---

37వ పేజీ తరువాయి

తీరిపోయేయా? ఇంక ఉత్సవ సంబరమేనా చేసుకోవలసింది? ఏడాది పొడుగునా మహిళల నమస్యల్ని గుర్తించుకుంటూ చర్చలతో, పోరాటాలతో నమస్యల్ని పరిష్కరించుకుంటూ మహిళా దినోత్సవం రోజున వాటిని సమీక్షించుకునేది పోయి దాని చరిత్ర ఎత్తకుండా ముగ్గులపోటీలు, అందాల పోటీలతోనా పొద్దుపుచ్చడం అని నిస్పృహగా అనిపించింది ఆ చరిత్ర చదివిన ఆవేశంలో ఉన్న సుమ.

ఇలాంటి ఆలోచనలతో పరధ్యానంగా ఉన్న సుమతో సాయంత్రం గంగ "మా పేటలో అందర్నీ అడిగేనండి. ఈ పట్టుచీర ఖరీదు నాలుగువేలు అని దాని మీదే ఉంది. రెండు వేలకయినా తీసుకోమని. వాళ్ళకెవరికీ అంత స్తోమత లేదు. మన అపార్ట్‌మెంట్‌లో వాళ్ళనీ అడిగాను. అమ్మడం ఎందుకు? నీ పెళ్ళికి దాచుకో అన్నారు. ఒకే ఒక్క చీర చూపించి సెలక్ట్ చేసుకోవడానికి అవకాశం లేకుండా తీసుకోమంటే ఎలా తీసుకుంటాం అన్నారు. అమ్మ, నాన్న పెళ్ళికి మేం ఎలాగా కొంటాం గాని, ఇది అమ్ముకుని డబ్బు దాచుకో అన్నారు. "అమ్మ గారూ మీరు తెల్లగా ఉంటారు కదా, ఈ ముదురాకుపచ్చ చాలా బాటుంటుంది తీసుకోరా?" అని అడిగింది ఆశగా. సుమ కూడా నిరాకరించింది.

'ఎందుకే అమ్మడం?' అంది.

"మా అన్న ఆపరేషన్‌కి చాలా అప్పులయ్యాయి. మా నాన్నకి సాయంగా ఉంటుందనీ...."అన్నది గంగ.

ఆ మాటలన్నీ రమణ వింటున్నాడు.

"గంగ ఎంత మంచి పిల్లో చూడు. పోటీలో గెలుచుకున్న చీరని, అంత చిన్న పిల్ల కుటుంబం కోసం అమ్మేస్తానంటోంది" అన్నాడు గంగ వెళ్ళి పోయాక.

"చూసావా, నాకు తట్టనే లేదు. ఆ పిల్ల మంచితనం, నీకు తట్టింది గానీ!"

" ఆ పిల్ల నుండి అలాంటిది ఆశించని వాళ్ళ తల్లిదండ్రులూ మంచి వాళ్ళే. ఆ పిల్ల మంచితనాన్ని గుర్తించిన నువ్వు మంచి వాడివే!" అంది సుమ.

సుమ గంగకి రెండు వేలు ఇచ్చింది, పట్టుచీర తీసుకోకుండానే, అప్పుగా కాక ఆర్ద్రతతో ఇచ్చింది. అదీ సంగతి!

ఇంటి పనితో, చదువులతో, ఆటలతో అలసిపోయిన సుమ చెబుతూనే నిద్రలోకి జారిపోయింది. కాసేపు చదువుకుని లైట్ ఆర్పబోతున్న రమణ, నిద్దట్లో సుమ మొహంలో విరిసిన దరహాస సుమాల్ని చూశాడు. కలలో ఏ పోటీలో కలిగిన జయం కురిపించింది ఆ నవ్వుల పువ్వుల జల్లుల్ని సుమ మొహం మీద!

**(చైతన్య మానవి దశాబ్ది ప్రత్యేక సంచిక సందర్భంగా నిర్వహించిన కథల పోటీలో సాధారణ ప్రచురణకు ఎంపికైన కథ.)** ●

## కేస్ స్టడీ

అందరి మాటలు వినీ వినీ విసుగొస్తుంది. బయటోళ్ల మాటలంటే వాళ్ళకేమీ తెలీదు కాబట్టి పట్టించుకోకుండా ఉండొచ్చు. కానీ అన్నీ తెలిసిన బంధువులు కూడా అలాగే అంటే ఎలా? కాస్త కోపంగా మాట్లాడిన మాట నిజమే. అంత మాత్రాన వాళ్లు చెప్పినవన్నీ నమ్మేయడమేనా? అదీ ఎందుకు మాట్లాడాను? వాళ్లెంత విసిగించారో అర్థం చేసుకోరెందుకు? చిన్నప్పటి నుండీ తెలిసున్నవాళ్లూ అలాగే అంటే ఇక ఏం చేయాలి. నాకు కోపం ఎక్కువని, కోపిష్టినని, పొగరుబోతునని ప్రచారం చేశారు. డబ్బు కోసం అలమటించి పోతున్నానట. కట్నం డబ్బుల్లో రెండు లక్షలు నా పేర ఫిక్స్‌డ్ డిపాజిట్ వేయాలంటే సరే అన్నారు. కానీ పెళ్లయిన నెలలోనే వాటిని తీసి వడ్డీకిచ్చుకున్నారు. అది కూడా నా పేరో, భర్త పేరో కాదు, మా మామగారి పేరుతో ఇచ్చుకున్నారు. అప్పుడు కూడా నేనేమీ మాట్లాడలేదే. వాళ్ళు చెప్పినట్లే ఎక్కడ సంతకాలు పెట్టమంటే అక్కడ పెట్టాను. పైగా అప్పుడు కూడా వాళ్లనే వెనకేసుకొచ్చి అమ్మా వాళ్ల మీదే కోప్పడ్డాను. వచ్చిన సంపాదనను బట్టి ఖర్చు చేయాలనుకోవడం తప్పేమీ కాదే. అదే విషయం చెప్పి జీతం గురించి మాట్లాడితే డబ్బు గురించి నీకెందుకు అంటాడు. అప్పు చేయొద్దు అంటే వినకుండా ఫ్రెండు దగ్గర అప్పు చేసి టివి., ఫ్రిజ్ కొన్నాడు. సరే టివి కొన్నాడు కదాని కేబుల్ పెట్టించమని అడిగితే.. దానికో రాద్ధాంతం. బజార్లో ఉన్నామని కూడా చూడకుండా తిడుతుంటాడు. చుట్టూ ఉన్న వాళ్లు విని నవ్వుకుని ఎగతాళిగా చూస్తుంటే ఎంత బాధగా వుంటుందో చెప్పినా ఎవ్వరికీ అర్థం కాదు. అంతటితో ఆగకుండా అన్నయ్యకు ఫోన్ చేసి మరీ తనతో కూడా తిట్టిస్తాడు. అదేంటో అన్నా, వదిన కూడా తనమాటే నమ్ముతారు. కానీ, నేను చెప్పే మాటలు అస్సలు పట్టించుకోరు. ఏవైనా ఇంటి అవసరాలకి డబ్బులడిగితే జీతం అయిపోయిందంటాడు. పది, పదిహేను రోజులకే అయిపోతే ఎలా? అంటే తిట్లు, చీవాట్లు.

ఇంట్లోకి వచారీ సరుకులు కొందామంటే.. ఎందుకు అనవసరంగా ఎప్పుడు అవసరమైతే అప్పుడే తెచ్చుకోవచ్చంటాడు. సరే అని అడగడం మానేశాను. ఎప్పుడైనా కాస్త నోరు బాలేక ఏ బిస్కెట్లో కొనుక్కొని తింటే 'నీకు సరదాలు ఎక్కువ' అని తిట్టడమే కాకుండా వాళ్ళమ్మ వాళ్లకి ఫోన్ చేసి మరీ ఈ విషయం చెప్తాడు. ఈ మనిషిని ఎలా అర్థం చేసుకోవాలో తెలీడం

# ఏం చేయాలి?

**- బి. మల్లేశ్వరి**

లేదు. కొత్తగా పెళ్లయింది, భార్య ఇంటి దగ్గర ఒంటరిగా ఎదురు చూస్తుంటుందనే ఆలోచన కూడా ఉండదు. ఇంటికి వారంలో ఒక్క రోజు కూడా సాయంత్రాలు త్వరగా రాడు. ఫ్రెండ్స్‌తో షికార్లు కొట్టి ఏ తొమ్మిదింటికో వస్తాడు. ఆదివారాలైతే చెల్లెలి దగ్గరికంటాడు. ప్రతి ఆదివారం చెల్లెలి దగ్గరకి వెళ్తున్నప్పుడు నన్నూ తనతో తీసుకెళ్తే ఎంత సంతోషిస్తాను? ఈ విషయం అత్తా మామలతో మాట్లాడితే వాడు మగాడు బయట ఎన్నో పనులుంటాయి. త్వరగా ఎలా వస్తాడంటారు. నిజానికి సాయంత్రం ఐదున్నరకే ఆఫీసు నుండి బయటికొస్తారాయన. పక్కింటి వాళ్ళు, ఎదురింటి వాళ్లు అలా సరదాగా సాయంత్రాలు కూర్చుని కబుర్లు చెప్పుకుంటుంటే నేనెందుకు అలా సంతోషంగా ఉండలేకపోతున్నానని ఎన్నిసార్లు బాధతో ఏడ్చానో ఎవరికి తెలుసు?

ఆరోనెల కడుపుతోఉన్నప్పుడు బాగా కడుపు నొప్పి వస్తుంటే అప్పుడు ఆస్పత్రికి తీసుకెళ్లాడు. బెడ్ రెస్ట్ తీసుకోమన్నారు. ఆ ఒక్కసారి తప్పితే తర్వాతెప్పుడూ నా ఆరోగ్యం గురించే పట్టించుకోలేదు. మొదట్లో తగ్గినట్లనిపించినా వారం రోజులకే మళ్లీ కడుపునొప్పి వచ్చింది. అప్పుడే అత్తామామ వచ్చారు. అటువంటి పరిస్థితుల్లో కూడా వాళ్లకి చేతనైనంత వరకు బాగానే చేసి పెట్టాను. పదిహేను రోజులకే మళ్ళీ ఆరోగ్యం పాడైంది. డాక్టర్ దగ్గరికి తీసుకెళ్లాడు. డాక్టర్ స్కానింగ్ రిపోర్టు చూసి 'బెడ్ రెస్ట్ తీసుకోమంటే ఎందుకు తీసుకోలేదు. గర్భసంచి జారిపోయింది' అని చీవాట్లేసింది. అప్పుడు అమ్మకి ఫోన్ చేస్తే హడావుడిగా వచ్చి కుట్లు వేయించి ఇంటికి తీసుకెళ్లింది. అప్పుడు మొదలు నొప్పులొస్తున్నాయని హాస్పటల్‌లో చేరేవరకు ఒక్కసారి కూడా వచ్చి చూడలేదు. నేను ఫోన్ చేస్తే తప్ప తను మాట్లాడడు. చివరికి బిడ్డ పుట్టాడని తెలిసినప్పుడు కూడా తన కొడుకును చూడాలన్న తాపత్రయం ఆ మనిషిలో ఏ కోశానా లేదు. తాపీగా ఓ సినిమా చూసి వచ్చాడట. ఆ విషయం కూడా తానే చెప్తుంటే నాకేమనాలో తోచలేదు. ఇప్పుడు పిల్లాడికి మూడేళ్లు. వాడికి వాక్సిన్లు, పోలియో డ్రాప్స్ లాంటి వాటిలో ఏ ఒక్కటీ తండ్రిగా బాధ్యత తీసుకుని వేయించలేదు. నా ఆరోగ్యం గురించి గానీ, కొడుకు గురించి కానీ ఏమాత్రం పట్టించుకోని ఆయన ఫ్రెండు భార్య గర్భవతని తెలిసి రోజుకోసారి ఫోన్ చేసి ఆమెకి ఆరోగ్య సూత్రాలు పాటించాలని చెప్తున్నాడు. ఇదంతా వింటున్న నా మనసెంత బాధపడుతుందో నా అనుకున్న వాళ్లకి కూడా అర్థం కాదెందుకో.

భర్తని, అత్తమామలని గౌరవించడం లేదని మరో అబాంధం. భర్త పర్సులో నా ఫోటో కాకుండా వేరే అమ్మాయి ఫోటో చూసినప్పుడు ఏ భార్యకైనా ఏమనిపిస్తుంది. అనుమానం రాదా? చెప్పండి. అదే విషయం అడిగితే.. ఆఫీస్ కొలీగ్ అని చెప్పాడు. ఈ విషయంలో తనొక్కడే కాదు. వాళ్ల అమ్మనాన్న మేనమామలు, అక్క, చెల్లెళ్ళు అందరూ అదే మాట చెప్పారు. ఈ విషయం విన్న తరువాత కొలీగ్‌ల ఫోటోలు జేబులో పెట్టుకుని తిరుగుతారని అప్పటి వరకు తెలీదు. మరి మిగతావారి ఫోటోలు లేవెందుకన్న ప్రశ్నకు జవాబు లేదు.

ఆ. ఇంకా ఏమంటే.. నాకసలు భర్తంటే ఇష్టం లేదట. ఇష్టం లేకుండానే పెళ్లి చేసుకున్నానా? బాబు పుట్టాడా? నా భర్త నన్ను ప్రేమించాలనుకోవడం తప్పా? ఎంత సేపూ

అమ్మా, నాన్న, అక్కా చెల్లి, మేనమామ.. వీళ్లే కానీ ఇంట్లో పెళ్లాం, కొడుకు ఉన్నారు. వాళ్లతో కాసేపు సరదాగా గడుపుదామని అస్సలు అనిపించదెందుకో. చెపితే నమ్ముతారో లేదో! పెళ్లయి నాలుగేళ్ళవుతున్నా పట్టుమని 6 నెలలుకూడా కలిసి ఉండలేదంటే నమ్ముతారా? భర్తంటే భరోసా, అండ అంటారు. అవెలా వుంటాయో కూడా తెలియదు. సరదాగా మాట్లాడాలన్నా భయమే. ఏది మాట్లాడినా పెడార్థాలు తీస్తుంటే ఏమని మాట్లాడాలి? ఏమైనా అంటే తిట్లు, అవి చెప్పడానికి కూడా రాని బండ బూతులు. ఏ భర్తా భార్యని అనరాని మాటలనీ అన్నాడు. వాటిని వినీ వినీ వినిగిపోయి ఓసారి కోపం పట్టలేక తిరగబడ్డాను. కొడుతుంటే చెయ్యడ్డం పెట్టి నెట్టాను. వెంటనే వాళ్లమ్మకి, మేమమామకి ఫోన్ చేసి నేను కొట్టానని చెప్పాడు. దెబ్బల నుండి తప్పించుకోడానికి నెట్టడమే కొట్టడమైతే మరి.. తల గోడకేసి కొట్టడం, చేతులు వెనక్కి తిప్పి నెట్టడం వీటినేమనాలి? పైగా ఇలా జరుగుతుందని తోడబుట్టిన వాడికి చెప్తే 'నువ్వేం చేస్తున్నావో' అని తిరిగి నా మీదనే దాడి జరుపుతుంటే ఎవరికి చెప్పుకోవాలి? తింటే అయిపోతున్నాయని, తినకపోతే తినడం లేదని ఫిర్యాదు చేసే మనిషితో ఎలా వేగాలి? పుట్టింటి నుండి తీసుకెళ్లిన నాలుగు రోజులు బాగుంటాడు. మళ్లీ మొదలే. ఏదో వంకతో గొడవ పెట్టుకోవడం, తిట్టడం, కొట్టడం, నెల తిరక్కుండానే పుట్టింటికి వచ్చి నాలుగైదు నెలలు ఉండడం.. తను వచ్చి 'నువ్వు కావాలి, మనింటికి వెళ్దాం రమ్మని'అంటాడని రోజూ ఎదురు చూపులే. కనీసం ఫోన్ చేసినా అక్కడ వాలిపోదామని.. ఇలా ఎన్నిసార్లో తెలీడం లేదు.

నేనేమీ అస్సలు పొరపాటు చేయలేదని కాదు. నేనూ తెలిసో తెలియకనో చిన్న చిన్న తప్పులు చేశాను. నువ్వు ఈ తప్పు చేశావు' అని ఎవరైనా చెప్పినప్పుడు వాటిని సరిదిద్దుకున్నాను. చిన్న చిన్న గొడవలు సహజం. కానీ ప్రతి మాటా గొడవకు దారి తీస్తే.. రోజు వారీ పనులను కూడా భూతద్దంలో చూస్తే.. 'ఇది ఇలా కాదు' అని చెప్పడం కూడా తప్పేనా? తన తప్పును తప్పు అని చెప్పకూడదు. మగాడంటే అలాగే ఉండాలట. లేకపోతే భార్యలు నెత్తికెక్కుతారట. తెలియని వాళ్లకి చెప్పొచ్చు. కానీ తెలిసీ, కావాలని ఏడిపించే వాళ్లని ఎలా మార్చడం? నేనిలాగే ఉంటాను, నీకిష్టం ఉంటే ఉండు లేకపోతే ఫో.. నేను మారను' అనే వాళ్లకి ఏం చెప్పినా ప్రయోజనం ఉంటుందనిపించడంలేదు. చివరికి ఓ రోజు గొడవ పడుతున్నప్పుడు మాటల్లో 'ఛస్తాను' అంటే 'ఇక్కడ కాదు మీ ఇంటికి పోయి చావు' అన్నాడు. ఇలా ఒక్కసారి కాదు.. ఇవన్నీ వినడానికి చాలా చిన్న విషయాల్లాగా సిల్లీగా అనిపిస్తాయి. కానీ ఆ పరిస్థితుల్లో వున్న నాకు మాత్రం భరించడం చాలా కష్టంగా ఉంటోంది.

భర్తగా, తండ్రిగా మా అవసరాలేమీ తీర్చనప్పుడు అండగా ఉండనప్పుడు ఇక నేను అక్కడ ఉండి ఉపయోగమేంటి? చివరి సారిగా బంధువుల ముందు పంచాయితీ పెట్టాడు. అందరూ సర్ది చెప్పారు. సరే తీసుకెళ్తానన్నాడు. పక్కకి తీసుకెళ్లి 'ఈసారి వస్తే ఇలా కూడా ఉండదు' అని ఒకే ఒక్కమాట అన్నాడు. అది చెప్పడమే కాదు, హెచ్చరించాడు. ఇక ఏ ధైర్యంతో నేనా మనిషితో జీవితం వంచుకోవాలి? నలుగురిలో కుటుంబ మర్యాద కాపాడుకోవడం కోసం ఎన్నని, ఎంతకాలమని భరించాలి? కొట్టించుకునే ఓపిక, తిట్లు తినే సహనం పోయింది. మనసు విరిగిపోయింది. ప్రశాంతంగా ఉండాలనిపిస్తుంది. అందుకే ఏం చేయాలి? అందుకే అడిగాను.. నాకీ భర్త వద్దు, విడాకులు కావాలని. మరి మీరేమంటారు? నా నిర్ణయం సబబా కాదా, చెప్పండి.

> భర్తని, అత్తమామలని గౌరవించడం లేదని మరో అభాండం. భర్త పర్సులో నా ఫోటో కాకుండా వేరే అమ్మాయి ఫోటో చూసినప్పుడు ఏ భార్యకైనా ఏమనిపిస్తుంది. అనుమానం రాదా? చెప్పండి. అదే విషయం అడిగితే.. ఆఫీస్ కొలీగ్ అని చెప్పాడు. ఈ విషయంలో తనొక్కడే కాదు. వాళ్ల అమ్మనాన్న మేనమామలు, అక్క చెల్లెళ్ళు అందరూ అదే మాట చెప్పారు. ఈ విషయం విన్న తరువాత కొలీగ్‌ల ఫోటోలు జేబులో పెట్టుకుని తిరుగుతారని అప్పటి వరకు తెలీదు. మరి మిగతావారి ఫోటోలు లేవెందుకన్న ప్రశ్నకు జవాబు లేదు.

## అడియాశ

వారి తొలి పరిచయంలో...
ఆమెకి ఇష్టమైనవన్నీ
ఆయన కిష్టంగా తోచాయి
ఆమెకేది ఇష్టమో
అదే -ఆయనకి ఇష్టంగా అయిపోయింది
ఆ పరిచయం-
ఒక బంధంగా ముడిపడింది
జీవన సహగమనంలో
మలి సంధ్యలు అలముకుంటున్న వేళ
ఆమె-
తనలో తాను యోచించుకుంటే-ఆమెకు
ఆశలు, ఆకాంక్షలు వెల్లడి చేసే
సమయం రానేలేదు
తన ఇష్టాలన్నీ ఏనాడో మరిచిపోయింది
ఆయన ఇష్టమే తన ఇష్టాలుగా
మలచబడింది
తన కోసం తాను కాకుండా
అతని కోసం మిగిలిపోయింది
గుండెల్లో పెట్టుకుని
పదిలంగా చూసుకుంటానని
పెళ్ళికి ముందు- అతని బాసలు
పిదప-
అరచేతిలో పెట్టుకుని
అణచివేయబడ్డాయి ఆమె ఆశలు
అనాలోచనో అసంకల్పితమో
కానీ
ఆమె ఆశలు అయ్యాయి! అడియాశలు!!

-ఆర్.డి.ప్రసన్న

చట్టాలు

# మాతృత్వపు సౌకర్యాల చట్టం 1961



- ఆర్. దుర్గాప్రసన్న

స్త్రీకి మాతృత్వం అనేది ఒక వరం అని అందరూ అంటారు. అది పాతమాటే కావచ్చు. కానీ, ఆరోగ్యవంతమైన సమాజానికి ఆరోగ్యకరమైన పరిస్థితుల్లో శిశు జననానికి స్వాగతం పలకడం చాలా ముఖ్యం. శిశువు తల్లి గర్భంలో ప్రాణం పోసుకున్నప్పటి నుండీ అనేక జాగ్రత్తలు పాటించే సాంప్రదాయం మనది. తల్లి గర్భంలో రూపుదిద్దుకునే శిశువుకి, ఆ గర్భవతి మానసిక, శారీరక ఆరోగ్యం కోసం జాగ్రత్తలు తీసుకుని, పాటించవలసిన ఆవశ్యకతవుంది. అంతేకాదు ఆహ్లాదకరమైన, ఆరోగ్యకరమైన పరిస్థితులలో జన్మించే శిశువులు మేథో సంపత్తిని కలిగి ఉంటారు. అంతేకాక తరువాతి కాలంలో వారి జీవితంలో ఎదురయ్యే సమస్యల్ని పరిష్కరించుకునే శక్తియుక్తుల్ని కలిగి ఉండి, మానసిక ఆరోగ్యాన్ని, శారీరక దృఢత్వాన్ని కలిగి ఉంటారనడంలో ఎటువంటి సందేహంలేదు. నెలతప్పిన నెలతకి అన్ని సౌకర్యాలూ కల్పిస్తూ అపురూపంగా చూసుకుంటాం. మరి పనిచేసే మహిళలకు ప్రభుత్వ పరంగా ఏ విధమైన సౌకర్యాలు ఉన్నాయి? అనుకున్నపుడు **'ద మెటర్నటీ బెనిఫిట్ యాక్ట్, 1961' గూర్చి చెప్పుకోవాలి.** అంతకంటే ముందునుండీ అమలులో ఉన్న 'ద ఎంప్లాయిస్ స్టేట్ ఇన్సూరెన్స్ యాక్ట్, 1948 గురించి కూడా తెలుసుకోవాలి. ఈ చట్టాల వల్ల మహిళలు గర్భవతులుగా ఉన్నప్పుడు వారిని పనిలో నుండీ తొలగించకుండా, గర్భవతికి కావలసిన విశ్రాంతినిస్తూ, తేలికపాటి పనులను మాత్రమే చేయడాన్ని అనుమతించాలి. తల్లీ బిడ్డల క్షేమానికి అనుకూలమైన పరిస్థితులను కల్పించడమే కాక, సెలవుతో కూడిన జీతం కూడా పొందే వీలుంది. 1976లో సవరణల వల్ల ఉద్యోగినులు అంటే ప్రభుత్వ, ప్రభుత్వేతర రంగాలలోని కార్యాలయాలు, ఫ్యాక్టరీలు, గనులు మొదలగు చోట్ల పనిచేసే స్త్రీలందరికీ వర్తిస్తుంది. ఈ చట్టం వల్ల గర్భవతులైన, బాలింతలైన ఉద్యోగినులకు, శ్రామికులకు ప్రభుత్వ పరంగా సౌకర్యాలు లభించడమేకాక ప్రభుత్వం, ప్రైవేట్ యాజమాన్యాలపై చట్టబద్ధమైన బాధ్యతను ఉంచడమైనది. యాజమాన్యం వారి యొక్క బాధ్యతను సక్రమంగా నిర్వర్తించకపోయిన, స్త్రీల యొక్క మాతృత్వపు సౌకర్యాలు/ ప్రసూతి సౌకర్యాల హక్కుకి భంగం కలిగినా చట్ట ప్రకారం శిక్షను నిర్దేశించడం అయింది.

**చట్ట ప్రకారం సౌకర్యాలు:-**

12 వారాల ప్రసూతి సెలవు జీతంతో పాటు పొందవచ్చును. ఇందులో ఆరు వారాలు ప్రసవానికి ముందు, ఆరు వారాలు ప్రసవానంతరం గానీ లేదా అన్నింటినీ ఒకేసారి ప్రసవానంతరం వాడుకోవచ్చును. ఇందుకు సంబంధించి ఒక దరఖాస్తు పత్రం ఉంటుంది. అందులో నామినీ పేరును కూడా సూచించవలసి ఉంటుంది. దాని ప్రకారం జీతంతో కూడిన సెలవుని మంజూరు చేస్తూ మెడికల్ బోనస్‌కి ఉద్యోగినికి కానీ, ఆమె సూచించిన నామినీకి కానీ చెల్లించవలసి ఉంటుంది.

గర్భధారణ సమయంలో ఏవిధమైన అనారోగ్యం ఎదురైనా నెలలు నిండక ముందే ప్రసవించినా, అబార్షన్ జరిగినా కూడా ఈ సెలవును పొందవచ్చును. అబార్షన్/ గర్భస్రావం జరిగిన స్త్రీలు 45 రోజుల వేతనంతో కూడిన సెలవుని పొందవచ్చును.

ప్రసవానంతరం బిడ్డకు 15 నెలలు వచ్చే వరకూ తల్లి సంరక్షణలో అందుబాటులో ఉండాలి. పిల్లలకు తరచుగా వచ్చే జలుబు, జ్వరంలాంటి పరిస్థితులలో 1,2 రోజులు సెలవును మంజూరు చేయాలి. అంతేకాక రోజూ రెండుసార్లు శిశువుకి (పాలిచ్చే తల్లులకు) పాలకోసం విరామం మంజూరు చేయాలి.

అంతేకాదు గర్భధారణ సమయంలో స్త్రీలను పనిసామర్థ్యం తగ్గిందనికాని, సక్రమంగా విధులను నిర్వర్తించలేదని కాని వారిని ఉద్యోగంనుండిగానీ, పనినుండి గానీ తొలగించరాదు. అంతేకాదు వారితో అధిక శ్రమ కలిగిన పనులు చేయించడంగానీ, తల్లీ బిడ్డ ఆరోగ్యానికి నష్టం కలిగించే ప్రదేశాల్లో గానీ పనికూడదు.

ప్రసవ సమయంలో ఏకారణం చేతనయినా స్త్రీ మరణించినపుడు ఆ బిడ్డకు, ఒకవేళ తల్లీ బిడ్డ ఇరువురూ మరణించినట్లైతే ఆమె యొక్క నామినీకి, నామినీ పేరు సూచించకపోయినట్లైతే ఆమె వారసులకు ఆ మెటర్నిటీ పరిహారం మొత్తం యాజమాన్యం చెల్లించాలి.

# ఉద్యమాల బాటలో

**ఐద్వా నిర్మాత నాగళ్ళ రాజేశ్వరమ్మకు సన్మానం:**



**న**వంబరు 24,25 తేదీలలో కృష్ణాజిల్లా కాటూరు గ్రామంలో రాష్ట్ర కమిటీ సమావేశాలు జరిగాయి. ఈ సందర్భంగా మహిళా ఉద్యమ నిర్మాత నాగెళ్ళ రాజేశ్వరమ్మగార్కి సన్మానకార్యక్రమం జరిగింది. ఈ కార్యక్రమంలో రాష్ట్ర కమిటీ సభ్యులతో పాటు డాక్టర్స్, టీచర్స్, రాజేశ్వరమ్మగారితో పనిచేసిన సమకాలికులు హాజరయ్యారు.

**-ఢిల్లీ గ్యాంగ్ రేప్ ఘటనపై:**




చిత్తూరు

స్వతంత్రంగానూ, ఇతర మహిళా సంఘాలు, యువజన, విద్యార్థి సంఘాలతో రాష్ట్ర సెంటర్, జిల్లాలలో బహుముఖ కార్యక్రమాలు జరిగాయి. నిరసన ర్యాలీలు, క్యాండిల్స్, దిష్టిబొమ్మలు దగ్ధం, రాస్తారోకోలు, మిడ్‌నైట్ వాక్‌లు జరిగాయి.

-వర్మ కమిషన్ సూచనలపై ఐద్వా ఆధ్వర్యంలో రౌండ్ టేబుల్ సమావేశం జరిగింది 14 సంఘాల నుండి హాజరయ్యారు. వర్మ కమిషన్‌కు రాష్ట్ర కమిటీ నుండి సూచనలు పంపాం. రాష్ట్ర ప్రభుత్వం తీసుకోవాల్సిన చర్యపై హోంమంత్రికి మెమోరాండం ఇచ్చాము.

విజయవాడలో వర్మ కమిషన్ సిఫారసులపై 800మందితో సదస్సు జరిగింది. పోలీస్ కమిషనర్, ఫ్యామిలీ కోర్టు సెషన్స్ జడ్జి, ఐద్వా రాష్ట్ర కార్యదర్శి, మాంటిస్సోరి విద్యా సంస్థల చైర్మన్ సదస్సులో పాల్గొన్నారు.

-హైకోర్టు ఛీఫ్ జస్టిస్‌కి పోలీస్,న్యాయవ్యవస్థకు జండర్ ధృక్పథంపై అవగాహన కల్పించాలని,చట్టాలలో మార్పులు, మరియు సత్వర న్యాయవిచారణ జరగాలని కోరుతూ మీడియాలో మహిళలను కించపరిచే అశ్లీల అనభ్య పదజాలంపై నియంత్రణ విధించాలని,టివిలలో వస్తున్న వల్గారిటీని నిరోధించిందేందుకు తగు చర్యలు చేపట్టాలని మెమోరాండం యిచ్చాం




తూర్పు గోదావరి

ఫిబ్రవరి 24న హింసకు వ్యతిరేకంగా పోరాడుదాం, హింసలేని సమాజాన్ని సాధిద్దాం, మహిళలు ఇంట్లోను, బహిరంగ ప్రదేశాలలోనూ స్వేచ్ఛగా జీవించే అవకాశాల కోసం పోరాడదాం అని ఐద్వా ఎస్ఎఫ్ఐ, డివైఎఫ్ఐల ఆధ్వర్యంలో హైదరాబాద్, ఖమ్మం, విశాఖ, కృష్ణా, కర్నూలు జిల్లాలో మానవ హారాలు నిర్మించి ప్రతిజ్ఞ చేయటం జరిగింది.

కర్నూలు నగరంలో పగలూ మాదే-రాత్రిమాదే స్లోగన్‌తో 1500మందితో భారీ ర్యాలీ జరిగింది.




నల్గొండ

ఆశారాం బాపూ, బొత్సాసత్యనారాయణ, ఆర్ఎస్ఎస్ చీఫ్ మోహన్ భగవత్ వ్యాఖ్యలకు నిరసనగా జిల్లాలలో దిష్టిబొమ్మ దగ్ధం చేశారు.

-ఫిషరీస్ కాలేజీ ప్రిన్సిపల్ విద్యార్థిని లైంగిగిక వేధింపులకు గురిచేసిన కేసులో అతనిని సస్పెండ్ చేయాలని కోరుతూ హోంమంత్రికి మెమోరాండం ఇవ్వటం జరిగింది.

-బొత్స సత్యనారాయణ వ్యాఖ్యలను నిరసిస్తూ విశాఖ సిటీ వినూత్నరీతిలో ఆందోళన చేసింది.

ఆశారాం బాపూ వ్యాఖ్యలపై హైదరాబాద్‌లోను రాష్ట్ర వ్యాప్తంగా దిష్టిబొమ్మ దగ్ధం చేయటం జరిగింది.

**ఉస్మానియా విద్యార్థి అరుణ హత్యపై :** ఉస్మానియా లా స్టూడెంట్ హత్యకేసు విషయంలో ముద్దాయిలను అరెస్టు చేయాలని ఐద్వా, ఎస్ఎఫ్ఐతో కల్సి ప్రదర్శనలు, ధర్నాలు జరిపింది. ఉస్మానియా స్టూడెంట్సు చేస్తున్న రిలేదీక్షకు రాష్ట్ర సెంటరు నుండి సంఘీభావం తెలిపాం.

**నగదు బదిలీ పథకంపై :** నగదు బదిలీపై కరపత్రాల ద్వారా ప్రచారం చేస్తూ రేషన్ షాపుల వద్ద, కూడళ్ళలోను సంతకాల సేకరణ జరిగింది.


హైదరాబాద్

**4-గ్యాస్ సిలిండర్స్ కుదింపుపై :** విశాఖ నగరకమిటీ అపార్టుమెంట్లు,మధ్యతరగతి నివసించే ప్రాంతాలలో విస్తృతంగా సమావేశాలు జరిపి ప్రధానమంత్రికి పోస్టుకార్డుల కార్యక్రమం నిర్వహించింది. మిగతా జిల్లాల్లో పోస్టు కార్డు కార్యక్రమం జరుగుతున్నది.

**హాస్పిటల్ సమస్యలపై :** 5-ఎం.జి.ఎం హాస్పిటల్‌కు ప్రభుత్వం ప్రకటించిన 32 కోట్లు రిలీజు చేయాలని మూడు రోజులు రిలే నిరాహార దీక్షలు జరిగాయి. 300 మంది పాల్గొన్నారు. కలెక్టరేట్ పికెటింగ్‌లో 240 మంది పాల్గొన్నారు.

**ఎగ్జిబిషన్ :** 6-సరళీకరణ విధానాలు -మహిళలపై ప్రభావం పై విశాఖ సిటీకమిటీ ఎగ్జిబిషన్ తయారుచేసి డివిజన్స్‌లో విస్తృత ప్రచారం నిర్వహించింది

**అందాల పోటీలను వ్యతిరేకిస్తూ :** విజయవాడ,విశాఖ నగరాలలో అందాల పోటీలకు వ్యతిరేకంగా ఆందోళన నిర్వహించి పోటీలను నిలుపుదల చేయించారు.విశాఖ నగరంలోకింగ్‌ఫిషర్ సంస్థహైదరాబాద్ నుండి 50మంది సెలబ్రిటీస్‌లతో నిర్వహించ తలపెట్టిన అందాలపోటీలను మహిళా సంఘాల అధ్వర్యంలో 4రోజులపాటు వివిధ రూపాలలో ఉద్యమాలు నిర్వహించి పోటీలను నిలవరించి విజయం సాధించారు.

**డా॥ టాన్యా గారి జయంతి:** డిశంబర్ 14న డా॥ టాన్యా గారి జయంతి సందర్భంగా ఒంగోలు,నార్మన్ బెతూన్ నర్సింగ్ హోమ్‌లో రొమ్ము క్యాన్సర్, గర్భ సంచి క్యాన్సర్ పై అవగాహన సదస్సు జరిగింది. 160 మంది మహిళలకు ఉచిత స్క్రీనింగ్ టెస్టులు నిర్వహించారు.

**మద్యానికి వ్యతిరేకంగా:** పశ్చిమగోదావరి జిల్లా ఆకివీడులో బెల్టుషాపులకు వ్యతిరేకంగా ఆందోళన చేసి తొలగించారు. ప॥గోదావరి జిల్లా రేలంగి గ్రామంలో జనావాసాలలో ఉన్న మద్యం షాపును తొలగించాలని ఐద్వా ఆధ్వర్యంలో ఆందోళన జరిగింది. జనావాసాలలో వున్న మద్యం షాపును ఊరి బయటకు తరలించటం జరిగింది.

**హింస:**



తూ॥ గోదావరి

నల్గొండజిల్లాలో రెండున్నర సంవత్సరాల పాపపై ఇద్దరు మైనర్స్ అత్యాచారానికి పాల్పడిన ఘటనపై ధర్నాచేసి కలెక్టర్‌కి మెమోరాండం యిచ్చారు. కలెక్టర్ మన సంఘం పెట్టిన డిమాండ్స్‌కి



అనంతపురం



విశాఖ


మహబూబ్‌నగర్

అంగీకరించి లక్ష రూపాయలు ఎక్స్‌గ్రేషియా ఇచ్చి ఇద్దరు నిందితులనుఅరెస్టు చేశారు.

నవంబరు 25 హింసా వ్యతిరేక దినం నుండి డిశంబరు 10మానవ హక్కుల దినం సందర్భంగా ఐద్వా రాష్ట్ర కమిటీ హింసావ్యతిరేక ప్రచారం పక్షం రోజులపాటు నిర్వహించింది. కాలేజీలలో సెమినార్లు, సదస్సులు, ర్యాలీలు జరిగాయి. సరళీకరణ విధానాల వలన సమాజంలో అనేక మార్పులు చోటు చేసుకున్నాయి. సినిమాలు, టివి. ఇంటర్‌నెట్‌లు, ఫేస్‌బుక్‌లు, ట్విట్టర్, యూట్యూబ్‌లలో నెలకొంటున్న విష సంస్కృతి విద్యార్థినీ విద్యార్థుల ప్రవర్తనను, మనో వికాసాన్ని దెబ్బతీస్తున్నాయి, మానవీయ విలువలు నశిస్తున్నాయి. ఆడపిల్లలపై ఈవ్ టీజింగ్, ర్యాగింగ్, లైంగిక వేధింపులు, ప్రేమ పేరుతో ఉన్మాదుల దాడులు, అత్యాచారాలు, ట్రాఫికింగ్ పెరుగుతున్నాయి. ఈ విష సంస్కృతికి వ్యతిరేకంగా



నెల్లూరు

విద్యార్థులలో మానవతా విలువలతో కూడిన సుహృద్భావ వాతావరణాన్ని నెలకొల్పాల్సిన అవసరం ఎంతైనా ఉంది. అవగాహన సదస్సులు రాష్ట్రంలో 200 కాలేజీలకు పైగా జరిగాయి. కాలేజీ యాజమాన్యం, విద్యార్థుల నుండి ఇలాంటి అవగాహన సదస్సులు ఉపయోగకరంగా,అవగాహన కల్గించే విధంగా ఉన్నాయని వీటిని కొనసాగించాలని కోరారు. వేల సంఖ్యలో విద్యార్థినీ, విద్యార్థులు పాల్గొన్నారు.

**గ్రీటింగ్స్:**

నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేస్తూ మలాలా ఫోటోతో "అక్షరం కోసం మలాలా సాహసం అతివలందరికీ ఆదర్శం, ఎగరేద్దాం చైతన్య కేతనం" కొటేషన్‌తో గ్రీటింగ్ కార్డులు పంచటం జరిగింది.

**సంక్రాంతి ఆటలపోటీలు:-** మహిళలలో ఉన్న సృజనాత్మకతను వెలుగులోకి తెచ్చేందుకు, కుల మతాలకు అతీతంగా ఐద్వా కమిటీలు ప్రతి సంవత్సరం క్రిస్టమస్, సంక్రాంతి పండుగల సందర్భంగా ఆటలపోటీలు 23 జిల్లాల్లో గ్రామ స్థాయి వరకూ నిర్వహిస్తున్నాయి. 2013లో ఆటల పోటీలు 1,000 సెంటర్లలో జరిగాయి. వేలాదిమంది ఈ పోటీలలో పాల్గొన్నారు.

**విద్యా వైజ్ఞానిక తరగతులు:** ప్రకాశం జిల్లా



ప్రకాశం

ఒంగోలు-60మందికి, పామూరులో 90 మందికి, కందుకూరులో 70 మందికి ఒకరోజు కార్యకర్తలకు శిక్షణా తరగతులు జరిగాయి.

ఐద్వా పశ్చిమగోదావరి జిల్లా కమిటి 2013 క్యాలెండర్‌ను విడుదల చేస్తున్న జిల్లా కలెక్టర్.


పశ్చిమగోదావరి

# వివాహా శుభాకాంక్షలు



## 12-12-12న వివాహాం జరిగిన
## భరత్, మాధురి లకు
## చైతన్య మానవి శుభాకాంక్షలు

# భరత్
## వెడ్స్
# మాధురి

"CHAITANYA MANAVI R.No. APTEL/2006-20 00

# నిర్భయ స్ఫూర్తి

నీవు మృత్యువుతో పోరాడి మరణించినా గెలిచావు
దేశ ప్రజల గుండెల్లో నిలిచి
యావత్ దేశాన్ని పోరుబాట వైపు మలిపావు
నిర్భయా! నీ స్ఫూర్తితో ఈ పోరు కొనసాగిస్తాం
నీ కడసారి కోరిక తీరుస్తాం...

నీకీగతి పట్టించిన కామోన్మాదుల్ని
విశ్వాసం చూపే ఊర కుక్కలుసైతం పోల్చుకో దగవు
మదపుటేనుగుతో పోలిస్తే
గజరాజులు సైతం ఆక్రోశించకుండవు
నరరూప రాక్షసులు అందామంటే
అంత కంటే క్రూరమైంది వారి జీవితం...

నిర్భయా! నీ వలె మరెందరో..
కసాయి కర్కోటకుల కామ దాహానికి బలైన
అతివలకు జోహార్లర్పిస్తూ
ఏ ఆడపిల్ల అత్యాచారానికి గురికాని
సమ సమాజం వచ్చేంత వరకు ఏకమై గర్జిస్తాం
స్త్రీ పురుష అసమానతలు రూపుమాపే
మరో ప్రపంచం సాధిస్తాం

- షేక్ సలీమా



| | |
|---|---|
| మనసు ఫౌండేషన్ | |
| పుస్తకాల పరిశీలనాపట్టిక | |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01 A 138 |
| పుస్తకం పేరు | చైతన్య వాహిని |
| తారీఖు | 21/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | N6 |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sandhya |
| పేజీలు విడదీసినది | Sandhya |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |